# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 11 సంచిక : 6 హైదరాబాద్ 143 జూన్ 2013 పేజీలు : 68 రు. 15

* ఆంధ్రప్రదేశ్ - కప్పల తక్కెడ రాజకీయాలు
* చత్తీస్‌గడ్ పరిణామాలు
* కూడంకుళం - సుప్రీంకోర్టు తీర్పు
* నియమ్‌గిరి తీర్పు - గ్రామసభ అధికారం
* భారత్ - చైనా సరిహద్దు సమస్య
* బంగ్లాదేశ్‌లో పెట్టుబడి బీభత్సం
* వ్యవస్థీకృత అవినీతి

అమ్మకానికి సిద్ధంగా ఉంది

**వీక్షణం**

**పది సంవత్సరాల**

**డివిడి**

**రు. 200**




గ్రామ అధ్యయనాల చరిత్ర, గ్రామ అధ్యయనాల పద్ధతి మీద
తెలుగులో మొదటి పుస్తకం

వీక్షణం పబ్లికేషన్స్




# ఊరి దారి

## గ్రామ అధ్యయనాల పరిచయం

**ఎన్. వేణుగోపాల్**

**పేజీలు: 164** **వెల: రు. 60**

వివరాలకు

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

ISSN 2231-6892

143

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జూన్ 2013

సంపుటి : 11

సంచిక : 6



## లోపలి పేజీల్లో...





ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం

మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం ఆర్థిక స్థితి గురించిన విజ్ఞప్తికి ప్రతిస్పందనగా సామాన్య కిరణ్ ఫౌండేషన్ రు. 15,000 ఆర్థిక సహాయం అందించారు. వారికి కృతజ్ఞతలు**

**మా**ర్చ్ సంచిక సంపాదకీయంలో ఒక అభిప్రాయంపై రెండు మాటలు. దిల్‌సుఖ్‌నగర్ పేలుళ్ల ఘటన ఎందుకు జరిగిందో మౌలిక కారణాలు వెదకడం చాలా పెద్దపని అంటూనే... ఒక్కో అనుమానాన్ని నివృత్తి చేసుకుంటూ పోవాలన్నారు. అదే సమయంలో ఎవరెవరు ఇలాంటి నేరాలు చేసే అవకాశం ఉందో పరిశీలించాలన్నారు. ప్రభుత్వాలు, ప్రతిపక్షాలు అందుకు తెగబడే అవకాశం ఉందని కూడా అనుమానించాలన్నారు. మక్కా మసీదు పేలుళ్లను ఉటంకిస్తూ ఓ పర్టికులర్ సంస్థను పరోక్షంగా ఎత్తిచూపారు. కసబ్ ఉరితీత తరువాత భారత్ పై మరిన్ని దాడులు చేస్తామని ఉగ్రవాదులు అంతకుముందే హెచ్చరించినట్టు వార్తలు వచ్చాయి. రాష్ట్ర ప్రభుత్వాలకు ఇంటెలిజెన్స్ హెచ్చరికలు వెళ్లాయి. ఇది గుర్తుంచుకోవాల్సిన విషయం. అసలు ఏ విచారణకైనా, ఏ అనుమాన నివృత్తికైనా ముందుగా ఏదో ఒక ఆధారంతో ముందుకెళ్లాలి. ఆ ప్రయారిటీలోనే మిగతా అనుమానితు లనూ విచారించాలి. విచిత్రంగా మీరు ఉగ్రవాదుల ఈ-మెయిల్స్ గానీ, వారి బెదిరింపులను గానీ అనుమానించాల్సిన అవసరాన్ని పట్టించుకున్నట్టు లేదు. ఎన్ఐఏ అధికారులు అనుమానితులను విచారించారు. ఇప్పటికీ అనుమానితుల విషయంలో వారికి ఆధారాలేమీ చిక్కలేదు. వారి విచారణలో వేధింపులున్నాయని మీరు అభిప్రాయపడుతున్నట్టు అనిపిస్తోంది. నేరమో, ఘోరమో జరిగినప్పుడు ఉన్న ఆధారాల ఆసరాతో లోతైన విచారణ జరగాల్సిందే. అందుకు భిన్నంగా నేరం ఎందుకు జరిగిందో కారణాలు వెదకడంపై దృష్టి సారిస్తే విచారణ ఆగిపోతుంది. మరో కొత్త నేరం, మరింత తీవ్రమైన ఘోరం జరిగిపోయే ప్రమాదముంది. కాబట్టి విచారణ జరగాల్సిందే. కారణాల అన్వేషణ అనేది చాలా పెద్ద ప్రక్రియ. అది ఆ ఒక్క నేరంతో పరిమితమయ్యే విషయం కాదు. ఒక్కోసారి లేదా అనేకసార్లు విస్తారమైన సామాజిక కోణాల గుండా అన్వేషణ సాగాల్సి ఉంటుంది. కాబట్టి అన్వేషణ అనేది వేరే సుదీర్ఘ పార్శ్వం. అంతే తప్ప దగ్గరున్న ఆధారాలను విస్మరించి కారణాల అన్వేషణకు ఉపక్రమించడం సత్ఫలితాలివ్వదేమో. ఆలోచించాలి.

**- టి. రమేష్‌బాబు**

*(వీక్షణం బ్లాగ్ www.veekshanam.wordpress.com పై పోస్ట్ చేసిన వ్యాఖ్య)*

**2013** ఏప్రిల్ వీక్షణంలో చావెజ్ పైన వచ్చిన అభిప్రాయాలను విశ్లేషిస్తూ వీక్షణం 2013 మే సంచికలో జి.సత్యనారాయణ రెడ్డి ఒక వ్యాసం రాశారు. ఈ వ్యాసంలో సత్యనారాయణరెడ్డి చావెజ్ గురించి చేసిన విశ్లేషణతో నాకూ అంగీకారం ఉంది. కానీ చావెజ్ పాత్రను విశ్లేషించే పేరుతో కాలంచెల్లిన మూడు ప్రపంచాల సిద్ధాంతం గురించి గొప్పగా చెప్పడమే విచిత్రంగా ఉంది. ఈ వ్యాసం నిజంగా చావెజ్ గురించి రాసిందా లేక మూడు ప్రపంచాల సిద్ధాంతం ప్రచారం కొరకు రాసిందా అనే అనుమానం కూడా వస్తుంది. మిగతా వారు చావెజ్‌ను తప్పుగా అంచనా వేశారనుకుంటే, సరి అయినది అనుకున్న అంచనాను ఎవరైనా ఇవ్వవచ్చు. చావెజ్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకి అనో, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఇతర దేశాలను కూడగట్టాడు అనో ఆధారాలు ఉంటే చూపిస్తూ కూడా నిరూపించ వచ్చు. కాని మూడు ప్రపంచాల సిద్ధాంతంతో సంబంధం లేని చావెజ్‌ను తీసుకు వెళ్లి మూడు ప్రపంచాల సిద్ధాంతానికి అంటగట్టడం అభ్యంతరకర విషయం. అసలు మూడు ప్రపంచాల సిద్ధాంత ఆవిర్భావమే వివాదాస్పదం. ఇంత 'గొప్ప' సిద్ధాంతాన్ని, మావో ఒక మూడవ ప్రపంచ దేశ నాయకుని చెవిలో గుసగుసగా చెప్పాడు అంటేనే ఎవరికీ మింగుడు పడదు. కార్మికవర్గ అంతర్జాతీయ కర్తవ్యాలు పార్టీ తీర్మానాలుగా, డాక్యుమెంట్లుగా ఎందుకు లేవు? మూడు దశాబ్దాల క్రితమే ఆంధ్రప్రదేశ్‌లో ఈ సిద్ధాంతం పైన గొప్ప చర్చలు జరిగినాయి. పెద్ద పెద్ద పుస్తకాలూ ప్రచురించబడినాయి. కాని ఆచరణకు పనికిరాని ఈ సిద్ధాంతం కాలం చేసి కూడా చాలా కాలమే అయింది. ఎప్పుడో కాలం చేసిన ఆ కళేబరంలోకి మళ్లీ చొరబడాల్సిన అవసరం లేదు. అది చచ్చిన శవమే అని వర్తమాన చరిత్ర ఆధారంగానే నిరూపించవచ్చు. చావెజ్ కానీ ఆయన లాంటి మరో ఇద్దరు, ముగ్గురు దేశాధి నేతలు అమెరికాకు వ్యతిరేకంగా నిలబడినప్పుడు, సత్యనారాయణరెడ్డి రెండవ ప్రపంచపు దేశాలుగా చెప్పిన జపాన్, కెనడా, యూరప్ దేశాలు ఏవీ కూడా చావెజ్‌కు, ఆయన మిత్రులకు అండగా నిలువ లేదు. మద్దతుగా ముందుకు రాలేదు. రాకపోగా అమెరికాను వ్యతిరేకించే దేశాలపై అమెరికా విధించే ఆంక్షలను బలపరిచినారు. అమెరికా చేసిన దాడులకు ఆర్థిక, ఆయుధ, సైనిక సహాయాలను చేశారు. ఇప్పటికీ చేస్తున్నారు. మిగతా సామ్రాజ్యవాద దేశాలకు అమెరికాతో ఎన్ని వైరుధ్యాలు ఉన్నప్పటికీ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించే మూడవ ప్రపంచ దేశాలను అణచడంలో అన్ని సామ్రాజ్యవాద దేశాలు ఐక్యమవుతున్నాయి. ఎప్పటివో ఉదాహరణలు అవసరం లేదు. నిన్న మొన్నటి ప్రపంచ ఘటనా క్రమాన్ని చూసినా ఈ విషయం స్పష్టంగా అర్థం అవుతుంది. లిబియాలో అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టి దాన్ని హైజాక్ చేసి అమెరికా గడాఫీని హత్య చేయించినప్పుడు అన్ని అంతర్జాతీయ నియమాలను ఉల్లంఘించి సిరియాలో భయంకరమైన అంతర్యుద్ధాన్ని రెచ్చ గొడుతున్నప్పుడు, ఇజ్రాయిల్ ద్వారా బాంబులు వేయిస్తున్నప్పుడు ఏ రెండవ ప్రపంచ దేశమూ ఖండించలేదు. ఖండించక పోగా సిరియా రసాయనిక ఆయుధాలు వాడుతున్నదని ఆధారాలు లేకున్నా యూరోపియన్ దేశాలు ప్రచారం చేస్తున్నాయి. మాస్ డిస్ట్రక్షన్ ఆయుధాలు ఉన్నాయనే పేరుతో ఇరాక్‌పైన దాడి చేసినట్లుగా రసాయనిక

*(మిగతా 52వ పేజీలో...)*

**సవరణలు**

*మే సంచికలో వరవరరావు వ్యాసం 'అమరత్వానికి అటూ ఇటూ' 17వ పేజీలో రెండోకాలంలో 3వ పాయింట్‌లో ఎట్టి నర్సక్క (33) సబిత - అమరుడు బడే నాగేశ్వరరావు సహచరి అని పొరపాటుగా అచ్చయింది. ఆమె బడే చొక్కారావు అలియాస్ దామోదర్ సహచరి అని చదువుకోవాలి.*

*పి.వి. రమణ వ్యాసం 'నోవార్టిస్‌కు సుప్రీంకోర్టు చెంపదెబ్బ' 14వ పేజీ మూడో పేరాలోని నాలుగో లైన్‌లో బిలియన్ డాలర్లు అని పొరపాటుగా అచ్చయింది. దానిని మిలియన్‌లుగా సవరించుకోవాలి.*

*డా. నళిని 'పిల్లల అనారోగ్యానికి అద్దం పట్టిన కాగ్' వ్యాసంలో 29వ పేజీలో ఐదవ పేరాలో నాల్గవ లైన్‌లో ఐదు సంవత్సరాల లోపు అని పొరపాటుగా అచ్చయింది. అది సంవత్సరం లోపు అని సవరించుకోవాలి. పొరపాట్లకు చింతిస్తున్నాం. - సం*

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ - డి. విజయభాస్కర్; కరీంనగర్ - ద్యామర రేణుక; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; నల్గొండ - గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ - ఎం. నర్సయ్య; రంగారెడ్డి - వి. శంకరయ్య; వరంగల్ - ఎ.కుమార్; అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు - బాలగురువయ్య; విజయనగరం - డి. సుధాకర్; విశాఖపట్నం - పి.వి. రమణ; శ్రీకాకుళం - డి. రవికుమార్

# దొంగల బృందంలో సభ్యుల వ్యక్తిగత బాధ్యత

'చేపా చేపా ఎందుకు ఎండలేదు' అనే మామూలు ప్రశ్న అడిగితేనే ఎన్నెన్ని సాకులూ డొంకతిరుగుళ్లూ పక్కదార్లూ అడ్డదార్లూ తొక్కి కథ చివరికి కంచికి చేరుతుందో మనందరికీ తెలుసు. ఇక 'అవినీతీ అవినీతీ నీ మూలం అధికార పీఠంలోనేనా' అనే లోతయిన ప్రశ్న వేస్తే మరెన్ని సాకులూ డొంకతిరుగుళ్లూ పక్కదార్లూ అడ్డదార్లూ పిల్లి మీద ఎలక, ఎలక మీద పిల్లి ఆరోపణలూ బుడిబుడి ఏడుపులూ అమాయకత్వపు నటనలూ రాజీనామా నాటకాలూ రాజీనామా ఆమోదానికి తాత్సారాలూ ఉంటాయి?! వేల కోట్ల రూపాయల కుంభకోణాలలో మంత్రివర్గ బాధ్యత గురించి ఇవాళ ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలో, అధికార కాంగ్రెస్ పార్టీలో, ఢిల్లీ అధిష్టానంలో అడుగడుగునా జరుగుతున్న రసవత్తరమైన నాటకం ఆ ఎండని చేప కథనే గుర్తు తెస్తున్నది. గత ప్రభుత్వ కుంభకోణాలలో భాగస్వామ్యం ఉన్నదని అభియోగం ఎదుర్కొంటున్న ఆరుగురు రాష్ట్ర మంత్రులను తొలగించాలా లేదా, వారిలో ఇద్దరు సమర్పించిన రాజీనామాలు ఆమోదించాలా లేదా, వారికి ఆ నేరంలో పాత్రం ఉన్నట్టా లేదా వంటి ప్రశ్నల మీద అధికార కాంగ్రెస్ నాయకులు ఢిల్లీలోను, హైదరాబాద్ లోను తర్కవితర్కాలు నడుపుతున్నారు.

ఈ కథ అత్యంత విషాదకరమైనదీ, జుగుప్సాకరమైనదీ. కాని దీనిలో హాస్యాస్పద అంశాన్ని చూడడం తప్ప మరేమీ చేయలేని నిస్సహాయ స్థితి ఇవాళ నెలకొని ఉంది. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉండగా 2007, 2008, 2009లలో విడుదలైన 26 ప్రభుత్వ ఉత్తర్వులు అవినీతికరమైనవని, రాజశేఖరరెడ్డి కుటుంబ సభ్యులకు, ముఖ్యంగా కుమారుడు జగన్‌కు ఆస్తులు కట్టబెట్టేందుకే ఆ జివోలు ఇవ్వడం జరిగిందని సిబిఐ తన అభియోగపత్రాలలో ఆరోపించింది. ఆ జివోల ద్వారా ప్రత్యక్షంగా జగన్ సొంత కంపెనీలకు, పరోక్షంగా నిమ్మగడ్డ ప్రసాద్, గాలి జనార్దనరెడ్డి, ఇండియా సిమెంట్స్, పెన్నా గ్రూప్, రాంకి గ్రూప్, దాల్మియా సిమెంట్స్‌ల ద్వారా జగన్‌కు వేల కోట్ల రూపాయల ఆస్తి కట్టబెట్టడం జరిగిందని సిబిఐ ఆరోపించింది. ఆ జివోల విడుదలలో అప్పుడూ ఇప్పుడూ అధికారంలో ఉన్న ఆరుగురు మంత్రులకు, ఎనిమిది మంది ఐఎఎస్ అధికారులకు పాత్ర ఉన్నదని సిబిఐ అభిప్రాయపడింది. సిబిఐ పరమ పవిత్రమైనదేమీ కాదు, రాజకీయ ప్రత్యర్థుల మీద కక్ష తీర్చుకునేందుకు, లొంగదీసుకునేందుకు సిబిఐని ప్రయోగిస్తున్నారని, ఎంతో ఆర్భాటం చేసిన కేసుల్లో కూడ ఆ ప్రత్యర్థులు లొంగిపోతే ఏమీ జరగడం లేదని అందరికీ తెలుసు. అయితే అది ఇక్కడ అప్రస్తుతం. ఇక్కడ ఆ కుంభకోణాల మీద సిబిఐ ఏమంటున్నదనేది ప్రధానం కాదు, ఆ కుంభకోణాలు జరిగాయన్నది పట్టపగటి లాంటి సత్యం.

జగన్ అక్రమాస్తుల కేసులో సిబిఐ అభియోగపత్రాన్ని దాఖలు చేసి చాలరోజులయ్యాక కూడ అందులో ప్రస్తావనకు వచ్చిన ఆరుగురు మంత్రుల (మోపిదేవి వెంకటరమణ, ధర్మాన ప్రసాదరావు, సబితా ఇంద్రారెడ్డి, గీతారెడ్డి, పొన్నాల లక్ష్మయ్య, కన్నా లక్ష్మినారాయణ) పైన, ఎనిమిది మంది ఐఎఎస్ అధికారులపైన చర్యలు ఎందుకు తీసుకోవడం లేదని సుప్రీం కోర్టు ముందరికి ఒక ప్రజాప్రయోజన వ్యాజ్యం వచ్చింది. వారి మీద సిబిఐ చర్యలు కొనసాగించడానికి అవసరమైన అనుమతి ఇవ్వవలసిందేనని సుప్రీంకోర్టు 2012 మార్చ్‌లో రాష్ట్రప్రభుత్వాన్ని ఆదేశించింది. రాష్ట్ర ప్రభుత్వం మూడు నెలల లోపు ఆ అనుమతి ఇవ్వవలసి ఉండగా, ఆరు నెలలు జాప్యం చేసి ఆ అనుమతి ఇవ్వగూడదని మంత్రివర్గ సమావేశంలో తీర్మానించింది. ఈ లోగా నాటకం మరిన్ని మలుపులు తిరిగింది. సిబిఐ విచారించదలచిన ఆరుగురు మంత్రులు, ఎనిమిది మంది అధికారులు ఏ తప్పూ చేయలేదని ప్రభుత్వం తనంతట తానే నిర్ణయించింది. వారి కోర్టు కేసులకు అయ్యే ఖర్చునంతా ప్రజాధనం నుంచి భరించడానికి, వారికి న్యాయసహాయం అందించడానికి నిర్ణయించింది. ఈ లోగా ఆ ఆరుగురు మంత్రులలో ఒకరైన మోపిదేవి వెంకటరమణ మీద ఎక్సైజ్ కుంభకోణపు ఆరోపణలు కూడ వచ్చి ఆ కేసులో ఆయనను అరెస్టు చేయకతప్పని స్థితి వచ్చాక ఆయన రాజీనామా చేశారు. తర్వాత 2012 ఆగస్ట్‌లో సిబిఐ దాఖలు చేసిన మరొక అభియోగపత్రంలో ధర్మాన ప్రసాదరావు పేరు ప్రస్తావనకు వచ్చింది. ఆయన వెంటనే తన రాజీనామా పత్రాన్ని ముఖ్యమంత్రికి ఇచ్చారు గాని ఆ రాజీనామాను తిరస్కరించనూ లేదు, ఆమోదించనూ లేదు. అప్పటినుంచి మే 2013 దాకా, తొమ్మిది నెలలు ఆయన రాజీనామా చేశారు గనుక కార్యాలయానికి వచ్చి పని చేయనూ లేదు. రాజీనామా ఆమోదించలేదు గనుక మంత్రికి ఉండే సకల సదుపాయాలూ అనుభవిస్తూ వచ్చారు. (ఇంత అసహ్యకరమైన ప్రజాస్వామిక ప్రభుత్వం మీద ఇంకా నమ్మకం ఉన్నవాళ్ల సహనానికి జోహార్లు!)

ఆ తర్వాత మే 2013లో దాఖలు చేసిన మరొక అభియోగపత్రంలో సబితా ఇంద్రారెడ్డి పేరు ఉండడంతో ఆమె కూడ రాజీనామా సమర్పించి, అది ఆమోదించబడని స్థితిలో మూడు వారాలు గడిపారు. ఈ లోగా కేంద్ర ప్రభుత్వంలో కూడ అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న ఇద్దరు మంత్రులు రాజీనామా చేశారు. రాష్ట్రమంత్రులు కూడ రాజీనామా చేయాలని అధిష్టానం పట్టుబడుతున్నదని వార్తలు వచ్చాయి. కాని కొత్తగా రాజీనామాలు చేయనవసరమే లేదు, ఎనిమిది నెలలకు పైగా, మూడు వారాలుగా ఉన్న రాజీనామాలను ఆమోదిస్తే చాలు. ఎట్టకేలకు మే 26న ఆ రెండు రాజీనామాలను ఆమోదించారు. ఇక మిగిలిన ముగ్గురు మంత్రుల విషయంలో, ఐఎఎస్ అధికారుల విషయంలో ఇటువంటి నాటకం ఎన్నాళ్లు సాగుతుందో తెలియదు. నిజానికి ఆరోపణలు రావడమే మంత్రులకు, అధికారులకు అదనపు అర్హత అని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తుందనడానికి చిహ్నంగా గుజరాత్‌లో ఒక బూటకపు ఎన్‌కౌంటర్ చార్జిషీట్‌లో పేరు ఉన్నదని బైటపడిన వారంలోపలే ఒక పోలీసు అధికారికి పదోన్నతి బహుమతి ఇచ్చింది.

దొంగల రాజ్యంలో నిర్వాహకవర్గంలో సభ్యులైనవారందరికీ ఆ దొంగతనంతో సంబంధం ఉన్నట్టే. అందులో కొందరిని వేరుచేసి విచారణ జరపడం, మిగిలినవారు పవిత్రులన్నట్టు మాట్లాడడం గొంగట్లో తింటూ వెంట్రుకలు ఏరడం లాంటిది. కొనసాగుతున్న పాలనే అవినీతికి మూలమని, ఇందులో కొందరి అవినీతి బయటపడడం యాదృచ్ఛికమని గుర్తించి అసలు పాలనావ్యవస్థను మార్చేదాకా ఈ నాటకాలు చూడక తప్పదు. వీ

# బహుళజాతి సంస్థల సేవలో భారత సుప్రీం కోర్టు

బ్రాహ్మల్లో కూడ మహాత్ములుంటారని గిరీశం అన్నట్టు అప్పుడప్పుడు సుప్రీం కోర్టు కూడ మంచి తీర్పులు ఇస్తూ ఉంటుంది. న్యాయస్థానాలు కూడ వర్గపాలనలో, రాజ్యాంగయంత్రంలో భాగమన్న మాట మరచిపోయి సుప్రీం కోర్టు తీర్పులను ప్రగతిశీల మేధావులు కూడ సమర్థిస్తుంటారు. కాని సాధారణంగా ఆ మంచి తీర్పులన్నీ పాలకవర్గ ముఠాల మధ్య తగాదా వచ్చినప్పుడు ఒక ముఠాకు వ్యతిరేకంగా మరొక ముఠా కోసం వచ్చేవే. లేదా ఆ న్యాయపీఠం మీద కూచున్న న్యాయమూర్తి తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకోవడానికి ఇచ్చేవైనా కావచ్చు. అవి అరుదైన మినహాయింపులే గాని అవే ప్రధానం కాదు. న్యాయస్థానం, అందులోనూ అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీం కోర్టు వ్యవస్థకు వ్యతిరేకంగా ఎప్పుడూ మాట్లాడదు. మరీ ముఖ్యంగా ప్రజలకూ వ్యవస్థకూ మధ్య ఘర్షణ వచ్చినప్పుడు న్యాయస్థానం తప్పనిసరిగా పాలకవర్గ ప్రయోజనాలను కాపాడడానికే, వ్యవస్థను యథాతథ స్థితిలో ఉంచడానికే తన ప్రతిభనంతా ఉపయోగిస్తుంది. అటువంటి తీర్పులే ఇస్తుంది. గడిచిన నెలలో సుప్రీం కోర్టు ఇచ్చిన నాలుగు తీర్పులు ఈ అంశాన్ని మరొకసారి రుజువు చేస్తున్నాయి. చిల్లర వర్తకంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని ఆమోదించడానికి వ్యతిరేకంగా భారత సమాజం మొత్తం నిరసన ప్రకటించింది. పార్లమెంటరీ రాజకీయ పక్షాలలో కూడ కొన్ని అరకొరగానైనా నిరసన తెలిపాయి. అయినా మే 1న ఇచ్చిన ఒక తీర్పులో సుప్రీంకోర్టు 'వినియోగదారుడే రాజు అనే సూత్రాన్ని అమలు చేయడానికి వస్తున్న ఈ విధానంలో తప్పేముంది' అని ప్రశ్నించింది. భారత ప్రభుత్వం సుదీర్ఘమైన, వివరమైన చర్చ తర్వాతనే విదేశీ ప్రత్యక్షపెట్టుబడిని అనుమతిస్తున్నదని కితాబు ఇచ్చింది. అలాగే మే 6న ఇచ్చిన తీర్పులో కూడంకుళం అణు విద్యుత్ కర్మాగారాన్ని ప్రభుత్వం ప్రజాసంక్షేమం కోసం ఏర్పాటు చేస్తున్నదనీ, అది సుస్థిర అభివృద్ధికి అవసరమనీ, దాన్ని ఆపనక్కరలేదనీ ప్రకటించింది. ప్రపంచవ్యాప్తంగా అణు ఇంధన కర్మాగారాల భద్రత గురించి జరుగుతున్న చర్చను గాని, కూడంకుళం ప్రాంత ప్రజా ఆందోళనను గాని ఎంతమాత్రం పరిగణనలోకి తీసుకోలేదు. ఇక చమురు, సహజవాయు నిక్షేపాల విషయంలో కెయిర్న్ – వేదాంత ఒప్పందంలో ఒక లక్షకోట్ల రూపాయల ప్రజా నిధుల కైంకర్యం జరిగిందని కాగ్ ఇచ్చిన నివేదికపై చర్యలు తీసుకోవాలని వచ్చిన వ్యాజ్యంలో మే9న ఇచ్చిన తీర్పు మరింత విడ్డూరం. బహుళజాతి సంస్థల తరపున వకాల్తా పుచ్చుకుని అక్కడ అక్రమమేదీ జరగలేదని, తాము జోక్యం చేసుకోనవసరం లేదని సుప్రీంకోర్టు ప్రకటించింది. ఒడిషాలో దక్షిణ కొరియా బహుళ జాతి సంస్థ పోస్కోకు ఇనుప ఖనిజ నిలువలను అప్పగించాలని రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని గతంలో ఒడిషా హైకోర్టు కొట్టివేయగా, మే 9న సుప్రీం కోర్టు ఆ హైకోర్టు తీర్పును కొట్టివేసి, గనులను పోస్కోకు అప్పగించాలని ఆదేశించింది. సుప్రీం కోర్టు చిల్లర మల్లర కేసుల్లో ప్రజానుకూలమైనట్టు కనిపించవచ్చు గాని బహుళజాతి సంస్థల ప్రయోజనాలను కాపాడేందుకు భారత ప్రజల ప్రయోజనాలను తాకట్టు పెడతానని బహిరంగంగా నిస్సిగ్గుగా చెపుతున్నది. వ్యవస్థను కాపాడడం దాని పవిత్ర బాధ్యత కదా. వీ

# పాకిస్తాన్ కొత్త ప్రభుత్వం ఏం సాధిస్తుంది?

మే రెండో వారంలో పాకిస్తాన్‌లో జరిగిన సార్వత్రిక ఎన్నికలకూ, ఎన్నికల ఫలితాలకూ ప్రాధాన్యత ఉంది. యాభై ఆరు సంవత్సరాల వలసానంతర చరిత్రలో ముప్పై మూడు సంవత్సరాలు సైనిక పాలనలోనే గడిచిన పాకిస్తాన్‌లో పార్లమెంటరీ ప్రజాస్వామిక ఎన్నికలు తుపాకి నీడలోనే జరగకతప్పదు. విస్తారమైన పేదరికం ఒకవైపు, సైనిక–రాజకీయ పాలకవర్గపు సంపద మరోవైపు కేంద్రీకృతమైన ఆ లోతైన అంతరాల వర్గ సమాజంలో బూటకపు ఎన్నికలను కూడ ప్రజలు ఒక ఉపశమనంగా చూసే అవకాశం ఉంది. అందుకే పాకిస్తాన్ ట్రాట్స్కీయిస్ట్ మేధావి లాల్‌ఖాన్ ఈ ఎన్నికల మీద వ్యాఖ్యానిస్తూ 1848 ఫ్రాన్స్ ఎన్నికలలో లూయీ నెపోలియన్ గెలుపు మీద మార్క్స్ చేసిన వ్యాఖ్యను గుర్తు చేసుకున్నారు. ఫ్రెంచి ప్రజలు అంత పెద్ద ఎత్తున వోట్లు వేసి పనికిమాలిన, వాజమ్మ లాంటి విదూషకుణ్ని ఎందుకు ఎన్నుకున్నారు అని ప్రశ్న వేసి, 'అతనెందుకూ కొరగాడు గనుక అతనిలో అన్నీ కనిపించాయి' అని మార్క్స్ అన్నాడని ఆయన రాశారు. దేశంలోని ఎనిమిదిన్నర కోట్ల మంది వోటర్లలో నాలుగున్నర కోట్ల మంది మాత్రమే వోట్లు వేశారంటే ప్రజలలో ఎన్నికల పట్ల ఎంత అనాసక్తి ఉందో అర్థమవుతుంది. మొత్తం 272 స్థానాలకు గాని కనీస ఆధిక్యత అయిన 137 స్థానాలు ఏ ఒక్క పార్టీకీ రాలేదు. నవాజ్ షరీఫ్ నాయకత్వంలోని పాకిస్తాన్ ముస్లిం లీగ్ 125 స్థానాలతో మొదటి స్థానంలో ఉండి చిన్న పార్టీల, స్వతంత్ర అభ్యర్థుల సహాయంతో ప్రభుత్వాన్ని స్థాపించింది. కాని శాంతియుత పరివర్తన నినాదంతో ముందుకు సాగుతున్న నవాజ్ షరీఫ్ పాకిస్తాన్ సమాజానికి కొత్త వెలుగు ఇవ్వగలడా అనుమానమే. పాకిస్తాన్ సమాజం చాల సంక్షోభభరితంగా ఉంది. ఆ సమాజాన్ని ఒకవైపు సామ్రాజ్యవాదులు, మరొకవైపు మతఛాందసులు అతలాకుతలం చేస్తున్నారు. పాకిస్తాన్‌లో అధికారం చేపట్టే ఏ ప్రభుత్వమైనా సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తే పాత సంప్రదాయాన్ని కొనసాగించ వలసిందే తప్ప స్వతంత్ర దేశీయ, విదేశాంగ విధానాలను అనుసరించే అవకాశం లేదు. మతఛాందసులు కోరుతున్నదేమిటో తెలుసుకుని పరిష్కరించే ప్రయత్నం చేయాలని నిజాయితీగా అనుకున్నా వారు ఎక్కడికక్కడ ఎవరికివారు చీలిపోయి ఒకరినిమించి ఒకరుగా ఉన్నందువల్ల అది సాధ్యం కాదు. ఈ స్థితిలో దిగజారుతున్న ఆర్థిక వ్యవస్థను చక్కదిద్ది, నిరుద్యోగాన్ని తగ్గించి, జీవన ప్రమాణాలను పెంచే పని ఏ పార్లమెంటరీ రాజకీయ పక్షానికి కూడ సాధ్యం కాదు. సౌదీ అరేబియా నుంచి అందే చమురు సబ్సిడీలతోనో, చైనా ఆర్థిక సహాయంతోనో ఆర్థిక సంక్షోభానికి పరిష్కారం దొరకదు. అమెరికా పాలకవర్గాల కనుసన్నలలో సైనికీకరణ, ప్రపంచీకరణ సాగిస్తూ పోతే ప్రజాసమస్యల పరిష్కారం జరగదు. ఈ విధానాల వల్ల ఇంకా ఎక్కువ నిధులు ఆయుధాలకు, సైన్యానికి వెచ్చిస్తూ, ప్రజాసంక్షేమ వ్యయం మీద కోత పెట్టవలసి వస్తుంది. సైనికీకరణను తగ్గించడానికి అటు అమెరికా పాలకవర్గాలు ఇటు పాకిస్తాన్ పాలకవర్గాలు ఒప్పుకోవు. భారత పాలకవర్గాలకు, కూడ ఇటువంటి బూచి అవసరం ఉంది గనుక భారత్‌తో శాంతిప్రయత్నాలు చేయదలచుకున్నా అవి ముందుకు సాగవు. మొత్తం మీద కొత్త ప్రభుత్వం పాత సమస్యలను పరిష్కరించకపోగా, పాకిస్తాన్ సమాజాన్ని మరింతగా సంక్షోభంలోకి నెట్టక తప్పదు. వీ



❖ **జంగిడి** – మార్క వెంకట్రాములు కథలు – పాలమూరు ప్రచురణలు – పాలమూరు అధ్యయన వేదిక – 60 పేజీలు, 1/8 డెమీ రు. 50, ప్రతులకు: ఎం. వెంకట్రాములు, ఇ.నెం. 1-326, టీచర్స్ కాలనీ, మరికల్, ధన్వాడ మండలం, మహబూబ్‌నగర్, సెల్:9966617569



❖ **1948 హైదరాబాద్ పతనం** – మొహమ్మద్ హైదర్, తెలుగు: అనంతు – హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 205 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500006; ఫోన్:23521849; www.hyderabadbooktrust.blogspot.com



❖ **దుశర్ల సత్యనారాయణ జల సాధన సమరం** – సంపాదకుడు: ఎలికట్టె శంకర్‌రావు – నోముల సాహిత్య సమితి – 429 పేజీలు, 1/8 డెమీ, రు : 300, ప్రతులకు: ఎన్.ఎస్. అరుణ, నోముల సాహిత్య సమితి, సాయి టవర్స్, నాగార్జున కాలనీ, నల్లగొండ; సెల్: 9346353268; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **నీరు నేల మనిషి** (తానా–2005 పోటీలో బహుమతి పొందిన నవల) – సుంకోజి దేవేంద్రాచారి – యుక్త ప్రచురణలు – 237 పేజీలు, 1/8 డెమీ, రు: 100, ప్రతులకు: ఎస్. దేవిక, 2–60, మర్రిమంద రోడ్డు, పాపానాయుడు పేట, ఏర్పేడు మండలం, చిత్తూరు – 517 520; సెల్: 9505528358; అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు



❖ **...ఐనా, నేను ఓడిపోలేదు!** – జ్యోతిరెడ్డి (జి. వల్లీశ్వర్‌తో కలిసి) – ఎమెస్కో ప్రచురణలు–126 పేజీలు, 1/8 డెమీ, రు: 60, ప్రతులకు: సాహితీ ప్రచురణలు, 29–13–53, కాళేశ్వరరావు రోడ్డు, సూర్యారావు పేట, విజయవాడ–2; ఫోన్: 0866–2436643; ఇమెయిల్: sahiti.vja@gmail.com



❖ **ప్రలోభం** – నాయిని కృష్ణమూర్తి – వియన్నార్ బుక్ వరల్డ్, 216 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు : వియన్నార్ బుక్‌వరల్డ్, చౌడేపల్లి – 517 257, చిత్తూరు జిల్లా




❖ **ట్రైకలర్ షల్ ఫ్లై ఓవర్ హైదరాబాద్** – డా. రాజబహదూర్ గౌర్, ప్రాచీ పబ్లికేషన్స్ – 54 పేజీలు, 1/8 డెమీ, రు: 25, ప్రతులకు: పిపిసి జోషి, ప్రాచీ పబ్లికేషన్స్, 3–3–859/1/ఏ, రెండవ అంతస్తు, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ, హైదరాబాద్–27; సెల్: 9346689306, ఇమెయిల్: joshippc@yahoo.co.in



❖ **అబూజ్‌మాడ్** – కవిత్వం – పాణి – విప్లవ రచయితల సంఘం, 104 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు : పాణి, 50–348–ఎల్/19 బి2, అరోరా నగర్, కర్నూలు – 2; దిశ పుస్తక కేంద్రం, సహచర బుక్‌మార్క్, నవోదయ బుక్‌హౌస్



❖ **నదీ బాల్యమూ** – రివేరా కవిత్వం–విప్లవ రచయితల సంఘం, 53 పేజీలు, 1/10 డెమీ, రు : 30, ప్రతులకు : రివేరా, వివేకా కాన్వెంట్, రామ్‌నగర్, దేశాయిపేట పోస్టు, వేటపాలెం (మం), ప్రకాశం – 500 187; సెల్: 8142200711; దిశ; సహచర; నవోదయ; విశాలాంధ్ర; ప్రజాశక్తి



❖ **మహాకవికి అశ్రునైవేద్యం** – ఎక్స్‌రే సాహిత్య మాసపత్రిక, మే–జూన్ 1984 – మలికుర్దు: సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్య నిధి ప్రచురణ – 47 పేజీలు, 1/8 డెమీ, రు : 25, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ – 520004, ఫోన్: 0866–6640595, సెల్:9246277375 ఇమెయిల్: srisri_sahityanidhi@yahoo.com



❖ **పట్టుకుచ్చుల పువ్వు** – కవిత్వం – దాసరాజు రామారావు – మంజీరా రచయితల సంఘం – 136 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు : డి. విజయలక్ష్మి, ఇ.నెం. 13–30/79, సాయి భగవాన్ కాలనీ, బిహెచ్ఇఎల్, రామచంద్రాపురం, మెదక్–502032; సెల్: 9618224503;ఇమెయిల్:daasaraju@gmail.com; విశాలాంధ్ర; సహచర; దిశ; పాలపిట్ట; నవోదయ; సమాంతర



❖ **కెవిఆర్ సాహిత్య వ్యాసాలు – మొదటి భాగం** – కెవిఆర్, శారదాంబ స్మారక కమిటీ – 798 పేజీలు, 1/8 డెమీ, రు : 300, ప్రతులకు : డా. ఎస్. రామకృష్ణ, శాంతి నర్సింగ్ హోమ్, నిర్మలా కాన్వెంట్ ఎదురుగా, పటమట, విజయవాడ – 520 010; సెల్: 98490 83137



❖ **తడి ఆరని నేల** అరసవిల్లి కృష్ణ – పాలపిట్ట బుక్స్ – 119 పేజీలు, 1/8 డెమీ, రు : 60, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16–11–20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036; ఫోన్: 27678430ఇమెయిల్:palapittabooks@gmail.com



❖ **వ్యాపారం గుప్పిట్లో విద్య** – ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ, అఖిల భారత విద్యాహక్కుల వేదిక – 106 పేజీలు, 1/8 డెమీ, రు: 20, ప్రతులకు: డా. కె. లక్ష్మీ నారాయణ, ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ, 306, ప్లెజెంట్ అపార్ట్‌మెంట్స్, బజార్‌ఘాట్, హైదరాబాద్–4; ఫోన్: 040–23305266, సెల్: 9440980396



❖ **ఇండస్ వర్సెస్ ఆర్యన్** – బహుజన కెరటాలు ప్రచురణ – 95 పేజీలు, 1/8 డెమీ, రు : 80, లైబ్రరీ కాపీ రు: 100, ప్రతులకు : పల్నాటి శ్రీరాములు, 4/15, ఆర్‌టిసి స్టాఫ్ కాలనీ, సత్యనారాయణపురం, ఒంగోలు – 2, ప్రకాశం జిల్లా, సెల్: 9848844170



❖ **నవలా హృదయం** – 27 ప్రసిద్ధ తెలుగు నవలల విమర్శనాత్మక పరిచయం – వి. రాజారామ మోహనరావు – వి.ఎన్.ఆర్. బుక్‌వరల్డ్ – 156 పేజీలు, 1/8 డెమీ, రు : 75, ప్రతులకు : విశాలాంధ్ర; నవోదయ; తెలుగు బుక్‌షాప్

### దళిత వాడపై దాడి

రంగారెడ్డి జిల్లా కీసర మండలం రాంపల్లిదామర పంచాయితీ పరిధిలో జెఎన్ఎన్‌యుఆర్ఎం కాలనీపై సుమారు 50 మంది అగ్రకులస్తులు మే 3న దాడి చేశారు. కొంత మంది దళితులకు గాయలైనాయి. స్థానికంగా కిరాణం నడుపుకొంటున్న దళితుల్ని చూసి ఓర్వ లేక అగ్ర కులస్తులు ఈ దాడి చేశారని స్థానికులు అంటున్నారు. ఈ దాడి జరుగుతుంటే పోలీసులు ప్రేక్షక పాత్ర పోషించారంటున్నారు.

### రాష్ట్ర భద్రతా కమిషన్ ఏర్పాటు

సుప్రీంకోర్టు మార్గదర్శకాలకు అనుగుణంగా రాష్ట్ర భద్రతా కమిషన్ (ఎస్ఎస్‌సి) ఏర్పాటు చేసి, పోలీసుశాఖలో సంస్కరణలు చేపట్టాలనే ఉద్దేశంతో మే 5న ఈ కమిషన్ ఏర్పాటు చేశారు. ఈ కమిటీకి రాష్ట్ర హోంమంత్రి చైర్మన్‌గా, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, హోంశాఖ ముఖ్య కార్యదర్శి, న్యాయశాఖ కార్యదర్శి, డిజిపి సభ్యులుగా ఉంటారు.

### సాహితీవేత్త సొదుం గోవిందరెడ్డి మృతి

ప్రముఖ సాహితీవేత్త సొదుం గోవిందరెడ్డి(85) మే 6న చనిపోయారు. ఆయన కడప జిల్లా ఉరుటూరు గ్రామంలో 1928లో పుట్టారు. గోవిందరెడ్డి తెలుగు, ఆంగ్ల సాహిత్యాలలో విమర్శకుడు, స్వయాన కథా రచయిత. మార్క్సిస్టు దృక్పథం కలవారు.

### మనీ లాండరింగ్ మంత్రి

మనీలాండరింగ్ రూపంలో నల్లధనాన్ని చట్టబద్ధం చేసే కార్యక్రమాల్లో ప్రాథమిక విద్యా శాఖ మంత్రి శైలజానాథ్ భాగస్వామి అయ్యారని వెబ్ మీడియా స్టింగ్ ఆపరేషన్ ద్వారా బయటపెట్టింది. మంత్రి మనీలాండరింగ్ రూపంలో రు. 25 కోట్లు పెట్టుబడి పెట్టారని వెబ్ మీడియా స్టింగ్ ఆపరేషన్‌లో బయటపడింది.

### అక్రమాల పిరమిడ్

మహబూబ్‌నగర్ జిల్లా కడ్తాల్ సమీపంలో 2012 డిసెంబర్ 15న ధ్యాన గురువు సుభాష్ పత్రీజీ నిర్మించిన 'మహేశ్వర పిరమిడ్' రియల్ ఎస్టేట్ వ్యాపారం కోసమేనని జాయింట్ కలెక్టర్ జెసి శర్మన్ 2013 జనవరి 14న పిరమిడ్ ప్రాంగణానికి చేరుకొని సమగ్ర విచారణ జరిపి మే 15 నివేదిక ఇచ్చారు.

### కవి కలేకూరి ప్రసాద్ మృతి

ప్రముఖ కవి, సినీ గేయ రచయిత, సాహిత్య విమర్శకుడు, మార్క్సిస్టు విశ్లేషకుడు, దళిత ఉద్యమకారుడు కలేకూరి ప్రసాద్(యువక) (51) మే 17న అనారోగ్యంతో చనిపోయారు. ఆయన 1964 అక్టోబర్ 25న కృష్ణా జిల్లా, కంచికచెర్లలో జన్మించారు. జననాట్య మండలి, విప్లవ రచయితల సంఘంలో పని చేశారు. కొంతకాలం పీపుల్స్‌వార్ పార్టీలో కూడ పనిచేశారు. సాక్షి దళిత హ్యూమన్ రైట్స్ నెట్‌వర్క్‌తో సహా దళిత ఉద్యమంలో పనిచేశారు.

### తెలంగాణ కవి సమ్మేళనం

తెలంగాణ రచయితల వేదిక అధ్వర్యంలో మే 19న ఉస్మానియా యూనివర్సిటీలో మలిదశ తెలంగాణ ఉద్యమం మలుపులో 'ఇపుడేం చేద్దాం' అనే నినాదంతో 12 గంటల కవి సమ్మేళనం నిర్వహించారు. ఈ సభ ప్రారంభంలో తెలంగాణ అమరవీరులకూ, అలాగే కవి కలేకూరి ప్రసాద్‌కూ నివాళ్లు అర్పించారు. ఈ సభకు తెలంగాణ కవులు హాజరైనారు. పలువురు వక్తలు తెలంగాణ సాహిత్యం, కళల గురించి మాట్లాడారు. తెలంగాణ ఉద్యమం ప్రపంచ ఉద్యమాల చరిత్రలోనే మహోన్నతమైనదని ప్రజా గాయకుడు గద్దర్ వ్యాఖ్యానించారు.

### పంచాయితీరాజ్ హోం మంత్రుల రాజీనామా

అవినీతి అరోపణలు ఎదుర్కొంటున్న మంత్రులు ధర్మాన ప్రసాదరావు, సబితా ఇంద్రారెడ్డిలు మంత్రి పదవులకు మే 19న రాజీనామా చేశారు. వాన్‌పిక్ ప్రాజెక్టుకు అక్రమంగా భూములు కేటాయించిన ధర్మానను సిబిఐ నిందితునిగా పేర్కొంది. సబితా ఇంద్రారెడ్డి గనుల శాఖ మంత్రిగా ఉన్నప్పుడు దాల్మియా సిమెంట్ కంపెనీకి సున్నపురాయి గనుల లీజులు సాఫీగా బదిలీ అయ్యాయి. దాల్మియా కంపెనీ జగన్ కంపెనీలలో రు. 95 కోట్ల పెట్టుబడి పెట్టడం 'క్విడ్ ప్రోకో'లో భాగమేనని, ఇందుకు సబితా ఇంద్రారెడ్డి సహకారం ఉందని సిబిఐ పేర్కొంది.

### హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా సేన్ గుప్తా

రాష్ట్ర హైకోర్టు 35వ ప్రధాన న్యాయమూర్తిగా జస్టిస్ కళ్యాణ్ జ్యోతి సేన్ గుప్తా మే 17న నియమితులైనారు. మే 21న రాజ్‌భవన్‌లో గవర్నర్ ఇ.ఎస్.ఎల్. నరసింహన్ ఆయన చేత ప్రమాణ స్వీకారం చేయించారు. గతంలో ఉత్తరాఖండ్ హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేశారు. జస్టిస్ గుప్తా పశ్చిమ బెంగాల్ రాష్ట్రానికి చెందినవారు.

### లక్ష్మింపేటలోనే ప్రత్యేక కోర్టు

శ్రీకాకుళం జిల్లా లక్ష్మింపేటలోనే దళితుల ఊచకోత కేసు విచారణ జరపాలని ప్రభుత్వం మే 21న ఉత్తర్వులు జారీ చేసింది. ఈ కేసు విచారణకు ప్రత్యేక న్యాయ స్థానాన్ని ఏర్పాటు చేస్తూ గత ఏడాది 2012 సెప్టెంబర్ 25న ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. అయితే గ్రామంలో సౌకర్యాలు లేనందున శ్రీకాకుళం జిల్లా కోర్టు ప్రాంగణంలో ప్రత్యేక కోర్టు ఏర్పాటు చేశారు. అయితే గ్రామం నుంచి జిల్లా కేంద్రానికి వెళ్లడం బాధితులకు, సాక్షులకు ఇబ్బందిగా ఉంటుందని అక్కడే కోర్టు ఏర్పాటు చేయాలని ప్రజా సంఘాల డిమాండ్‌తో ప్రభుత్వం ఈ ఉత్తర్వులు జారీ చేసింది.

### కెవిపిఎస్ సభలు

కుల వివక్ష వ్యతిరేక పోరాట సమితి (కెవిపిఎస్) రెండో రాష్ట్ర మహాసభలు మే 22, 23 తేదీలలో హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగినాయి. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా రాష్ట్ర ప్రభుత్వ మాజీ ప్రధాన కార్యదర్శి కాకి మాధవరావు హాజరైనారు. మార్క్సిజం, అంబేద్కరిజం మధ్య వారధి నిర్మించి నప్పుడే దళితుల సమస్య పరిష్కారమవుతుందని ఆయన అన్నారు. ఈ కార్యక్రమానికి సిపిఎం రాష్ట్ర కార్యదర్శి బి.వి. రాఘవులు తదితరులు హాజరైనారు.

### త్రిపుర కన్నుమూత

ప్రముఖ రచయిత రాయసం వెంకట త్రిపురాంతకేశ్వరరావు (త్రిపుర) (85) కొంత కాలం నుంచి శ్వాస కోశ వ్యాధితో బాధపడుతూ విశాఖపట్నంలో మే 25న చనిపోయారు. ఆయన 1928 సెప్టెంబర్ 2న ఒడిశా రాష్ట్రం, గంజాం జిల్లా పురుషోత్తపురంలో జన్మించారు. విశాఖలో ఎవిఎన్ కళాశాలలో, బనారస్ విశ్వవిద్యాలయంలో చదువుకున్నారు. అగర్తలాలో ఇంగ్లిష్ అధ్యాపకులుగా పనిచేశారు. త్రిపుర కథలు, సెగ్మెంట్స్ బాధలు, కవితలు, త్రిపుర కాఫ్కా కవితలు తెలుగు సాహిత్యంలో విశిష్టమయినవిగా నిలిచిపోయాయి. వీ

# ఆంధ్రప్రదేశ్ - కప్పల తక్కెడ రాజకీయాలు

*ఆంధ్రప్రదేశ్ రాజకీయ రంగస్థలం మీద జరుగుతున్న అనేక పరిణామాలను విశ్లేషిస్తున్నారు* **ఎడ్ల పోచయ్య**

కొంతకాలంగా ఆంధ్రప్రదేశ్ రాజకీయ రంగస్థలంమీద చాల మార్పులు జరిగిపోతున్నాయి. నానాటికీ పెరిగిపోతున్న ప్రజాసమస్యల, ప్రజాందోళనల నేపథ్యంలో, ప్రజాసమస్యల పరిష్కార దిశలో ఈ మార్పులు జరిగితే అర్థం చేసుకోవచ్చు. కాని ఈ మార్పులకూ ప్రజాజీవితానికీ సంబంధం చాల తక్కువగా ఉంటున్నది. దాదాపుగా రాజకీయ మార్పులన్నీ కూడ ఈ సంవత్సరం చివరలోనో వచ్చే సంవత్సరం మొదట్లోనో జరగనున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని మాత్రమే జరుగుతున్నాయి. ఎన్నికల జ్వరం పెరుగుతున్న కొద్దీ ఈ మార్పులు మరింత పెద్ద ఎత్తున జరగవచ్చు. పరస్పర భిన్నంగా కనిపించే రాజకీయ పక్షాల మధ్య మారుతున్న సమీకరణాలు, నిన్నటిదాకా శత్రువుల్లా ప్రవర్తించినవారు హఠాత్తుగా మిత్రులూ సహచరులూ అయిపోవడం, అన్ని రాజకీయ పక్షాలకూ హఠాత్తుగా ప్రజలు గుర్తుకు రావడం, ఆ ప్రజలను 'కలుసుకునేందుకు', ఆ ప్రజల 'సమస్యలు తెలుసుకునేందుకు' ఆయా పార్టీల అగ్రనాయకులే పాదయాత్రలకు పూనుకోవడం, ఆ పార్టీ నుంచి ఈ పార్టీ లోకి, ఈ పార్టీ నుంచి ఆ పార్టీ లోకి కప్పల దూకుడు లాంటి ఆకర్షణలు, వలసలు, పరస్పర తీవ్రమైన నిందారోపణలు, సవాళ్లు, ప్రతిసవాళ్లు, రానున్న ఎన్నికలలో సీట్ల కోసం ఇప్పటి నుంచే ప్రయత్నాలు... ఒక్క మాటలో చెప్పాలంటే రాజకీయ రంగస్థలం చాల హాస్యాస్పదంగా ఉన్నది, బీభత్సంగా ఉన్నది. విషాదకరంగా ఉన్నది.

ఈ దివాళాకోరుతనం ఈ దేశంలో పార్లమెంటరీ రాజకీయాల సహజ స్వభావమే అని ఊరుకుంటే ప్రయోజనమేమీ లేదు. పార్లమెంటరీ రాజకీయాలు ఈ దేశంలో అమలవుతున్న తీరు ఇంత జుగుప్సాకరంగా ఉండక తప్పని స్థితి ఉన్నమాట నిజమే. కాని రాజకీయాలంటే అసలు అర్థం ప్రజల సమస్యలకు సృజనాత్మకమైన, వినూత్నమైన పరిష్కారం కనుగొని ఆచరణలో పెట్టే పద్ధతుల సముదాయం. భారత రాజకీయాలు ఆ నిర్వచనానికి చాల దూరం వెళ్లిపోయి ఉండవచ్చు. అలా అని వాటిని అసహ్యించుకుని దూరంగా ఉన్నా అవి ప్రజలను కాటువేయక మానవు. ప్రజాజీవితాన్ని అతలాకుతలం చేయక మానవు. అందువల్ల ఆ రాజకీయాల కుళ్లును అర్థం చేసుకుని దాన్ని ప్రజలకు విప్పి చెప్పడానికి ప్రయత్నించక తప్పదు. రాజకీయాలంటే పార్లమెంటరీ రాజకీయాలు మాత్రమే కాదనీ, వాటిని తోసివేయగలిగే ప్రజారాజకీయాలు కూడ ఉంటాయనీ చెప్పక తప్పదు. ఆ క్రమంలో పార్లమెంటరీ రాజకీయాలను, రాజకీయ పార్టీలను, నాయకులను నిశితంగా పరిశీలించి విమర్శించడం, ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయాలవైపు ప్రజల దృష్టి మళ్లించడం ప్రజానుకూల ఆలోచనాపరుల బాధ్యత. ఈ దృక్పథం నుంచి పరిశీలించి ఇవాళ రాష్ట్ర రాజకీయాలలో కనబడుతున్న మూడు నాలుగు అపసవ్య ధోరణులను వివరించడమే ఈ వ్యాస లక్ష్యం.

**తెలంగాణ**

రాష్ట్ర రాజకీయాలలో ఇవాళ ప్రథమ స్థానంలో ఉన్నది తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు ఎప్పుడనే సమస్యే. దాదాపు నాలుగు సంవత్సరాలుగా తెలంగాణ ప్రజానీకంలో ఈ అంశమే ప్రధాన స్థానంలో ఉన్నది. గత రెండు సార్వత్రిక ఎన్నికలలోను అదే ప్రధాన సమస్యగా ఉండింది. మొదట 2004 ఎన్నికలలో అప్పటి అధికార పక్షమైన తెలుగుదేశం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును వ్యతిరేకించింది. అప్పటికి కేంద్రంలో తెలుగుదేశం మద్దతుతో అధికారంలో కొనసాగుతుండిన భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ (ఎన్‌డిఎ) కూటమి కూడ తెలంగాణ ఏర్పాటును వ్యతిరేకించింది. ఆ సందర్భంలో 2004 ఎన్నికల ప్రణాళికలో అప్పటి ప్రతిపక్ష కాంగ్రెస్ పార్టీ తెలంగాణ విషయంలో తన సానుకూలతను ప్రకటించింది. కాంగ్రెస్, తెలంగాణ రాష్ట్ర సమితి ఎన్నికల పొత్తు పెట్టుకున్నాయి. అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆ ఎన్నికలు తెలంగాణ ఏర్పాటు, ప్రపంచబ్యాంకు రుణాలు, నక్సలైట్ల పట్ల వైఖరి అనే మూడు విషయాలలో ప్రజాభిప్రాయ సేకరణ (రెఫరెండం) అని ప్రకటించారు. కాని ఆ మూడు విషయాలలోను తెలుగుదేశం వైఖరికి భిన్నమైన వైఖరికే తమ మద్దతు ఉందని ప్రజలు ప్రకటించారు. రాష్ట్ర చరిత్రలో మొదటిసారిగా కాంగ్రెస్–తెరాస మిశ్రమ మంత్రివర్గం అధికారంలోకి వచ్చింది. ఆ తర్వాత గడిచిన ఐదు సంవత్సరాలలో కాంగ్రెస్ కనీస ఉమ్మడి ప్రణాళికలో, రాష్ట్రపతి ప్రసంగంలో తెలంగాణ అంశం చేర్పు వంటి అనుకూల అంశాలు చూపుతూనే, ప్రణబ్ ముఖర్జీ కమిటీ ఏర్పాటు వంటి చర్యల ద్వారా తాత్సారం చేసింది. కాంగ్రెస్ మరొకసారి వంచనకు పాల్పడిందని తెలంగాణ ప్రజలు భావించారు.

ఆ సమయంలో వచ్చిన 2009 ఎన్నికలలో తెలుగుదేశం, సిపిఐ, సిపిఎంలతో ఏర్పడిన కాంగ్రెస్ వ్యతిరేక కూటమి తెలంగాణ నినాదం ఎత్తుకుని తెరాసతో పొత్తు పెట్టుకున్నది. సిపిఎం తెలంగాణను వ్యతిరేకించినప్పటికీ ఈ కూటమిలో చేరింది. కాంగ్రెస్ కూడ తాను తెలంగాణకు అనుకూలమనే చెప్పుకున్నది. ఒకరకంగా 2009 ఎన్నికలలో అన్ని పార్టీలూ తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు అనుకూలంగానే ఉన్నట్టనిపించింది. ఆ ఎన్నికలలో విజయం సాధించిన తర్వాత కూడ కాంగ్రెస్ రాష్ట్ర ఏర్పాటు ప్రయత్నాలు ప్రారంభించలేదు సరిగదా, అక్టోబర్‌లో సుప్రీంకోర్టులో తెలంగాణకు వ్యతిరేకమైన తీర్పు రావడంతో తెలంగాణ ఆకాంక్షలు తీవ్రరూపం ధరించాయి. ఒకవైపు కె. చంద్రశేఖర రావు ఆమరణ దీక్ష, మరొకవైపు తెలంగాణ విద్యార్థుల చలో అసెంబ్లీ పిలుపుతో దిగివచ్చిన కేంద్ర ప్రభుత్వం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమవుతున్నదని డిసెంబర్ 9న ప్రకటించింది. కాని డిసెంబర్ 23న ఆ ప్రకటనను ఉపసంహరించుకుని విస్తృత ప్రజాభిప్రాయ సేకరణ

జరగవలసి ఉన్నదని అంది. అందుకోసమే నియమించిన జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ గందరగోళపు నివేదిక తర్వాత, కేంద్ర ప్రభుత్వంలో, కాంగ్రెస్ పార్టీలో కీలక స్థానాలలో ఉన్నవారు రోజుకొక మాట మారుస్తుండడంతో 2014 ఎన్నికలు దగ్గర పడుతున్న కొద్దీ తెలంగాణ విషయం మరింత ప్రాధాన్యత సంతరించుకుంటున్నది.

తెలంగాణ రాష్ట్ర సాధనకు ఎన్నికలే ఏకైక లేదా ప్రధాన మార్గం అనుకుంటున్నవారు చాలమందే ఉన్నారు. వారిలో తెలంగాణ రాష్ట్ర సమితిని మాత్రమే తెలంగాణ ప్రతినిధిగా గుర్తించాలని, 100 దాకా శాసనసభా స్థానాలు, 15 దాకా లోకసభ స్థానాలు కట్టబెడితే తెలంగాణ వస్తుందని కొందరు భావిస్తున్నారు. రాష్ట్ర ఏర్పాటు తప్పనిసరిగా లోకసభలో బిల్లు ద్వారా జరగవలసిందే గనుక జాతీయపార్టీల మద్దతు లేకుండా తెలంగాణ రాదని, రెండు ప్రధాన జాతీయ రాజకీయ పార్టీలలో కాంగ్రెస్ మోసం తెలిసిపోయింది గనుక ఈ సారి భారతీయ జనతా పార్టీని నమ్ముకోవాలని మరి కొందరు అనుకుంటున్నారు. చివరికి తెలంగాణ జాయింట్ ఆక్షన్ కమిటీ (జెఎసి) అధ్యక్షుడు ఎం. కోదండరాం కూడ ఇటీవల ఢిల్లీలో భాజపా నాయకురాలు సుష్మా స్వరాజ్ సమక్షంలో భాజపా అధికారంలోకి రావాలని అన్నారని వార్తలు వచ్చాయి. భాజపా కూడ తాను అధికారంలోకి వస్తే వందరోజుల్లో తెలంగాణ అని తన బలం పెంచుకోవడానికి తెలంగాణను వాడుకుంటున్నది.

ఈ సమస్యలో లోతుగా ఆలోచించవలసిన అంశాలు మూడు ఉన్నాయి. ఒకటి, తెలంగాణవాదులు భాజపా మీద పెంచుకుంటున్న మితిమీరిన ఆశలు, వాటి దుష్ఫలితాలు, ప్రమాదాలు. రెండు, ఎన్నికల విజయాలతో తెలంగాణ రాష్ట్ర సాధనను ముడిపెడుతున్న తెరాస వైఖరి వల్ల ప్రమాదాలు. మూడు, ఎన్నికల రాజకీయాల మీద తెలంగాణ వాదులలో పెరుగుతున్న భ్రమల ప్రమాదం.

**హిందూ మతోన్మాద ప్రమాదం**

భారతీయ జనతా పార్టీకీ, సంఘ పరివారానికీ తెలంగాణతో ఉన్న సంబంధం సుదూరమైనదీ, ప్రతికూలమైనదీ మాత్రమే గాని సన్నిహిత మైనదీ సానుకూలమైనది కాదు. సంఘ పరివారానికి తెలంగాణలో మొదటినుంచీ బలం లేదు. అందుకు చారిత్రక కారణాలూ, రాజకీయార్థిక కారణాలూ ఉన్నాయి. తెలంగాణ ప్రజలలో భాజపాకు ముందరి అవతారమైన భారతీయ జనసంఘ్, ఇతర సంఘ పరివార శాఖలు ప్రవేశించిన తీరే వాటికి తెలంగాణ ప్రజలలో స్థానం లేకుండా చేశాయి. నిజాం పాలన రోజులలో 1930లలో ప్రవేశించిన ఆర్య సమాజం, హిందూ మహాసభ వంటి ముస్లిం వ్యతిరేక, హిందూ మతవాద సంస్థల వారసత్వం నుంచి తెలంగాణలో సంఘ పరివార శాఖలు విస్తరించాయి. అవి కొంతవరకు పట్టణాలలో హిందూ మతప్రచారానికి, ముస్లిం వ్యతిరేక ప్రచారానికి ప్రయత్నించాయి గాని అప్పటికి కొనసాగుతున్న మతసామరస్య వాతావరణం వల్ల అవి ఇక్కడ బలంగా వేళ్లూనుకోలేకపోయాయి. హిందూత్వవాదులు కూడ నేరుగా ఈ మతసంస్థలలోకన్న కాంగ్రెస్ లోనే ఉండిపోయారు. ఈ మతవాద సంస్థల వారసురాలిగా భారతీయ జనసంఘ్ కూడ తెలంగాణలో విస్తరించలేదు, విస్తరించిన చోట్ల కూడ భూస్వాముల పిల్లల ద్వారా అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ లోకి, వ్యాయామంతో ఆకర్షించి రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ శాఖలలోకి, మతభావనలు రెచ్చగొట్టి భారతీయ మజ్దూర్ సంఘ్‌లోకి మాత్రమే వచ్చింది.

ఎమర్జెన్సీలో జనసంఘ్, దాని అనుబంధ సంస్థలు అనుభవించిన నిర్బంధం వల్ల వాటికి గౌరవం పెరిగింది. తర్వాత జనతాపార్టీ కాలంలో దానికి రాజకీయ ప్రధాన స్రవంతిలోకి ప్రవేశం దొరికింది. సరిగ్గా అప్పుడే తెలంగాణలో విప్లవోద్యమం విస్తరిస్తుండడంతో భూస్వామ్య వర్గాలు ఆర్ ఎస్ ఎస్, ఎబివిపి, జనసంఘ్ లను ఆశ్రయించాయి. ఆ జనసంఘ్ 1980లో భారతీయ జనతా పార్టీగా అవతారం ఎత్తింది. మొత్తంగా తెలంగాణలో భారతీయ జనతాపార్టీ అంటే దొరల పార్టీ అనే సాధారణ అభిప్రాయం బలపడింది. బహుశా అందువల్లనే ఆ తర్వాత ఇరవై సంవత్సరాలలో కూడ తెలంగాణలో భారతీయ జనతా పార్టీ ఎదుగూ బొదుగూ లేకుండా ఉండిపోయిందని చెప్పాలి. ఆ స్థితి నుంచి బయటపడి బలం పుంజుకోవడానికి ఆ పార్టీ ఒక ప్రమాదకరమైన పచ్చి అవకాశవాద వైఖరి చేపట్టింది. ఒకవైపు తెలంగాణ వ్యతిరేక తెలుగుదేశంతో పొత్తు కలుపుకుని అధికారంలో వాటా సంపాదించింది. మరొకవైపు తెలంగాణ ప్రత్యేక రాష్ట్రానికి తాను అనుకూలమని ప్రకటించి ఇక్కడ కాలు నిలదొక్కుకోవడానికి ప్రయత్నించింది.

1969 తెలంగాణ ఉద్యమ సమయంలో దాన్ని వ్యతిరేకించి, సమైక్యాంధ్ర నినాదం ఎత్తుకున్న సంఘ పరివారం ఈసారి 1998లోనే తెలంగాణ రాష్ట్రానికి అనుకూలమని ప్రకటించింది. 'ఒక వోటు, రెండు రాష్ట్రాలు' నినాదంతో 1999 ఎన్నికలకు వెళ్లింది. ఆ ఎన్నికలలో కేంద్ర ప్రభుత్వ అధికారం సంపాదించింది గాని తన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేదు. తెలంగాణ నినాదాన్ని పక్కకు పెట్టింది. ఇప్పటికీ ఆ విద్రోహానికి భారతీయ జనతా పార్టీ నుంచి తగిన సమాధానం, పశ్చాత్తాపం వెలువడలేదు. తెలుగుదేశం ఎన్‌డిఎ భాగస్వామిగా ఉండడం వల్ల తెలంగాణ అంశంలో వారి ఒత్తిడికి లొంగిపోయామని ఒకరిద్దరు నాయకులు అన్నారు గాని అది నిజం కాదని తెలుగుదేశం ఖండించింది. తమ ఐదేళ్ల పాలనాకాలంలో ఎన్‌డిఎ భాగస్వామ్య పక్షాలు వ్యతిరేకించిన ఎన్నో అంశాలను అమలులోకి తెచ్చిన భాజపా ఒక్క తెలంగాణ విషయంలోనే తెలుగుదేశం ఒత్తిడికి ఎందుకు లొంగవలసి వచ్చిందో సంజాయిషీ లేదు.

తెలంగాణ ఇస్తామని ఇప్పుడు ఎంత నమ్మబలుకుతున్నప్పటికీ ఈ గత చరిత్ర వల్ల భారతీయ జనతా పార్టీని నమ్మడానికి వీలులేదు. ఈసారి కూడ లోకసభలో అటు కాంగ్రెస్‌కు గాని, ఇటు భాజపాకు గాని సొంతంగా 150 స్థానాలకన్న ఎక్కువ వచ్చే పరిస్థితి కనబడడం లేదు. ఎన్నికల సమయానికి సానుకూల పవనాలు వీచినా గెలుపు స్థానాల సంఖ్య ఏ పార్టీకైనా ఎట్టి పరిస్థితిలోనూ 200కు మించకపోవచ్చు. అంటే ప్రభుత్వం స్థాపించడానికి రెండు పార్టీలకూ కూడ డెబ్బై నుంచి వంద స్థానాల లోటు ఉంటుంది. ఆ మేరకు చిన్నా చితకా పార్టీల మీద ఆధారపడవలసి వస్తుంది. తెలుగుదేశం పార్టీ వంటి పార్టీల మీదనే భాజపా ఆధారపడవలసి వస్తుంది. అప్పుడు కూడ భాజపా పాత కారణమే చెప్పి తెలంగాణ ఎగ్గొట్టదనే హామీ ఏమీ లేదు. నిజానికి అంతదూరం వస్తే, ఒకవేళ ఎన్‌డిఎ కూటమిలో తెలుగుదేశం చేరకపోయినా, ఆ కూటమిలోని ఏదో ఒక పార్టీని కోస్తాంధ్ర, రాయలసీమ సంపన్నులు డబ్బులతో కొనివేసి తెలంగాణ ఇవ్వగూడదని చెప్పించగలరు. అటువంటి స్థితి వచ్చినా సరే, ఎన్‌డిఎ భాగస్వాములలో ఎవరైనా ఒత్తిడి తెచ్చినా సరే, తాను మాట తప్పనని భాజపా ఇప్పటికైతే హామీ ఇవ్వడం లేదు.

అంతేకాదు, తన పాత తప్పుకు పశ్చాత్తాపం ప్రకటించినా, ఈసారి వాగ్దానాన్ని కచ్చితంగా నిలబెట్టుకుంటానని మాట ఇచ్చినా, భాజపాతో

పొత్తు కట్టడానికి తెలంగాణకు అభ్యంతరం ఉండవలసి ఉంది. ఆ పార్టీ హిందూ మతోన్మాద పార్టీ. అందువల్ల దాన్ని నమ్మడం, దాని వెనుక నడవడం తెలంగాణలోని హిందూ – ముస్లిం ఐక్య సమాజానికి చాల ప్రమాదకరం. ఇప్పటికే మజ్లిస్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ దగాకోరు రాజకీయాల వల్ల ముస్లిం ప్రజలలో తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షల మీద అనుమానాలు బలంగానే ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో 9శాతంగా ఉన్న ముస్లింల జనాభా తెలంగాణలో 13 శాతం అవుతుంది. అటువంటి సమయంలో ఒక హిందూ మతోన్మాద పార్టీ తెలంగాణను సమర్థించడం గాని, తెలంగాణ ఆ మతోన్మాద పార్టీ మద్దతును కోరడం గాని వాంఛనీయం కావు. ఒకవేళ ఆ మతోన్మాద పార్టీ తన అవకాశవాద రాజకీయాలతో తెలంగాణను సమర్థిస్తానని చెప్పినా, తెలంగాణ వాదులు తగిన జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. అందులోనూ మొన్నటికి మొన్న మూడువేలమంది ముస్లింలను ఊచకోత కోసిన నరహంతకుడిని తమ ప్రధానమంత్రి అభ్యర్థిగా బాహాటంగా ప్రకటిస్తున్న భాజపాను సమర్థించడమంటే తెలంగాణలో అత్యధిక జనాభాగల ముస్లింలను దూరం చేసుకోవడమే అవుతుంది. మొత్తం మీద చెప్పాలంటే భాజపాను నమ్మడం అసాధ్యం, నమ్మినా ప్రమాదకరం, అందులోనూ వారి ప్రధాని అభ్యర్థికి తెలిసితెలిసీ మద్దతునివ్వడం దేశాన్ని మతవిద్వేషాల అగ్నిగుండం చేయడంలో తెలంగాణ కూడ ఒక చేయి వేసినట్టవుతుంది.

అయితే, భారతీయ జనతా పార్టీని వ్యతిరేకించడమంటే దానికి బదులుగా కాంగ్రెస్‌ను సమర్థించడమని అర్థం కాదు. తెలంగాణ విషయంలో ఎన్నోసార్లు వంచనకు పాల్పడిన కాంగ్రెస్‌ను మరొకసారి నమ్మడం అసాధ్యం. తెలంగాణకు కాంగ్రెస్ చేసిన మోసాలు ప్రతి ఒక్కరికీ తెలిసినవే. కాంగ్రెస్ నూ, భారతీయ జనతా పార్టీనీ కూడ సమాన దూరంలో చూసి, ఎవరికీ దగ్గర కాకుండానే, వారు లోకసభలో తెలంగాణ బిల్లుకు ఆమోదం తెలిపేలా ఒత్తిడి తెచ్చే అవకాశాలు ఎన్నో ఉన్నాయి. ఆ ఒత్తిడి అవకాశాలను వాడుకోవాలి గాని, ఊరికే ఆ పార్టీనో, ఈ పార్టీనో తెలంగాణకు మద్దతు ఇస్తుందనుకోవడం అమాయకత్వమైనా కావాలి. లేదా ఆ ఆలోచన చేస్తున్నవారికి ఇతర ప్రయోజనాలైనా ఉండి ఉండాలి. చాల మంది తెలంగాణ పేరుతో చట్టసభలకు చేరదలచారు గనుక, భాజపాకు దగ్గరైతే ఆ పార్టీ టికెట్ మీద గాని, మద్దతుతో గాని పోటీ చేయవచ్చుననే ఉద్దేశంతోనే భాజపాను సమర్థిస్తున్నారు.

ఇక కాంగ్రెస్, భాజపా రెంటినీ వ్యతిరేకిస్తూనే తెలంగాణ రాష్ట్ర సమితికి శాసనసభలో 100 స్థానాలపైన, లోకసభలో 15 స్థానాలదాకా తెచ్చుకుంటే తెలంగాణ వస్తుందని మరొక భ్రమ కూడ ప్రస్తుతం రాజ్యం చేస్తున్నది. ఆశిస్తున్న స్థానాలు వస్తే తెరాస ప్రతిష్ఠ ఇనుమడిస్తుంది. తెలంగాణ ఆకాంక్ష బలంగా ఉన్నదని ప్రపంచానికి తెలిసి వస్తుంది. నిజమే. కాని దానివల్ల తెలంగాణ రాష్ట్ర సాధన సాధ్యమవుతుందనే హామీ ఏమీ లేదు. ఎందుకంటే అది తెలంగాణ ఆకాంక్షకు నైతిక విజయం మాత్రమే అవుతుంది గాని రాజకీయ సమీకరణాలు మారడానికి కారణం కాదు. తెలంగాణకు ఆ బలం ఉన్నదని ఇదివరకు ఎన్నోసార్లు ఎన్నోవిధాల రుజువు అయింది. ఇప్పుడీ కొత్త రుజువు ఏమీ సాధించదు. అంతేకాదు, శాసనసభలో తెలంగాణ వాదాన్ని ఆమోదించే బలం నూటికి నూరు ఉన్నా దానివల్ల జరగబోయేదేమీ లేదు. నూటికి నూరు ఎప్పటికీ రావు. పోనీ తెలంగాణలోని 119 స్థానాలలో వంద అయినా తెరాస గెలుచుకుంటుందని అనుకుందాం. ఏమవుతుంది? రాజ్యాంగం ప్రకారమే శాసనసభ నడవడానికి మొత్తం సభ్యులలో పదో వంతు మంది ఉంటే

## వి.ఎచ్. కాలమ్

# ధరల రైలు పరుగులు

**వి. హనుమంతరావు**

చైనాలో రైళ్లు గంటకు కొన్ని వందల మైళ్ల వేగంతో నడుస్తున్నాయి. కాని మన దేశంలో ధరల రైళ్లు ఎంత వేగంగా నడుస్తున్నాయో చైనా పాలకులకు తెలిస్తే వాళ్లు తలకాయలు వంచుకొని వాళ్ల ఓటమిని అంగీకరించాల్సిందే.

ధరల పెరుగుదలను వినియోగ ధరల సూచి పెరుగుదల, తరుగుదలతో లెక్కిస్తారు. 1960 నుంచి 1990లో సరళీకృత ఆర్థిక విధానాన్ని ప్రారంభించే వరకూ ఈ సూచి 1960 1990 మధ్య అంటే ముప్పై సంవత్సరాల్లో 818 పాయింట్లు పెరిగితే 2009–12, అంటే కేవలం మూడేళ్లలోనే 1187 పాయింట్లు పెరిగింది. చైనాను మన దేశంతో పోటీ పడమనండి చూద్దాం. 1960 నుంచి ధరల సూచి ఎలా పెరిగిందో చూడండి.

| సంవత్సరం | వినియోగదారుల సూచి | పాయింట్ల పెరుగుదల (ప్రతి పదేళ్లలో) |
|---|---|---|
| 1960 | 100 | – |
| 1970 | 183 | 83 |
| 1980 | 399 | 207 |
| 1990 | 918 | 528 |
| 2000 | 2174 | 1256 |
| 2010 | 4012 | 1838 |
| అక్టోబర్ 2009 | 3766 | |
| అక్టోబర్ 2012 | 4953 | |

ఇందిరా గాంధీ రెండవసారి అధికారంలోకి వచ్చినప్పటి నుంచి (అప్పుడే ఐఎంఎఫ్ నుంచి రుణం తెచ్చింది) ధరల పెరుగుదల వేగం పుంజుకొందని పై పట్టిక తెలియజేస్తోంది. రాజీవ్‌గాంధీ పాలనలో మరింత వేగం. ప్రస్తుత ప్రధాని హయాంలో కోట్ల గొంతుకలు అరిచి గీపెట్టినా ఆయన చెవులకు ప్రపంచ బ్యాంకు బిరడాలు బిగించేయడంతో ఆయనకు వినపడకపోయి ఉండాలి. లేక ఆయన అసమర్థత అయినా ఉండాలి. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ధరలు విపరీతంగా పెరుగడం, డిఎ చెల్లించడం ప్రారంభమైంది. ధరల పెరుగుదల ప్రకారం డిఎ కూడా ప్రభుత్వ ఉద్యోగులకు, ఇతర రెగ్యులర్ ఉద్యోగులకు పెంచడం జరుగుతోంది. దానికి ప్రభుత్వం ఒక ఫార్ములా రూపొందించి, పెరుగుదల ఆటోమెటిక్‌గా అమలు పరుస్తోంది. అయితే ఇది పర్మనెంట్ ఉద్యోగులకు, కార్మికులకు మాత్రమే వర్తిస్తుంది. దేశంలో శ్రామిక జనావళిలో నూటికి 93 శాతం మంది అసంఘటిత రంగంలో ఉన్నారు. వీరికి ఏ పథకమూ లేదు. దేశంలో కొన్ని వందల కేంద్రాల నుంచి ధరలను సేకరించి సూచిక తయారవుతుంది. ఆ ధరల ఆధారంగా సూచిక తయారవుతుంది. అలా తయారీలో చాలా మతలబులున్నాయి. మొత్తం సూచి నూరు పాయింట్లుగా భావించి వివిధ వస్తువులకు కొన్ని పాయింట్లు నిర్ణయిస్తుంది. వినియోగదారులు ఎక్కువగా వినియోగించే వస్తువులకు తక్కువ పాయింట్లు కేటాయించి తక్కువగా వినియోగించే వస్తువుల కంటే ఎక్కువ పాయింట్లు ఇస్తుంది. దీనిని కార్మిక, ఉద్యోగుల యూనియన్లు అభ్యంతరం వ్యక్తం చేస్తూ ఆందోళన చేస్తున్నాయి. ప్రభుత్వ మోసపూరిత విధానం కారణంగా, ధరలు ఎంత ఎక్కువగా పెరుగుతాయో, డిఎ అంతమేరకు పెరగదు. మరొక మతలబు ఏమంటే ధరలు పెరిగిన కొద్దీ బేసిక్ జీతం పెంచరు. డిఎ మాత్రమే పెంచుతారు. ఇందువల్ల ఉద్యోగ విరమణ చేసినపుడు బేసిక్‌జీతం ఆధారంగా పింఛన్ నిర్ణయిస్తారు. అది ఉద్యోగులకు నష్టం.

*(రచయిత వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

చాలు. అంటే తెరాస సభ్యులందరినీ బహిష్కరించి శాసనసభ నడిపినా రాజ్యాంగబద్ధమే, సాధ్యమే. శాసనసభ సంగతి అలాపెట్టి లోకసభలో తెలంగాణలోని 17 స్థానాలకు గాను 15 స్థానాలు తెరాస గెలుచుకోగలదనుకుందాం. ఈ 15 ఏ కూటమికైనా అధికారంలో ఉంచడానికో, అధికారం నుంచి దించడానికో నిర్ణయాత్మకమయ్యే సందర్భం వస్తేనే వాటికి విలువ ఉంటుంది. మొత్తం 542 స్థానాలలో, ప్రభుత్వ స్థాపనకు కావలసిన 272 స్థానాలలో 15 స్థానాలు కీలకమైనవి అయ్యే అవకాశం ఉంది. కాని ఢిల్లీ స్థాయి అంకెల గారడీలో ఈ స్థానాలకు విలువ లేకుండా ఉండే అవకాశం కూడ ఉంది.

నిజానికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు అంకెల గారడీలో ఢిల్లీలో తెలంగాణ చేయగలిగింది చాల తక్కువ. తెలంగాణ తన నేల మీద తాను చేయవలసిన పోరాటాలు చేయవలసిన విధంగా చేస్తే ఢిల్లీయే తెలంగాణకు దిగివస్తుంది. ఈశాన్య రాష్ట్రాలు, తమిళనాడు, కశ్మీర్, పంజాబ్, హర్యానా వంటి ఎన్నో ప్రాంతాలు, అక్కడి ప్రజాసమూహాలు తాము ఢిల్లీకి వెళ్లకుండానే ఢిల్లీ తమ దగ్గరికి దిగివచ్చేటట్టు, రాయితీలు ఇచ్చేటట్టు ఒత్తిడి చేశాయి. కేంద్ర ప్రభుత్వ మెడలు వంచగలిగే పోరాట రూపాలు, తెలంగాణ ప్రజలందరి ఐక్యతను ప్రదర్శించగలిగే పోరాట రూపాలు, తెలంగాణ మీద జరుగుతున్న దోపిడీ పీడనలను ప్రతిఘటించే పోరాటరూపాలు ఇప్పటికైతే చేపట్టినవి తక్కువ. అటువంటి ప్రయత్నం ఇప్పటికైనా ప్రారంభిస్తే, రాష్ట్ర సాధన ఉద్యమాన్ని ఎన్నికల చుట్టూ తిప్పకపోతే తెలంగాణకు పరిష్కారం సులభమవుతుంది. ఎన్ని సీట్లు, ఎన్ని వోట్లు అనేది ప్రధానం కాదు, ప్రజా ఆకాంక్ష ఎంత బలంగా ఉన్నదన్నదే ప్రధానం. ఆ ఆకాంక్ష ఎన్నికలలో వ్యక్తం కావచ్చు, కాకపోవచ్చు. వ్యక్తమైనప్పుడైనా అది విభిన్న పార్టీల, అభ్యర్థుల మధ్య చీలిపోయి బలహీనం కావచ్చు.

**ఆకర్షణలు – వలసలు**

ఈ ఎన్నికల రాజకీయాల అంకెలగారడీ మీద మితిమీరిన నమ్మకం వల్లనే అన్ని పార్టీలూ ఎన్నికల వేళ కప్పల తక్కెడ రాజకీయాలను నమ్ముకుంటున్నాయి. ఒక పార్టీలోంచి మరొక పార్టీలోకి నాయకులను కార్యకర్తలను ఆకర్షించడం, అవతలి పార్టీ నుంచి ఆకర్షించగలిగితే వారి మీద గెలిచినట్టుగా, వారి మనోస్థైర్యాన్ని దెబ్బతీసినట్టుగా పొంగిపోవడం జరుగుతున్నాయి. దానికి మానసిక పోరాటం అని ముద్దుపేరు కూడ పెడుతున్నారు. ఒకస్థాయి నాయకుడిని ఇటునుంచి అటు ఆకర్షించగలిగితే, మళ్లీ అటువైపునుంచి అదే స్థాయి నాయకుడిని ఇటు ఆకర్షించి అవతలివారి విజయగర్వాన్ని అణచడం ఎట్లా అని కుట్రలూ కుహకాలూ జరుగుతున్నాయి. ఈ ఉద్వేగాల క్రీడలో నాయకుల వ్యక్తిత్వాల విధ్వంసం, రాజకీయాభిప్రాయాల దివాళాకోరుతనం, నిన్నటిదాకా ప్రకటించిన అభిప్రాయాలను ఇవాళ తిరస్కరించడం – ఈ పరిణామాల నీచత్వం ఎవరికీ కనబడడం లేదు. అన్ని పార్లమెంటరీ పార్టీలూ ఒక్క తానులోని ముక్కలే అనే మాట రోజురోజూ రుజువవు తున్నది. కాంగ్రెస్ వ్యతిరేకతే ప్రధాన భూమికగా పుట్టిన తెలుగుదేశం పార్టీలోనుంచి కాంగ్రెస్‌లోకి, వైఎస్ఆర్ కాంగ్రెస్‌లోకి వలసలు సాగుతున్నాయి. తెలంగాణ ఆకాంక్షకు తానే ఏకైక శక్తినని చెప్పుకుంటున్న తెరాస నిన్నటివరకూ పచ్చి తెలంగాణ పార్టీగా అభివర్ణించిన తెలుగుదేశం అధికార ప్రతినిధులుగా ఉన్నవారిని తనలో చేర్చుకుంటున్నది. ఇలా ఖాళీ అయిన స్థానాలను భర్తీ చేసుకోవడానికి తెలుగుదేశం కూడ అన్ని పార్టీల నుంచి శక్తులను ఆహ్వానిస్తున్నది. అంటే ఏ ఒక్క రాజకీయ నాయకుడికీ, ఏ ఒక్క రాజకీయ పార్టీకీ స్థిరమైన సిద్ధాంతాలు, సూత్రబద్ధ విధేయతలు లేవని స్పష్టమవుతున్నది. రానున్న ఎన్నికలలో గెలిచే గుర్రం ఏది, ఏ గుర్రం మీద పందెం కాస్తే తమ కాసులు దక్కుతాయి అనే జూదమే ఇవాళ రాజకీయంగా చలామణీ అవుతున్నది. అందులోనూ ప్రతి నియోజకవర్గం నుంచీ, ప్రతి పార్టీ నుంచీ కనీసం నలుగురైదుగురు అభ్యర్థులు పోటీ పడుతున్న సమయంలో, వారిలో ఎవరికి సీటు దక్కుతుందోననే ఆందోళనలోనే ఈ వలసలు, ఆకర్షణలు, ఎరలు ఇంకా ఎక్కువగా జరుగుతున్నాయి. అంతా సీట్ల భాగోతమే తప్ప ఏ ఒక్క రాజకీయ నాయకుడికీ బలమైన రాజకీయ విశ్వాసాలు లేవని, అసలు పార్టీలకే సూత్రబద్ధ రాజకీయాలు లేవని తేటతెల్లమవుతున్నది. ఒక పార్టీని నిన్నటివరకు ఎంత తిట్టినా ఆ పార్టీ తనకు సీటు ఇస్తుందంటే దానిలోకి దూకవచ్చు. ప్రాణాలు పోయేదాకా ఈ పార్టీని వదలను అని భీషణ ప్రతిజ్ఞలు చేసినా, ఆ పార్టీ సీటు ఇవ్వదేమో, ఇచ్చినా గెలవడం సాధ్యం కాదేమో అనిపిస్తే మరొక పార్టీలోకి దూకవచ్చు. నీతి, నిజాయితీ, నమ్మిన విశ్వాసానికి, ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండడం వంటి లక్షణాలేమీ మన రాజకీయ నాయకులకు, పార్టీలకు లేవని మరింతగా రుజువవుతున్నది. ఈ క్రమంలో ఒక పార్టీ మీద మరొక పార్టీ, ఒక నాయకుడి మీద మరొక నాయకుడు చేసుకుంటున్న ఆరోపణలు, ప్రచారాలు, నిందలు, తిట్లు, దుర్భాషలు వింటుంటే ఇంత అనాగరికమైన, కుసంస్కారులైన రాజకీయ నాయకులను మన ప్రజలు ఆదరిస్తున్నారా అని జుగుప్స కలుగుతున్నది.

**పాదయాత్రలు**

మన రాజకీయ నాయకులకు, రాజకీయ పార్టీలకు ప్రజల పట్ల, ప్రజా సమస్యల పట్ల ఏ మాత్రం శ్రద్ధాసక్తులు లేవని కొత్తగా చెప్పనక్కర లేదు. రాజకీయం బహులాభసాటిగా, పెద్ద ఎత్తున సాగే వ్యాపారంగా ఉన్నప్పుడు లాభనష్టాల లెక్కలే తప్ప ప్రజల ప్రస్తావన, ప్రమేయం ఉండవు. ఈ విషయాలు ఇవాళ మరింత స్పష్టంగా బయటపడుతున్నాయి గనుక, ప్రజల పట్ల తమకు బాధ్యత ఉందని మళ్లీ ఒకసారి ప్రజలను మోసగించడానికి నాయకులు ప్రయత్నిస్తున్నారు. ఆ ప్రయత్నాలలో భాగంగానే హఠాత్తుగా ప్రజలను గుర్తు తెచ్చుకుని వారిని కలవడానికి తహతహలాడుతున్నారు. తామే సృష్టించిన, పెంచిపోషించిన సమస్యలతో ప్రజలు ఎలా సతమతమవుతున్నారో తెలుసుకోవడానికి యాత్రలు సాగిస్తున్నారు. తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు రెండువేల ఎనిమిది వందల కిలోమీటర్ల పాదయాత్ర జరపగా, వైఎస్ఆర్ కాంగ్రెస్ నాయకురాలు షర్మిల పాదయాత్ర రెండువేల కిలోమీటర్లు దాటి ఇంకా సాగుతున్నది. మరెందరో ఛోటామోటా నాయకులు ప్రాంతీయ స్థాయిలో, జిల్లా స్థాయిలో పాదయాత్రలు నడుపుతున్నారు. దాదాపు అందరి విషయంలోను ఇదేదో అసాధారణమైన పని అయినట్టు, వారు 'ఆరోగ్యాలను లెక్కచేయకుండా' పాదయాత్రలు చేస్తున్నట్టు ప్రచారం జరుగుతున్నది. ఒక పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజలను నిరంతరం కలుసుకుంటూ ఉండడం, ప్రజా సమస్యలు తెలుసుకుని ఎప్పటికప్పుడు పరిష్కరిస్తూ ఉండడం ప్రజాప్రతినిధులనబడే రాజకీయ నాయకులకు తప్పనిసరి విధి. అలా తప్పనిసరిగా చేయవలసిన పనిని ఎప్పుడో ఒకసారి చేసి అదే మహద్భాగ్యం అన్నట్టు ప్రచారం చేసుకోవడం మన రాజకీయ నాయకులకే చెల్లింది. ఆ ప్రచారానికి తమ వంతు ఆకర్షణలద్ది ప్రజలను మోసగించడానికి పత్రికలు, టివి ఛానళ్లు

# గ్రామసభలకే అత్యున్నత అధికారం

***రాజ్యాంగబద్ధంగా ఆదివాసులకు ఎన్ని అధికారాలూ, చట్టాలూ కల్పించినా పాలకుల చిత్తశుద్ధి లోపం వల్ల అడుగడుగునా నిర్లక్ష్యమే జరుగుతోందనీ, ఆదివాసుల హక్కులు కాపాడడంలో ప్రతి ఒక్కరూ పాటుపడాలనీ అంటున్నారు* పి.వి. రమణ**

అటవీ ప్రాంతాలలో ఆదివాసులు తమ సామాజిక, సాంస్కృతిక, రాజకీయ హక్కులను కాపాడుకోవడంలో గ్రామ సభలకున్న అత్యున్నత అధికారాన్ని బలపరుస్తూ, వేదాంత కేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన సంచలనాత్మక తీర్పు ప్రజాస్వామికవాదులందరూ తప్పక ఆహ్వానించాలి. ఒడిశా, నియాంగిరి కొండల ప్రాంతంలో బాక్సైట్ తవ్వకానికి వేదాంత కంపెనీకి కేంద్ర అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖ 2010లో అనుమతి నిరాకరించడంతో, కంపెనీ సుప్రీంకోర్టులో వేసిన కేసులో జస్టిస్ ఆఫ్తాబ్ ఆలం, జస్టిస్ కె. రాధాకృష్ణన్, జస్టిస్ రంజన్ గొగోయ్‌లతో కూడిన ధర్మాసనం ఏప్రిల్ 18న తీర్పు ఇచ్చింది.

'ఆదివాసులు, ప్రత్యేకంగా నియాంగిరిలో నివసిస్తున్న డోంగ్రియా కోంధ్, కుటియా కోంధ్ జాతుల వారు నియాంగిరి కొండల్ని తమ దేవతలుగా, ఎత్తైన కొండ శిఖర భాగాన్ని నియాం రాజుగా కొలుస్తున్నారు. గిరిజనుల మతపరమైన నమ్మకాలు, వ్యక్తిగత, సామూహిక, సామాజిక, సాంస్కృతిక, రాజకీయ హక్కులను పరిరక్షించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అటవీ హక్కుల చట్టం ప్రకారం రాయగడ్, కలహండి జిల్లాల పరిధిలో గ్రామసభలు నిర్వహించి, నిర్ణయాన్ని తీసుకోవాలి. గ్రామ సభలకు పూర్తి అధికారాలున్నాయి. అవి తీసుకొన్న నిర్ణయాన్ని అమలు చేయాలి. కొండ శిఖరానికి మైనింగ్ కార్యకలాపాలు పది కిలోమీటర్ల దూరం వరకు ఎటువంటి నష్టం కలిగించని రీతిలో ఉన్నాయో లేదో పరిశీలించాలి. ఇటువంటి ముఖ్యమైన విషయాలేమీ గ్రామసభలకు తెలియ చేయలేదు' అని ధర్మాసనం గ్రామసభలకున్న అత్యున్నత నిర్ణయాధికారాన్ని ధృవీకరిస్తూ ఇచ్చిన తీర్పు దేశంలో అటవీ ప్రాంతాలలో మైనింగ్ పేరుతో జరుగుతున్న విధ్వంసానికి అడ్డుకట్ట వేసింది.

'గ్రామసభలు మూడు నెలల లోపు తీసుకొన్న నిర్ణయంపై కేంద్ర అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖ మరో రెండు నెలల్లో వాటిని క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాతే బాక్సైట్ మైనింగ్‌కు అనుమతినివ్వాల'ని ఆదేశించింది. రాజ్యాంగం ప్రకారం స్వేయం సమృద్ధితో కూడిన అభివృద్ధి, ప్రజల ప్రాథమిక హక్కని, పర్యావరణ విధ్వంసం ద్వారా దాన్ని దెబ్బతీసే

---

ప్రయత్నిస్తున్నాయి. ఎప్పుడూ పత్రికలలోనే, టెలివిజన్‌లోనే కనబడే, తమ మధ్యకు ఎన్నడూ రాని రాజకీయ నాయకులు జన్మానికి ఒకసారైనా తమ దగ్గరికి వచ్చినందుకు ప్రజలు అమాయకంగా వేలంవెర్రిగా ఈ పాదయాత్రలను చూస్తున్నారు. ఈ పాదయాత్రలన్నిటి ఏకైక లక్ష్యం వాటిని రానున్న ఎన్నికలలో సొమ్ము చేసుకోవడమే. మళ్లీ ఒకసారి అధికారానికి వచ్చి, ప్రజలకు మరిన్ని సమస్యలు సృష్టించడమే. ప్రజల సమస్యలను మరింతగా పెంచడమే.

**మంత్రివర్గ సభ్యుల బాధ్యత**

గత వైఎస్ రాజశేఖర రెడ్డి ప్రభుత్వంలో సాగిన అవినీతి కుంభకోణా లకు ముఖ్యమంత్రికి ఎంత బాధ్యత ఉంటుందో, ఆ మంత్రివర్గ సభ్యులకు, ఆయా రాజపత్రాల మీద సంతకంచేసిన మంత్రులకు, అధికారులకు అందరికీ అంతగా బాధ్యత ఉంటుంది. ఆ కుంభకోణాల వల్ల అప్పటి ముఖ్యమంత్రి కుటుంబ సభ్యులు మాత్రమే లాభపడ్డారని, తామేమీ లాభపడలేదని ఇవాళ సన్నాయి నొక్కులు నొక్కుతున్న అప్పటి మంత్రివర్గ సభ్యులు కూడ వ్యక్తిగతంగా ఎంత లాభపడ్డారో అందరికీ తెలుసు. అసలు ఈ పార్లమెంటరీ రాజకీయ వ్యవస్థలో ఏ చిన్నపాటి అధికారమైన ప్రజాధనాన్ని కొల్లగొట్టడానికి రాజమార్గంగా ఎలా ఉంటున్నదో, మామూలు జీవితం నుంచి రాజకీయ పదవుల్లోకి వచ్చినవారు నాలుగైదేళ్లలోనే ఎలా కోట్లకు పడగెత్తుతున్నారో అందరికీ తెలుసు. కనుక వారి ఆస్తి దృష్ట్యా చూసినా, వారు సంతకం పెట్టిన పత్రాల ప్రకారం చూసినా, మంత్రివర్గానికి ఉమ్మడి బాధ్యత ఉంటుందనే రాజ్యాంగ సంప్రదాయం ప్రకారం చూసినా ఇవాళ అధికారం అనుభవించిన రాజకీయ పార్టీల నాయకులెవరూ అవినీతికి మినహాయింపు కాదు. దొరికితే దొంగలు, దొరకనంతవరకు దొరలు అనే సూత్రమే ఇవాళ పనిచేస్తున్నది. అటువంటి సమయంలో ఆ అవినీతి కుంభకోణాలు బయటపడి ఏళ్లు గడిచిపోతున్నా మంత్రులను తొలగించక పోవడం, వారి రాజీనామాలు ఆమోదించకపోవడం, వారి మీద విచారణ జరపకపోవడం, వారి విచారణకు అయ్యే వ్యయాన్ని మళ్లీ ప్రజాధనం నుంచే సమకూర్చడం, వారు తాము నిర్దోషులమని బోర విరుచుకుని తిరగడం, సవాళ్లు విసరడం చూస్తుంటే ఎంత సిగ్గు మాలిన రాజకీయ సంస్కృతి ఇక్కడ రాజ్యం చేస్తున్నదో అర్థమవుతున్నది.

ఈ పరిణామాలన్నీ ఈ దేశంలో, రాష్ట్రంలో అమలవుతున్న పార్లమెంటరీ రాజకీయాల కుళ్లును స్పష్టంగా బయటపెడుతున్నాయి. పార్లమెంటరీ రాజకీయాలు ఎంతగా భ్రష్టమయ్యాయో, అవి ప్రజలకు, ప్రజాసమస్యలకు ఎంతగా దూరమయ్యాయో, ఎంతగా వ్యాపార, జూద మయమయ్యాయో, పార్లమెంటరీ రాజకీయ నాయకుల సంస్కారం ఎంత నీచమైన స్థాయిలో ఉందో ఈ పరిణామాలన్నీ స్పష్టంగా తెలియ జేస్తున్నాయి. ఇంత బహిరంగంగా, నిస్సిగ్గుగా జరిగిపోతున్న పరిణామాల తర్వాత కూడ పార్లమెంటరీ రాజకీయాల మీద ఎవరికైనా ఇంకా నమ్మకాలు, భ్రమలు, గౌరవం మిగిలి ఉంటే వారి అమాయకత్వానికి జాలి పడక తప్పదు. ప్రజా జీవితాన్ని అత్యంత తీవ్రంగా, దీర్ఘకాలికంగా ప్రభావితం చేయగలిగిన రాజకీయాలు ఇలా ఉన్నప్పుడు, ఈ రాజకీయా లను తోసివేసి, నిజమైన ప్రజా రాజకీయాలను రూపొందించుకోవడం ప్రజల అనివార్య బాధ్యతే. వీ

*(రచయిత పాత్రికేయులు)*

విధానాలకు అవకాశం ఇవ్వకూడదని కూడా హెచ్చరించింది. ఆదివాసులు తాము నివసించే అటవీ భూమిని తమ పూర్వీకుల నుండే సాంప్రదాయంగా వస్తున్న సహజమైన ఆస్తిగా భావిస్తారు. దాన్నుండే వారు తమ ఆర్థిక అవసరాలను తీర్చుకుంటూ, సామాజిక గౌరవాన్ని, హోదాను పొందుతారు. అందువల్లనే ఆదివాసులు భూమితో చాలా ధృడమైన మానసిక ఐక్యత కలిగి ఉంటారు. కావున ఆదివాసులు షెడ్యూల్డ్ ప్రాంతాల్ని కాపాడుకోవడానికి హక్కు కలిగి ఉన్నారు. ఈ మధ్యకాలంలో అటవీ ప్రాంతాలను సంరక్షించడంలో ఆదివాసి సమూహాల పాత్ర చాలా ఎక్కువగా ఉందని తేలిందని తీర్పులో వివరించారు.

డోంగ్రియా కోంధ్ గిరిజనులకు అతి పవిత్రమైన నియాంగిరి కొండలు ఒడిశాలో ఉన్నాయి. ఈ కొండల ప్రాంతంలో నిక్షిప్తమై ఉన్న బాక్సైట్ ఖనిజాన్ని తవ్వడానికి లండన్‌కు చెందిన అనిల్ అగర్వాల్ స్టెరిలైట్ ఇండస్ట్రీస్‌కు అనుబంధంగా ఉన్న వేదాంత అల్యూమినియమ్ లిమిటెడ్ కంపెనీతో ఒడిశా మైనింగ్ కార్పొరేషన్ లిమిటెడ్ 2010లో ఒప్పందం కుదుర్చుకుంది. స్టెరిలైట్ ఇండస్ట్రీస్‌కే చెందిన లంజీఘర్ అల్యూమినా రిఫైనరీ కోసం మొదట అనుమతులిచ్చారు. రిఫైనరీకు కావల్సిన బాక్సైట్ ఖనిజం దగ్గరలో ఉన్న నియాంగిరి కొండల ప్రాంతం నుండి తీసుకోవడానికి అనుమతులిచ్చారు. రాయగడ్, కలహండి జిల్లాల అటవీ ప్రాంతంలో ఈ కంపెనీకి 721.323 హెక్టార్ల భూమిని కేటాయించారు. ఈ భూమిలో 672.018 హెక్టార్ల భూమి అటవీ ప్రాంతంలోనిదే. అటవీ ప్రాంతంలో దాదాపు 250 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో నియాంగిరి కొండలు విస్తరించి ఉన్నాయి. వీటిలో అత్యంత ఎత్తైన నియాంగిరి కొండ శిఖరం 1516 మీటర్ల ఎత్తున ఉంది. ఈ కొండల్లో బాక్సైట్ తవ్వకాన్ని ఓపెన్ కాస్ట్ మైనింగ్ పద్ధతిలో నిర్వహించడానికి నిర్ణయించారు. సంవత్సరానికి 30 లక్షల టన్నుల బాక్సైట్ తవ్వకాలు జరుగుతాయి.

అల్యూమినా ప్లాంట్ నుండి నియాంగిరి కొండల వరకు ప్రయాణానికి, రవాణా సౌకర్యాల కోసం 18 కిలోమీటర్ల రహదారి నిర్మించాలని తలపెట్టారు. ఈ రోడ్డు నిర్మాణానికి 30 హెక్టార్ల అటవీ భూమి ధ్వంసమై పోతుంది. ఈ ప్రాంతంలో ఉన్న చెట్లన్నీ తొలగిస్తారు. ఈ స్థలాన్ని సర్వే చేసిన కేంద్ర డిప్యూటీ కన్సర్వేటివ్ ఆఫ్ ఫారెస్ట్స్ అంచనా ప్రకారం దాదాపు 1,21,337 చెట్లు పై రెండు జిల్లాల అటవీ ప్రాంతం నుండి తొలగించాల్సి వస్తుంది.

రాయగడ్, కలహండి, కోరాపుట్ జిల్లాలతో నియాంగిరి కొండలు, అటవీ ప్రాంతం అనుసంధానమై ఉంటుంది. వీటి మధ్య 7713 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో ఏనుగుల రిజర్వ్ ప్రాంతం ఏర్పాటు చేయాలని గతంలో ఒడిశా అటవీ శాఖ నిర్ణయించింది. ఈ ప్రాంతంలో దాదాపు 179 ఏనుగులున్నట్లు ఒక అంచనా. ఏనుగులతో పాటు ఈ అటవీ ప్రాంతంలో పులులు, చిరుతలు, ఎలుగుబంట్లు, తోడేళ్ళు, నాలుగు కొమ్ముల దుప్పిలు, లేళ్లు లాంటి జంతువులు స్వేచ్ఛగా సంచరిస్తుంటాయి. మైనింగ్ కార్యకలాపాలు ప్రారంభమైతే అటవీ ప్రాంతం నాశనమవడమే కాకుండా, జీవ వైవిధ్యానికి ప్రతీకగా ఉన్న జంతుజాలమంతా నశించి పోతుంది.

నాగావళి, వంశధార నదులు ఈ నియాంగిరి కొండల నుండే ప్రారంభమవుతాయి. ఈ కొండల నుండి దాదాపు 36 నీటి ప్రవాహాలు భూమిలో ఉన్న బాక్సైట్ ఖనిజ పొరల కింద నుండే ప్రవహిస్తుంటాయి. ఒక విధంగా ప్రవహించే నీరు బాక్సైట్ ఖనిజం పొరల నుండి శుద్ధి చేయబడి విడుదల అవుతుంది. బాక్సైట్ తవ్వకాలు జరిగితే ఈ నీటి వనరులన్నీ నాశనమైపోతాయి.

ఈ ప్రాజెక్ట్ పూర్తయితే లాభాల నిష్పత్తి 1:4:377 ఉంటుందని ఒడిశా ప్రభుత్వం ప్రచారం చేస్తోంది. కాని దీనికోసం కోల్పోతున్న అటవీ ప్రాంతం, నాశనమైపోయే జంతు, జీవజాలం, పర్యావరణ విధ్వంసం, తరతరాలుగా జీవనోపాధి పొందుతున్న ఆదివాసుల జీవన విధ్వంసం లాంటి ముఖ్యమైనవన్నీ ఆ లెక్కల్లో మినహాయించడాన్ని ప్రశ్నించాలి.

ఈ ప్రాంతంలో దాదాపు ఇరవై రకాల ఔషధ మొక్కలు లభిస్తాయి. పాముకాటు, తేళ్లకాటు, కడుపునొప్పి, టిబి, కీళ్లజబ్బులు, పక్షవాతం, ఎక్జిమా, స్త్రీల రుతు సమస్యలు, డయేరియా, విరిగిన ఎముకలు, అస్తమా లాంటి అనేక వ్యాధులను ఆదివాసులు ఈ మొక్కల ద్వారానే నయం చేసుకొంటారు. ఈ అటవీ ప్రాంతమంతా అద్భుతమైన జీవ వైవిధ్యంతో నిండి ఉంటుంది. అందుకే ఆదివాసులు అడవి తల్లే తమ ప్రాణాన్ని కాపాడుతుందని విశ్వసిస్తారు.

**చట్టపరమైన రక్షణలు**

జాతీయ అటవీ విధానం 1988లో మొదటిసారిగా ఆదివాసులు, అడవులతో వారి సహజీవనాన్ని గుర్తించారు. పంచాయితీ రాజ్ ఎక్స్‌టెన్షన్ టు షెడ్యూల్డ్ ఏరియాస్ (పిఇఎస్ఎ) చట్టం 1996లో సెక్షన్ 4 ప్రకారం గ్రామసభలు తమ వ్యవహారాలు చక్కబెట్టుకోవడానికి, తమ ఆచార వ్యవహారాలు రక్షించుకోవడానికి, వివాదాలు పరిష్కరించుకోవడానికి, సామూహిక హక్కుల పరిరక్షణ కొరకు చర్యలు చేపట్టడానికి అధికారం కలిగి ఉన్నాయి. ఇవి రాజ్యాంగం ద్వారా ఆ సమూహాలకు సంక్రమించిన సహజమైన హక్కులు.

అటవీ హక్కుల చట్టంలో సెక్షన్ 2ఎ ప్రకారం నియాంగిరి మైనింగ్ ప్రాంతమంతా 'కమ్యూనిటీ ఫారెస్ట్ రిజర్వ్' (సిఎఫ్ఆర్)గా గుర్తించింది. సెక్షన్ 2ఎచ్ ప్రకారం ఈ ప్రాంతంలో అత్యంత పురాతన తెగ గిరిజనులైన డోంగ్రియా కోంధ్, కుటియా కోంధ్ గిరిజనులు నివసిస్తున్నారు. సెక్షన్ 4(1) ప్రకారం భారత ప్రభుత్వం ఈ ప్రాంతంలో నివసిస్తున్న గిరిజన సమూహాన్ని గుర్తించి వారికి స్వతంత్రంగా జీవించే హక్కులు కల్పించింది. అటవీ హక్కుల చట్టం ప్రవేశిక ప్రకారం అటవీ ప్రాంతంలో నివసించే వారు అటవీ పర్యావరణ పరిరక్షణలో భాగంగానే ఉంటారు. కావున, అడవి అంటే కేవలం చెట్లు, జంతువులే కాకుండా అక్కడ నివసించే ఆదివాసులు కూడా దానిలో భాగమే. అటవీ సంరక్షణ చట్టం ద్వారా దీనిని పరిరక్షించే బాధ్యత అటవీ, పర్యాపరణ మంత్రిత్వ శాఖదే.

అటవీ హక్కుల చట్టం ప్రత్యేకమైన చట్టం. దీనికి అవసరమైనపుడు అటవీ సంరక్షణ చట్టాన్ని కూడా అధిగమించే అధికారాలున్నాయి. సెక్షన్ 5సి ప్రకారం గ్రామ సభలకు తమ ప్రాంత సహజ హక్కులను, సాంస్కృతిక హక్కులను ధ్వంసం చేసే ఎటువంటి కార్యక్రమాలనైనా అడ్డుకొని రక్షించుకొనే హక్కుని కలిగి ఉన్నాయి. వారి ప్రాంతంలో ఎటువంటి ప్రాజెక్టులు నిర్మించాలన్నా గ్రామసభల అనుమతి తప్పనిసరి అవసరం. వారి అనుమతి లేకుండా ఎటువంటి కార్యక్రమాలు నిర్వహించరాదు.

ఆదివాసులను వారి స్వస్థలాల నుండి తొలగించాలంటే సెక్షన్ 4(5) ప్రకారం, ప్రతి గ్రామసభ నుండీ వారికి ఎటువంటి ఇబ్బందులు లేవనీ, చట్టం ప్రకారం అన్ని నిబంధనలను పాటించారనీ స్పష్టంగా తెలియచేస్తూ ఉత్తరాలు ఇచ్చిన తర్వాతే తొలగింపు కార్యక్రమం కొనసాగించాలి.

ఒడిశా ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి 2009, అక్టోబర్ 24న రాయగడ్, కలహండి జిల్లాల కలెక్టర్లకు ఇచ్చిన ఆదేశాల ప్రకారం మైనింగ్ కోసం సేకరించబోతున్న అటవీ భూమి విషయం గ్రామసభల ముందు

పెట్టాలనీ, వారి అంగీకారం గానీ, తిరస్కారం గానీ ప్రభుత్వానికి తెలియ చేయాలని కోరారు. కాని, ఆ కలెక్టర్లు ప్రభుత్వానికి సమర్పించిన పత్రాలలో గ్రామసభల అభిప్రాయాలను జతచేయలేదు.

సెక్షన్ 6(బి) ప్రకారం ప్రభుత్వ యంత్రాంగం గ్రామ సభలకు సరఫరా చేయాల్సిన మైనింగ్‌కు సంబంధించిన మ్యాప్‌లు, ఓటర్ల లిస్టులు సరఫరా చేయలేదు. నిజానికి సెక్షన్ 7 ప్రకారం ఈ చర్యల కారణంగా అధికారులపై కేసులు నమోదు చేసి శిక్షించాలి. కాని అటువంటిదేమీ జరగలేదు.

ఆ ప్రాంత గ్రామసభలన్నీ తీర్మానాలు చేశాయి. వాటిలో 'మైనింగ్ కోసం నిర్ణయించిన అటవీ ప్రాంతం మా జీవనాధారంగా ఉంది. మా తెగల సంస్కృతి, మైనింగ్ వలన ధ్వంసమైపోతుంది. దీన్ని ఎటువంటి పరిస్థితుల్లోనూ కొనసాగించవద్దు' అని స్పష్టంగా పేర్కొన్నారు. ఇక్కడ మైనింగ్ జరిగితే అత్యంత ప్రాచీనమైన కోంధ్‌గిరి జనులు నిర్వాసితులు కావడమే కాకుండా వారు పవిత్రంగా భావించే నియాంగిరి కొండలు విధ్వంసమైపోతాయి. స్వయం సమృద్ధితో బతికే గిరిజనుల జీవన విధానం ధ్వంసమైపోతుంది.

అటవీ ప్రాంతాల సంరక్షణ కొరకు చేపట్టాల్సిన చర్యల కోసం కేంద్ర ప్రభుత్వ ఏర్పాటు చేసిన భూరియా కమిటీ అనేక సిఫారసులు చేసింది. 1) షెడ్యూల్డ్ ప్రాంతంలో విపరీతంగా పరిశ్రమల స్థాపన, ఆదివాసి ఆర్థికాభివృద్ధిపై ఎటువంటి ప్రభావం చూపుతుందో విశ్లేషించకుండా వాటిని ప్రారంభించరాదు. 2) ప్రభుత్వం షెడ్యూల్డ్ ప్రాంతాల్లో పరిశ్రమలు నెలకొల్పడానికి అనుకూలమైన ప్రాంతాలను గుర్తించే ముందు, ఆదివాసి ప్రజలు, వారి వ్యవస్థలు ఈ ప్రక్రియలో భాగస్వాములయ్యారా? లేదా. కమ్యూనిటీ అంతిమ నిర్ణయం ఉందా? లేదా, అనే విషయాలను పరిగణనలోకి తీసుకోవాలి. 3) వ్యవసాయ భూమి, లేదా సాధారణ అవసరాల కోసం ఉపయోగించే భూమిని కొనడం లేదా అమ్మడం, ఏ విధంగానైనా బదలాయించడం లాంటిది పరిశ్రమల స్థాపన కోసం చేయరాదు.

వేదాంత లాంటి బహుళజాతి కంపెనీ లాభాల వేట కోసం నేడు ఒడిశాలో మైనింగ్ కార్యక్రమాలు ముమ్మరంగా కొనసాగుతున్నాయి. దీని వలన ఆ ప్రాంత ఆదివాసిల జీవితాలు విధ్వంసమై పోవడమే కాకుండా అత్యంత విలువైన జీవ వైవిధ్యంతో నిండిన అటవీ భూమి కూడా నాశనమైపోతోంది.

**ఒడిశాలో విధ్వంసం సృష్టిస్తున్న మైనింగ్**

ఒడిశా అటవీ ప్రాంతంలో అనేక రకాల ఖనిజ నిల్వలున్నాయి. వాటిలో బాక్సైట్ 1733 మిలియన్ టన్నులు, అంటే దేశం మొత్తం నిల్వల్లో 59.5 శాతం. ఇంకా బొగ్గు, క్రోమైట్, చైనా క్లే, డోలమైట్, గ్రాఫైట్, ఫైర్‌క్లే, ఇనుప ఖనిజం, మాంగనీస్, మినరల్ శాండ్స్, పైరోఫైలట్, నికెల్ లాంటి ఖనిజాలు అనేకం నిక్షిప్తమై ఉన్నాయి. ఒడిశాలో బాక్సైట్ నిల్వల విలువ 4 లక్షల కోట్ల డాలర్లు ఉంటుందని ఒక అంచనా. సామ్రాజ్యవాద దేశాల యుద్ధ పరిశ్రమకు అల్యూమినియం చాలా అవసరం. అమెరికా బాక్సైట్‌ను 80 నుండి 90 శాతం వరకు విదేశాల నుండి దిగుమతి చేసుకోవాల్సిన దుస్థితిలో ఉంది. విమానాల తయారీతో పాటు అమెరికా సైనిక శక్తికి అల్యూమినియం చాలా కీలకమైందని ఏనాడో గుర్తించారు. 'అల్యూమినియం కంపెనీ ఆఫ్ అమెరికా' నలభై దేశాల నుండి బాక్సైట్ సేకరిస్తుంది. అందులో భారత దేశం కూడా ఉంది. అందుకే మన దేశ ప్రజల సంపదపైన అడవుల్ని నరికేసి బాక్సైట్‌ను బహుళజాతి కంపెనీలకు ధారపోయడానికి మన పాలకులు తొందర పడుతున్నారు.

ఈనాడు ఒడిశాలో దాదాపు 1200 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో గనుల తవ్వకాలు జరుగుతున్నాయి. దీని చుట్టూ 20,866 చదరపు కిలోమీటర్ల అటవీ ప్రాంతం ఉంది. ఇప్పటికే గనుల తవ్వకాల వలన 10 శాతం బయలుగా ఉన్న అటవీ ప్రాంతం సమూలంగా నాశనమై పోయింది. ఇక్కడ ఓపెన్ కాస్ట్ మైనింగే ఎక్కువగా జరుగుతోంది. మైనింగ్‌లో తవ్వేసిన భూమి పై భాగంలోని మట్టిని విచ్చలవిడిగా పారేస్తున్నారు. తవ్వకాల తర్వాత విషతుల్య రసాయన వ్యర్థాలు, భారీ లోహాలను బాధ్యతారహితంగా విడుదల చేస్తూ ఆ ప్రాంత భూము లన్నింటినీ కాలుష్యమయం చేస్తూ జీవ వైవిధ్యానికి తీవ్ర నష్టం కలిగిస్తున్నారు. దాంతో పంటలు పండే భూములన్నీ శాశ్వతంగా పంటలు పండించడానికి పనికి రాకుండా తయారవుతున్నాయి. రకరకాల ఖనిజ అవశేషాలు భూమిలోకి చేరడం వలన భూమి సమూలంగా సారాన్ని కోల్పోతోంది.

ఈ గనుల తవ్వకాల వలన ఈ ప్రాంత నీటి వనరులన్నీ దెబ్బతింటున్నాయి. పెద్ద నదులైన ఇబ్, బ్రాహ్మణి, మహానది, బైతరణి, నాగావళి నదుల మార్గాలు కుంచించుకుపోయి తమ సహజమైన మార్గాల నుండి మళ్లిపోతున్నాయి. దీని వలన పంట భూముల నీటి అవసరాలు దెబ్బతింటున్నాయి. మొత్తం మీద పారిశ్రామిక అవసరాలకు, సాగు, తాగు నీటికి కూడా తీవ్రమైన సంక్షోభం ఏర్పడింది. మైనింగ్ కార్యకలాపాల వలన ఏర్పడిన కాలుష్య వాతావరణం వలన నీటిలో జీవించే జలచరాల సంతతికి తీవ్రమైన ముప్పు ఏర్పడింది.

ఒడిశాలో బాక్సైట్, క్రోమైట్ మైనింగ్‌ల వలన వేలాది ఎకరాల పంట భూములు అంతరించిపోతున్నాయి. ఆదివాసులు నిరాశ్రయు లవుతున్నారు. ఈ ప్రాంతాలలో నివసించే ఏనుగులు, ఇతర జంతువులు శ్రీకాకుళం, విజయనగరం లాంటి ప్రాంతాలకు వలస పోతున్నాయి. ఇలా వలస వచ్చిన ఏనుగులు ఆగ్రహానికి ఆ జిల్లాలలో ఇప్పటికే పదమూడు మంది బలయ్యారు. మైనింగ్ కోసం అడవులు నరికేయడం వలన అడవి దున్నలు, అడవి ఆవులు బాగా తగ్గిపోయాయి. ఒడిశా నుండి బస్తర్ వెళ్లే దారిలో ఎక్కువగా తిరుగాడే పులులు, చిరుతలు, అడవి పిల్లులు, దుమ్మలగొండ్లు, చుక్కల దుప్పిలు కనుమరుగై పోతున్నాయి. నాగావళి, వంశధార నదుల పుట్టుక ప్రాంతంలోని చిత్తడి నేలల్లో కనిపించే చౌసింగాలు, నాలుగు కొమ్ముల దుప్పిలు కనుజులు పూర్తిగా అదృశ్యమైపోయాయి.

**ఆదివాసి ప్రాంత విధ్వంసంపై డా. బి.డి. శర్మ లేఖ**

మన దేశంలో ఆదివాసి వ్యవహారాలపై సాధికారత కలిగిన అరుదైన వ్యక్తి డా. బి.డి. శర్మ. బస్తర్ జిల్లాలో కలెక్టర్‌గా, మెజిస్ట్రేట్‌గా పనిచేశారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో పని చేసినపుడు ఆదివాసులకు అనుకూలమైన పాలసీలను రూపకల్పన చేయడంలో ప్రత్యేకించి సబ్ ప్లాన్ వ్యూహాన్ని తయారు చేసే బాధ్యతను తీసుకొన్నారు. 5వ షెడ్యూల్‌కు గుర్తింపు తేవడంలో, జాతీయ ఎజెండాపై ఆదివాసి ప్రజల జీవనం తీసుకు రావడానికి విశేషంగా కృషి చేశారు. ప్రత్యేకంగా ఈ మధ్యనే అమలు కాని హామీల చరిత్ర (భారత రాజ్యం – ఆదివాసులు) అనే గొప్ప పుస్తకం రాశారు. ఆయన ఆదివాసి ప్రాంతాల్లో జరుగుతున్న విధ్వంసంపై 2010, మే 17న భారత రాష్ట్రపతికి ఒక లేఖ రాశారు. దానిలో ముఖ్యాంశాలు:

'మన దేశంలో నలువైపులా విస్తరించిన ఆదివాసి ప్రజలకు సంబంధించి కొన్ని సంక్లిష్టమైన విషయాలపై, యుద్ధ వాతావరణంపై

మీ దృష్టిని ఆహ్వానిస్తున్నాను. మునుపటి రాష్ట్రపతి కె.ఆర్ నారాయణన్ 2001, జనవరి 26న దేశాన్ని ఉద్దేశించి చేసిన ప్రసంగం మీ దృష్టికి తీసుకువస్తున్నాను. 'మన చట్టంలో స్పష్టం చేసినట్లు ఆదివాసి భూములను ఇతరులకు, ప్రైవేట్ సంస్థలు, లేదా కార్పొరేషన్‌కు బదలాయించడం నిషేధించబడింది. సుప్రీంకోర్టు తన తీర్పుల ద్వారా ఇటువంటి నిబంధనలను ఎత్తిపట్టింది. మన రాజ్యాంగంలో వివరించిన సామాజిక నిబద్ధతను మనం నిర్లక్ష్యం చేయరాదు. తూర్పు భారతంలో బాక్సైట్ లాంటి ఖనిజాలను దోపిడీ చేయడం వలన అడవుల్లో సహజ వనరుల, నీటి వనరుల వినాశనం జరుగుతోంది. ఈ దోపిడీ నుండి దేశం బయట పడాలి. పర్యావరణ, ఆదివాసి హక్కుల పరిరక్షణ లాంటి విషయాలను పరిగణనలోకి తీసుకోవాలి. శతాబ్దాల తరబడి అడవుల్లో నివసిస్తున్న అమాయక ఆదివాసిలను, పచ్చని భూములను నాశనం చేసి భారత రిపబ్లిక్‌ను నిర్మించారని రాబోవు తరాలు మనల్ని గురించి మాట్లాడుకోరాదు. ఈ రిపబ్లిక్ అభివృద్ధి కావాలనే తపనలను పచ్చని ఈ భూమిని, ఆదివాసిలను నాశనం చేశారని చెప్పుకోరాదు. ఈ దేశాలలో కరుణ, సహనంతో ప్రతి ఒక్కరినీ బతికించేందుకు అవకాశం ఉంటుందని చూపించాలి.'

'మన పాలకవర్గాలు ఆదివాసిలను ఉద్దేశించి వారిని 'పేదవాళ్లు' అని, వారు జాతీయ జీవనంలో భాగం కావాలని చెప్తుంటారు. కానీ ఆదివాసులకు ఆత్మగౌరవం ప్రధానమైనది. వారి ఇళ్లలోనే వాళ్లు పరాయి వాళ్లైపోయారు. దోచుకోబడుతున్నారు. పచ్చబంగారంలో వాళ్లు రత్నాల్లాంటి వారు. ఈ గొప్ప భారత రిపబ్లిక్‌కు గర్వకారణంగా నిలుస్తున్నారు.

'అంతేకాదు, ఆదివాసులు ఈ భూమిపై ప్రజాస్వామికవాదులు, 5వ షెడ్యూల్ వారికి తాతల కాలం నాటి రక్షణ కవచం. మన రాజ్యాంగం ఆమోదించిన తెగలు నేరమయం అవుతున్నాయి. గవర్నర్లు అపరిమితమైన అధికారాలు కలిగి ఉన్నప్పటికీ ఆదివాసుల దుర్గతి గురించి పట్టించుకోలేదు. ఈనాటికీ పరిస్థితిలో మార్పు లేదు.'

'1996 పెసా చట్టం, దేశవ్యాప్తంగా ఉన్న ఆదివాసుల్లో ఉత్సాహానికి కారణమయింది. చారిత్రకంగా వారికి జరిగిన అన్యాయం పోగొట్టిన ఒక రక్షణలాగా భావించారు. సాంప్రదాయాలను, స్వపరిపాలనను, వారి ఆత్మగౌరవాన్ని గౌరవించినట్లుగా వాళ్లు భావించారు. అయితే ఈ స్ఫూర్తి ఆచరణలో విఫలమయింది. పాలకవర్గాలు 'పెసా' చట్టం అమలుకు తయారుగా లేరు. అన్ని రాష్ట్రాలలోనూ దాదాపు ఇలాంటి పరిస్థితే ఉంది. పెద్ద ఎత్తున దోపిడీ వలన ఎంతో మంది ఆదివాసులు నిర్వాసితు లవుతున్నారు. లెక్కపెట్టలేనంత స్థాయిలో ఆందోళనలు జరుగుతున్నాయి. తిరుగుబాట్లు రెండింతలుగా పెరిగిపోతున్నాయి. అభివృద్ధి పథకాల పేరుతో వారి వెనకనే పొగపెడుతున్నారు. యువకులు దుష్ట విధానాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న వాళ్లతో కలిసి పోతున్నారు.'

'మీరు ఈ విషయాలన్నీ తక్షణమే పరిశీలించమని విజ్ఞప్తి చేస్తున్నాం. ఆదివాసులకు చేసిన వాగ్దానాలన్నీ (రాజ్యం ఉల్లంఘించినవి) ఒక సంవత్సరం లోపున నిజాయితీగా అమలు చేయాలి. బలవంతంగా వారిపై రుద్దిన వాటిని తిరగతోడి 'పెసా' చట్టం ప్రకారం సంప్రదింపులు జరిపి అవసరమైన అంశాలను తిరిగి పరీక్షించాలి.'

ఆదివాసులపై ప్రేమతో, వారిపై జరుగుతున్న దాడులను అడ్డకోవాలనే బాధ్యతతో శర్మగారు రాసిన ఉత్తరానికి ఈ వ్యవస్థ నుండి జవాబుదారీతనం ఉంటుందనే నమ్మకం ఆయనకు ఏ కోశానా లేదు. కాని సామాజిక బాధ్యత కలిగిన ఒక ఉన్నతాధికారిగా తన కర్తవ్యాన్ని నిర్వహించారు. ఇదే సందర్భంలో ఆదివాసి ప్రజలకు జరుగుతున్న అన్యాయాలపై గతంలో సుప్రీం కోర్టు ఇచ్చిన మరో తీర్పును తెలుసుకొందాం.

మహారాష్ట్రలోని భిల్ తెగకు చెందిన 25 సంవత్సరాల నందాబాయ్‌పై ఆ గ్రామంలో అగ్ర కులస్తులు దాడి చేసి, కొట్టి ఆమెను ఊరేగించారు. ఆ కేసులో నిందితులకు అనుకూలంగా ఇచ్చిన మహారాష్ట్ర హైకోర్టు తీర్పును రద్దు చేస్తూ దేశంలో ఆదివాసులపై అమలవుతున్న అణచివేతను ప్రస్తావిస్తూ సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. దానిలో ముఖ్యాంశాలు: 'మన దేశంలో ఆదివాసి ప్రజలకు జరిగిన అన్యాయం దేశ చరిత్రలో సిగ్గు పడాల్సిన అంశం. ఈ ఆదివాసిలు రాక్షసులనీ, అసురులనీ అనేక చెడ్డ పేర్లతో పిలిచాం. పెద్ద సంఖ్యలో చంపేశాం. బతికున్న వాళ్లనూ, వాళ్ల వారసులనూ అవమానపరిచాం, అతి హీనంగా చూశాం. శతాబ్దాల తరబడి వాళ్ల మీద అనేక అత్యాచారాలు జరిపాం. వాళ్ల భూములను ఆక్రమించుకొని వాళ్లను అడవుల్లోకి, కొండలలోకి నెట్టేశాం. వాళ్లక్కడ పేదరికంలో, రోగాలతో, చదువు లేక దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు. చివరకు వాళ్లను అటవీ, కొండ ప్రాంతాల నుండి కూడా తరిమివేసి వాళ్ల జీవనాధారమైన అటవీ సంపదను స్వాధీనం చేసుకోవడానికి కొందరు ప్రయత్నిస్తున్నారు. మహాభారతంలో ఆదివాసులకు జరిగిన అన్యాయానికి పెద్ద ఉదాహరణ ఉంది. తక్కువ కులంలో పుట్టిన ఏకలవ్యుడికి విలు విద్య నేర్ప నిరాకరించిన ద్రోణాచార్యులు, క్షత్రియుడైన అర్జునుడ్ని విజేతగా చేయడం కోసం ఏకలవ్యుడి బొటనవేలుని నరికి ఇమ్మని కోరడం. ఇది సిగ్గు మాలిన చర్య.'

'ఇంత భయంకరమైన నిర్బంధం, పీడన అమలవుతున్నప్పటికీ మన దేశంలో ఆదివాసేతరుల కంటే, ఆదివాసులే ఉన్నతమైన నైతిక విలువల్ని పాటిస్తున్నారు. వాళ్లు ఎవరినీ మోసం చేయరు. అబద్ధాలు ఆడరు. ఆదివాసేతరులు చేసే తప్పుడు పనులేవీ చేయరు. వారి పట్ల చరిత్ర క్రమంలో అమలైన అన్యాయాన్ని సరి చేయవలసిన సందర్భమిది' అంటూ ఆదివాసుల జీవితాల్ని నాశనం చేస్తున్న మన పాలకుల నిజస్వరూపాన్ని బయట పెట్టింది ఈ తీర్పు.

మైనింగ్ ప్రాజెక్టుల వలన అత్యధికంగా నష్టపోయేది ఆదివాసులే. శతాబ్దాలుగా, అటవీ భూములపై ఆధారపడి జీవిస్తున్నారు ఆదివాసులు. అక్కడి నేల పొరల్లో ఖనిజాలు సమృద్ధిగా నిక్షిప్తమై ఉండడం వలన బహుళజాతి కంపెనీల లాభాల వేటలో భాగంగా నిర్వాసితులవుతున్నారు. దేశం మొత్తం అడవుల్లో 60 శాతం ప్రాంతంలో ఆదివాసులు నివసిస్తున్నారు. ప్రధానంగా ఆదివాసులు 187 జిల్లాల్లో ఉన్నారు. అంటే దేశం మొత్తంలో 3వ భాగం. నేడు ప్రపంచీకరణ పేరుతో సామ్రాజ్యవాదులకు దేశ ఆస్తులను, షెడ్యూల్డ్ ప్రాంతాలను, ఆదివాసుల ఆధీనంలో ఉన్న విలువైన ఖనిజ సంపదను దోచి పెడుతున్నారు మన పాలకులు.

ఆదివాసి ప్రాంతాలలో గ్రామసభలకు గల అత్యున్నత అధికారాన్ని సుప్రీంకోర్టు తీర్పు ధృవీకరించినా పాలకవర్గాలు దాన్ని పాటిస్తాయా అనేది పెద్దప్రశ్న. అంతర్జాతీయ మైనింగ్ కంపెనీ వేదాంత 2011-12లో అన్ని జాతీయ రాజకీయ పార్టీలకు 31 కోట్ల రూపాయలు విరాళాలుగా ఇచ్చిన సంగతి మనకు తెలుసు. అలాంటి బహుళజాతి కంపెనీల కొమ్ముకాసే మన పాలకులు సుప్రీంకోర్టు తీర్పు ప్రకారం ఆదివాసులకు న్యాయం చేస్తారా? ఏది ఏమైనా సుప్రీంకోర్టు తీర్పు ప్రజాస్వామ్య ఆకాంక్షల గుర్తింపుకు చిహ్నంగా ఆహ్వానిస్తూ ఆదివాసి సమూహంపై జరుగుతున్న దాడిని ఎదుర్కొనే పోరాటంలో భాగస్వాములవుదాం.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# ఎడ్సమెట్ట హత్యాకాండ

***జార్ఖండ్ హ్యూమన్ రైట్స్ మూవ్‌మెంట్ ప్రధాన కార్యదర్శి గ్లాడ్‌సన్ డంగ్ డంగ్ రాష్ట్రపతికి రాసిన బహిరంగ లేఖ***

రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ గారూ,

1 చత్తీస్‌గడ్‌లోని బిజాపూర్ జిల్లా గంగలూరు పోలీస్ స్టేషన్ పరిధిలోని ఎడ్సమెట్ట గ్రామవాసులైన పండు, బహదూర్, జోగా, కోము, పూనం, సోము, లక్కు, కారం మాసా అనే ఎనిమిది మంది ఆదివాసులను భద్రతా దళాలు 2013 మే 17 రాత్రి 9.30 ప్రాంతంలో అత్యంత పాశవికంగా కాల్చిచంపి, భద్రతా బలగాలకూ మావోయిస్టులకూ మధ్య జరిగిన ఎదురు కాల్పులలో వారు చనిపోయారని ప్రకటిస్తున్న విషయం మీ దృష్టికి తేదలచాను.

2. ఆదివాసి ప్రజలు ఆ రాత్రి తమ సాంప్రదాయిక విత్తనాల పండుగ జరుపుకుంటుండగా ఈ ఘటన జరిగింది. ఆ పండుగలో ఆ గ్రామానికి చెందిన ప్రజలందరూ స్త్రీలూ పిల్లలూ కూడ పాల్గొంటున్నారు. వారిని నక్సలైట్లుగా భావించిన భద్రతా దళాలు ఆ స్థలానికి వచ్చిన వెంటనే కాల్పులు ప్రారంభించాయి. గ్రామ పెద్దలు తారం లక్కు, తారం బుద్ధు చెపుతున్న ప్రకారం అక్కడ పండుగ జరుపుకుంటున్న సమయంలో, చనిపోయిన వారిలో నక్సలైట్లు ఎవరూ లేరు. గ్రామస్తులు విత్తనాల పండుగ జరుపుకుంటుండగా అక్కడికి చేరిన భద్రతా బలగాలు హఠాత్తుగా ఎటువంటి హెచ్చరిక లేకుండా కాల్పులు ప్రారంభించాయని వారు చెప్పారు. ఆ హత్యాకాండలో ముగ్గురు పిల్లలతో సహా ఎనిమిది మంది ఆదివాసులు చనిపోయారు. ఆ గందరగోళంలో ఇరవైరెండు మంది ఎటుపోయారో ఇప్పటికీ జాడ తెలియడం లేదు. భద్రతా బలగాలు జరిపిన కాల్పులలోనే ఒక జవాను మరణించగా, ఇద్దరు గాయపడ్డారు.

3. గ్రామ పెద్దలు తారం లక్కు, తారం బుద్ధు చెప్పిన ప్రకారం పోలీసు కాల్పులలో ఇద్దరు చిన్నపిల్లలతో సహా నలుగురు గాయపడ్డారు. పది సంవత్సరాల రేణు, 15 సంవత్సరాల పూనం సొమ్ములతో పాటు తారం ఐతు, సోని తారం ఇలా గాయపడి ప్రాణాపాయ స్థితిలో ఉన్నారు. ఇలా తీవ్రంగా గాయపడిన నలుగురిని వైద్య సహాయం కోసం సమీపంలోని జగ్దల్‌పూర్ ఆస్పత్రికి చేర్చడానికి రాష్ట్ర ప్రభుత్వం రెండు రోజులు తీసుకోవడం శోచనీయమైన విషయం. జగ్దల్‌పూర్ ఆస్పత్రిలో ఎన్నో అంబులెన్స్ వాహనాలు ఉన్నప్పటికీ ఇది జరిగింది. ఈ ఆదివాసు లందరూ అమాయకులు. నక్సలైట్లు కారు. భద్రతా బలగాలు వారిని ఉద్దేశపూర్వకంగా హత్య చేశాయి. ఆదివాసుల ప్రాణాలను పణంగా పెట్టి ఆర్థిక ప్రగతి సాధిస్తూ ఉరకలేస్తున్న రాష్ట్రంగా చెప్పుకుంటున్న చత్తీస్‌గడ్‌లో ఇటువంటి హత్యాకాండలు పదేపదే జరుగుతున్నాయి. 2012 జూన్ 28న ఇటువంటి ఘటనలోనే బిజాపూర్ జిల్లా కొత్తగూడ, సార్కె గూడ, రాజ్ పెంట గ్రామాల సరిహద్దులో 17 మంది ఆదివాసులను భద్రతా బలగాలు చంపివేశాయి. ఇక్కడ రాజ్యం ఆదివాసి ప్రజల రాజ్యాంగబద్ధమైన, చట్టపరమైన, సాంప్రదాయిక హక్కులను పరిరక్షించే, అమలుచేసే బాధ్యతలో విఫలం కావడం మాత్రమే కాదు, ఆదివాసులకు వ్యతిరేకంగా నేరాలను ప్రోత్సహిస్తున్నదని స్పష్టమవుతున్నది. గనుల తవ్వకం, విద్యుత్ ప్రాజెక్టులు, ఉక్కు కర్మాగారాలు, వగైరాల కోసం చత్తీస్‌గడ్ ప్రభుత్వంతో వందలాది ఒప్పందాలపై సంతకాలు చేసిన కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలను ప్రోత్సహించే, పరిరక్షించే స్పష్టమైన ఉద్దేశంతోనే ఇటువంటి ఘటనలు పదేపదే జరుగుతున్నాయి. ఆదివాసులను చంపి, దోపిడీ చేసి, నిర్మూలించి, భూమి ఖాళీ చేసి కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టేందుకే ప్రభుత్వం ఈ పనులను ఉద్దేశపూర్వకంగా చేస్తున్నది.

ఆదివాసి ప్రజల రక్షణ బాధ్యతను రాజ్యాంగం మీమీద ఉంచింది గనుక, మీరు తక్షణమే ఈ కింది చట్టపరమైన చర్యలు తీసుకోవాలని నేను సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నాను:

1. ఎనిమిది మంది ఆదివాసుల హత్యాకాండపైన, ఆదివాసులపైన భద్రతాబలగాలు సాగించే ఇతర దోపిడీ, అత్యాచారాలపైన ఉన్నతస్థాయి న్యాయవిచారణ జరిపించాలి.
2. ఆదివాసి ప్రజల హత్య, దోపిడీలతో సంబంధం ఉన్న అధికారు లందరిపైనా, భద్రతాబలగాలపైనా హత్య కేసు నమోదు చేయాలి. వారందరినీ వెంటనే ఉద్యోగాల నుంచి తొలగించి నిర్బంధించాలి.
3. మృతుల కుటుంబాలకు ఒక్కొక్కరికి రు. 25 లక్షల చొప్పున నష్ట పరిహారం, ఒక ప్రభుత్వోద్యోగం ఇవ్వాలి.
4. గాయపడిన బాధితులకు ఒక్కొక్కరికి రు. 5 లక్షల నష్టపరిహారం, ఉచిత వైద్య సహాయం అందించాలి.
5. చత్తీస్‌గడ్ ఆదివాసులకు భారత ప్రభుత్వం పూర్తి రక్షణ కల్పించాలి.
6. చత్తీస్‌గడ్ ముఖ్యమంత్రి డా. రమణ్ సింగ్ తన రాష్ట్రంలో భారత రాజ్యాంగాన్ని, దేశపు ఇతర చట్టాలను అమలు చేయడంలో, పరిరక్షించడంలో విఫలమయ్యాడు గనుక వెంటనే ఆయనను పదవి నుంచి తొలగించాలి.
7. గ్రామసభలకు ముందస్తు సమాచారం, వాటి అనుమతి లేకుండా ఆదివాసి గ్రామాలలో నక్సలైట్ వ్యతిరేక చర్యలు జరపగూడదు.
8. బలవంతంగా భూములు సేకరించడం ఆపివేయాలి. గ్రామసభల అనుమతి లేకుండా సంతకాలు జరిగిన ఒప్పందాలను రద్దు చేయాలి.
9. రాజ్యాంగంలో హామీ ఇచ్చిన ఐదో షెడ్యూల్ ప్రాంతాలు, 1996 పంచాయత్ రాజ్ విస్తరణ చట్టం, ఇతర స్థానిక భూమి చట్టాలు రాష్ట్రంలో అమలు చేయాలి.
10. దేశంలోని తొమ్మిది రాష్ట్రాలలో ఐదవ షెడ్యూలును సక్రమంగా అమలు చేసేట్టు, ఆదివాసులకు రక్షణ కల్పించేట్టు ఒక ఉమ్మడి చట్టాన్ని భారత పార్లమెంటులో ప్రవేశపెట్టాలి.

భారత ఆదివాసుల బాధలను, సమస్యలను, వేదనను మీరు అర్థం చేసుకోగలరనే ఆశిస్తున్నాను. వీ

# మళ్లీ నెత్తుటి మడుగులో విత్తనాల పండుగ

***సార్కెగూడ హత్యాకాండ జరిగి ఏడాది నిండక మునుపే మళ్లీ ఒకసారి ఆదివాసుల విత్తనాల పండుగపై ప్రభుత్వ బలగాలు దాడి చేసి ఎనిమిది మంది ఆదివాసులను బలిగొన్న ఘటనను వివరిస్తున్నారు* వరవరరావు**

**2013** మే 17వ తేదీ రాత్రి చత్తీస్‌గడ్ సిఆర్‌పిఎఫ్‌కు చెందిన కోబ్రా బెటాలియన్, చత్తీస్‌గడ్ ఆర్మ్‌డ్ ఫోర్స్, జిల్లా పోలీసులు, కోయ కమాండోల సంయుక్త బలగాలు గంగులూరు పోలీసు స్టేషన్ పరిధిలోని ఎడ్సమెట్ట గ్రామం పొలిమేరల్లో సమావేశమైన ప్రజలపై జరిపిన నిర్విచక్షణ కాల్పుల్లో కనీసం ఎనిమిది మంది ఆదివాసులు అక్కడికక్కడే మరణించారు. ఇది బీజాపూర్ జిల్లాలో ఏడాది తిరగకుండానే మరొక పెద్ద మారణకాండ. మృతులను గ్రామస్థులు జోగా కరం, పాండు కరం, చోము కరం, పూనెం సోను, కరం మాస (27–30 సంవత్సరాల మధ్య వయసు వాళ్లు), లుఖ్మా (15), గుడ్డూ కరం (10), పూనం (12)లుగా గుర్తించారు. వయసును బట్టే వీరిలో ముగ్గురు మైనర్ బాలురు అనేది స్పష్టం. వీరిలో గుడ్డూ పాండు కొడుకు. బహదూర్ జోగా కరం కొడుకు. వీళ్లందరు అర్సెంపేట గ్రామస్థులు. ఇంకా ఇరవై ఇద్దరు గ్రామస్థులు ఏమైపోయారో ఆచూకీ తెలియదు. మృతుల సంఖ్య పెరిగే అవకాశం కూడా ఉంది.

ఈ సంయుక్త పోలీసు బలగాలు వెయ్యి మంది దాకా సర్కెంగూడ, జాగర్‌గొండ, బసగూడ, చేర్పాల్, కిరందుల్, గంగులూరు పోలీసు స్టేషన్‌ల నుండి ఆరు టీములుగా వచ్చి ఎడ్సమెట్ట గ్రామాన్ని చుట్టుముట్టారు. ఇది పిడియా గ్రామానికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. పిడియా గ్రామం మీద దాడి చేయడం తమ లక్ష్యమని, ఇటీవలి కాలంలోనే పిడియా మీద తాము మూడుసార్లు దాడి చేశామని స్వయంగా నక్సల్స్ ఆపరేషన్స్ డిజిపి ఆర్.కె. విజ్ మీడియాతో చెప్పాడు. పిడియా చాలా ఎత్తు మీద, మూడు వైపులా పర్వతాలతో చుట్టబడి ఉన్నదని, సిపిఐ మావోయిస్టు పది మిలిటరీ కంపెనీలల్లో రెండు అక్కడే ఉన్నాయని, వాటిలో నుంచే 2వ, 8వ కంపెనీలు 2010లో చింతల్నార్ దాడికి వ్యూహం పన్నాయని హోంమంత్రిత్వ శాఖ అభిప్రాయపడుతున్నది. అక్కడ మావోయిస్టులకు సిగ్నలింగ్ కేంద్రం, ప్రింటింగ్ ప్రెస్, ఆయుధాల గిడ్డంగి, శిక్షణా పాఠశాలలు ఉన్నాయని, అందుకే దాని దగ్గర పిడియాకు దక్షిణంగా మిన్నప్ప ప్రాంతంలో రాష్ట్ర పోలీసులు ఎప్పుడూ మారుతూ ఉండే ఒక క్యాంపును ఏర్పాటు చేశారని కూడా పోలీసులు చెప్పారు. దోర్నపాల్ నుంచి జాగర్‌గొండ వరకు విస్తరించిన 50 కిలోమీటర్ల దారిలో ఇప్పటికే ఎనిమిది నుంచి పది అర్ధసైనిక బలగాల క్యాంపులను ఏర్పాటు చేశామని, అంతే మోతాదులో పోలీసు క్యాంపులు కూడా ఏర్పాటు చేశామని, ప్రతి క్యాంపులోనూ రెండు వందల నుంచి మూడు వందల దాకా సాయుధ బలగాలు ఉన్నాయని, ఈ దారి మధ్యలోనే మిన్నప్ప ఉందని అధికారులు మీడియాకు చెప్పారు. అంటే సాయుధ అర్ధసైనిక బలగాలు, రాష్ట్ర సాయుధ పోలీసు బలగాలు ఈ యాభై కిలోమీటర్ల దారిలో మోహరించి ఉన్నారు. ఇది చత్తీస్‌గడ్‌కు తూర్పు సరిహద్దున ఉంటుంది. నిష్పాక్షికమైన సైనిక నిపుణుల ప్రకారం ఇది ఇంత తక్కువ స్థలానికి చాలా పెద్ద సైనిక మోహరింపు కింద లెక్క. దీన్ని 'అంతర్గత సంఘర్షణ'గా అంగీకరిస్తే తప్ప ఏ సైనిక నీతి ప్రకారం కూడా ఇది సమర్థనీయం కాదని సైనిక నిపుణులే అంటున్నారు. వీళ్లు కాకుండా మినప్పలో ఒక వెయ్యి మంది పోలీసు బలగాలు ఆ ప్రాంతాన్ని 'జాగరూకంగా' ఉంచడానికి స్థావరం ఏర్పాటు చేసుకున్నారు.

'పూర్తి స్థాయిలో కాకున్నా పిడియా, దాని చుట్టుపట్ల ప్రాంతాల్లో సగాన్ని మించిన స్థాయిలో యుద్ధమే ప్రారంభమైంద'ని స్వయంగా ఒక సీనియర్ పోలీసు ఆఫీసర్ పేర్కొన్నాడు.

అందరికందరు సెమీ ఆటోమెటిక్ ఆయుధాలు భుజాలకు తగిలించుకొని గూడాల రోడ్ల మీద తిరుగుతూ ఉంటే వాళ్లేదో పెట్రోలింగ్ చేసేవాళ్ల లాగా కనిపించరు. వాళ్లందరూ ఒక పూర్తిస్థాయి యుద్ధంలో నిమగ్నమైన సాయుధ బలగాలుగా కనిపించి, సాధారణ ప్రజానీకానికి మృత్యు ఆవరణలోనే జీవించినట్టుగా ఉంటుంది. వేల సంఖ్యలో మోహరించిన సైనిక బలగాలు ఈ మే నెల గ్రీష్మ తాపానికి తట్టుకోలేక ఎవరైనా డీహైడ్రేషన్‌కు గురైతే వెంటనే భారత వైమానిక దళం వాళ్లు వాళ్లను వెనక్కి తీసుకువెళ్లి మళ్లీ బలవంతులను అక్కడ చేరుస్తున్నారు.

మావోయిస్టులు గ్రామ ప్రజల సమీకరణను, సంఘీభావాన్ని దృఢతరం చేసిన కొద్దీ వ్యవసాయోత్పత్తిని తీసుకువెళ్లడానికి వినియోగించే పెద్ద పెద్ద ట్రాక్టర్లను సైనికులను తరలించడానికి భారత వైమానిక దళాలు ఉపయోగిస్తున్నాయి. దక్షిణ బస్తర్‌లో ఇదేదో అకస్మాత్తుగా, అప్పుడప్పుడూ జరుగుతున్న దాడిగా, అందువల్ల జరుగుతున్న మరణాలుగా భావించరాదు. ఇది ముప్పై సంవత్సరాల యుద్ధాన్ని క్రూరంగా ముగించడానికి ఒక తీవ్రమైన ప్రయత్నంగా గ్రామస్థులు భావిస్తున్నారు. ఇది నిజమే.

బీజాపూర్ సరిహద్దు నైరుతి దిశలో పదిహేను కిలోమీటర్లు విస్తరించిన పిడియా మీద ఆధిపత్యాన్ని సంపాదించడానికి, దక్షిణాన ఉన్న మినప్ప మీద జనవరి నుంచి పట్టుకొరకు సైన్యం ఈ ప్రయత్నాలు చేస్తున్నది. జనవరి నెలలో ఇక్కడ చాలా పెద్ద ఎత్తున ఆయుధాల డంప్ దొరికిందని ఆర్.కె. విజ్ చెప్పాడు. పిడియా గ్రామాన్ని రెండు మూడు రోజులు సందర్శించిన బేలా భాటియా ఇక్కడ పోలీసులు పదిహేడు ఇళ్లను, పద్నాలుగు గుడిసెలను తగులబెట్టి, వాళ్ల వస్తు సామాగ్రినంతా తగులబెట్టారని, స్వయంగా పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు కూడా చేసింది. అయితే అప్పుడు ఎవరూ చనిపోలేదు. ఈసారి మాత్రం ఎనిమిది మంది ఎడెస్‌మెట్ట గ్రామస్థులు చనిపోయారు. వీళ్లందరూ సాధారణ

ఆదివాసులని, మీడియాకు వెళుతూ ఉంటే దారిలో సమావేశాన్ని చూసి కాల్పులు జరిపామని పోలీసులే అంగీకరిస్తున్నారు. రాత్రి గ్రామాల మీదుగా పోతున్నప్పుడు గాలింపులలో సాధారణంగా గ్రామస్థులను మినహాయించాలనే నిబంధనలు తమకు ఉన్నాయని కూడా అనధికారంగా అంగీకరిస్తున్నారు.

మే 17వ తేదీ సాయంత్రం బీజుం పాండుమ్ (విత్తనాల పండుగ) జరుపుకోవడానికి అక్కడ సమావేశం అయ్యామని, వర్ష రుతువు రావడానికన్నా ముందు భూమి చదును చేసుకొని వ్యవసాయం సాగు గురించి, విత్తనాల గురించి మాట్లాడుకోవడానికి ప్రతి సంవత్సరం ఈ సంప్రదాయం పాటిస్తామని ఎడెస్‌మెట్ట గ్రామస్థులు మీడియాకు చెప్పారు. చుట్టుముట్టిన సాయుధ బలగాలు అటువంటి సమావేశం మీద నిర్విచక్షణగా కాల్పులు జరిపారని, అందులో చనిపోయిన తొమ్మిది మందిలో ఒకరు ఒక పోలీసుల క్రాస్‌ఫైరింగ్‌లోనే చనిపోయారని చెప్పారు. ఆ తొమ్మిదవ వ్యక్తినే పోలీసులు మావోయిస్టుగా చిత్రీకరించి ఆ మృతదేహాన్ని తీసుకొని వెళ్లారు. కరం మాసా గాని, మరో ముగ్గురు అరెస్టు అయినటువంటి వ్యక్తులు గాని మావోయిస్టులు కాదని గ్రామస్థులు చెప్పారు.

ఎడ్సమెట్ట సంఘటన మొదటిది కాదు. దండకారణ్యంలో ముఖ్యంగా దక్షిణ బస్తర్‌లో వరుసగా జరుగుతున్న మారణకాండల్లో ముఖ్యంగా, విత్తనాలు వేసుకొనే రుతువులో వేల సంఖ్యలో వచ్చి బలగాలు దాడి చేయడం సైనిక వ్యూహంలో ఒక భాగంగా కనిపిస్తున్నది. గత జూన్ 28వ తేదీన సర్కెన్‌గూడలో జరిగిన మారణకాండలో ఇరవై మంది ఆదివాసులు స్త్రీలు, పిల్లలతో సహా ఇటువంటి బీజుం పండుమ్ సమావేశం సందర్భంలోనే అమరులయ్యారు. అప్పటి హోంమంత్రి పి. చిదంబరం మొదట సైనిక బలగాలు 'మావోయిస్టులకు వ్యతిరేకంగా ఇంత పెద్ద విజయవంతమైన దాడి చేసినందుకు' అభినందించాడు. ఎప్పుడైతే అతని అబద్ధాలు బయటపడినాయో ప్రభుత్వం నిరాయుధ ఆదివాసులను చంపామని ఒప్పుకోక తప్పలేదో అప్పుడాయన 'అందులో అమాయకులైన ఆదివాసులు ఉంటే క్షమాపణ చెపుతున్నాన'ని అన్నాడు. రాష్ట్ర ప్రభుత్వం న్యాయ విచారణ వేయక తప్పలేదు. సిఆర్‌పిఎఫ్ కూడా ఆ సంఘటనపై ఒక అంతర్గత విచారణ జరపక తప్పలేదు. కాని ఏడాది కావస్తున్నా అటు న్యాయ విచారణ గానీ, సిఆర్‌పిఎఫ్ అంతర్గత విచారణ గానీ ఇప్పటి దాకా ఏమీ తేల్చలేక పోయాయి.

ఈసారి గంగులూరు పోలీసు స్టేషన్‌ను చుట్టుముట్టి మృతదేహాలను ముందుపెట్టుకొని ఆదివాసులు 18వ తేదీ శనివారం అంతా ఆందోళన చేయడం వల్ల చత్తీస్‌గఢ్ ప్రభుత్వం న్యాయవిచారణకు ఆదేశించి మృతుల కుటుంబాలకు ఎక్స్‌గ్రేషియా ప్రకటించడాన్ని బట్టే ప్రభుత్వం తన నేరాన్ని తాను ఒప్పుకున్నట్లయింది. కేంద్ర ప్రభుత్వం కూడా ఒక్కొక్క మృతుని కుటుంబానికి పదిహేను లక్షల రూపాయల నష్టపరిహారం ప్రకటించింది. ఎండా కాలంలోనే వీలైనన్ని దాడులు చేసి, నీళ్లన్నీ తోడేసి చేపల్ని పట్టాలనే సైనిక వ్యూహాన్ని ఒకవైపు అమలు చేస్తూనే, మరొకవైపు చత్తీస్‌గఢ్ ఎన్నికలు, రానున్న పార్లమెంట్ ఎన్నికలు దృష్టిలో పెట్టుకొని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 'కర్ర, పెండలం' నీతిని కూడా అవలంబిస్తున్నాయి. చత్తీస్‌గఢ్ జైళ్లలో మగ్గుతున్న వేలాది ఆదివాసుల నుంచి కొందరిని విడుదల చేసే ప్రయత్నాలు వేగవంతమయ్యాయని, ఒకవైపు ఆ ప్రయత్నాలలో ఉన్న ప్రజాస్వామిక వాదులను నమ్మిస్తూ, మరొక వైపు ఆదివాసులను ఇట్లా నిర్విచక్షణగా చంపుతున్నారు.

సర్కెన్‌గూడ మారణకాండపై దేశవ్యాప్తంగా ప్రజాస్వామ్య వాదుల నుంచి వచ్చిన స్పందన వంటిది కాకుండా ఎక్కువగా ఆదివాసి సంస్థల నుంచి వచ్చిన స్పందనకు ఆదివాసులు ప్రభుత్వాలకు వ్యతిరేకంగా మారుతారనే బెదురుతో వెంటనే ఇట్లాంటి కంటితుడుపు చర్యలకు పూనుకుంటున్నారు. అయితే, ఇది మళ్లీ సర్కెన్‌గూడ న్యాయవిచారణ చేపట్టిన జస్టిస్ వి.కె. అగ్రవాల్‌కే అప్పగించడంతో అది గత పదకొండు నెలలో ముందుకు సాగకపోగా, దీని ఫలితం ఏమి ఉంటుందో స్పష్టమైంది. ఆయా పోలీసు స్టేషన్ల పరిధిలోని సంఘటనలలోని పోలీసు అధికారులను సస్పెండ్ చేయకుండా న్యాయవిచారణ చేపట్టడం అనేది కాలయాపన, కంటితుడుపు చర్య మాత్రమే అవుతుంది.

మళ్లీ ఎన్నికలు కూడా సమీపిస్తున్న నేపథ్యంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై 2004లో కార్పొరేట్ కంపెనీలతో చేసుకున్న ఒప్పందాలు ఒక దశాబ్దం గడిచినా ఒక అడుగు కూడా ముందుకు వేయని ఒత్తిడి కూడా ఉంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో ఉన్నటువంటి రాజకీయ పార్టీలకు, వాటిల్లో కీలక స్థానాల్లో ఉండే వ్యక్తులకు 2004 నుంచి ఈ కంపెనీలు ఒప్పందాల రూపంలోనూ, బయటా ఇచ్చిన, ఇవ్వజూపుతున్న కోట్లాది రూపాయల డబ్బుకు ప్రతిఫలాన్ని చెల్లించకుండా ఆ కంపెనీలు మళ్లీ వాళ్లకు ఎన్నికల పెట్టుబడులు పెట్టవు. పైగా ఈ ఒప్పందాల విషయంలో బహుళజాతి కంపెనీల నుంచి, బడా కంపెనీల నుంచి, ప్రపంచ బ్యాంక్ నుంచి అన్నిటినీ ఆదేశిస్తున్న అమెరికన్ సామ్రాజ్యవాదం నుంచి ఒత్తిడి తీవ్రతరం అవుతున్నది.

మన్మోహన్‌సింగ్, రమణ్‌సింగ్ పనితనానికి ఇది పరీక్ష. ఇద్దరూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో ఇప్పటికి రెండుమార్లు ఎన్నికయ్యారు. మూడోసారి ఎన్నిక కావాలంటే ప్రజల ఓట్లు సంపాదించుకోవడానికయితే చాలా మార్గాలు ఉన్నాయి కానీ (ఇప్పటికే మన్మోహన్ సింగ్ మళ్లీ ఒకసారి ప్రజల దగ్గరకు వెళ్లాల్సిన అవసరం లేకుండా అస్సాం నుంచి రాజ్యసభకు నామినేషన్ వేసాడు) కార్పొరేట్ కంపెనీల ప్రసన్నత్వాన్ని, సమర్థనను సంపాదించుకోవడానికి మాత్రం ఈ దాడులు తప్పవు. అందువల్లనే గత ఏడాది సర్కెన్‌గూడ అయినా, ప్రస్తుతం ఎడ్సమెట్ట అయినా ఇది పాలకవర్గాలు మధ్య, తూర్పు భారతంలో విప్లవోద్యమంపై ఒక అసహాయ స్థితిలో చేస్తున్న దాడికి నిదర్శనంగానే చూడాల్సి ఉంటుంది.

ముఖ్యంగా, గత మూడు దశాబ్దాలుగా దండకారణ్యంలో ఆదివాసులు నిర్మాణం చేస్తున్న ఉద్యమాన్ని, దానికి నాయకత్వం వహిస్తున్న విప్లవోద్యమాన్ని ఈ దాడి లక్ష్యంగా పెట్టుకున్నాయి. ఆదివాసులు అక్కడ క్రాంతికారీ జనతన సర్కార్ (విప్లవ ప్రజా ప్రభుత్వం)ను ఏర్పాటు చేసుకున్నారు. ప్రజాసైన్యాన్నీ, ప్రజా మిలిషియానూ, కిసాన్ మజ్దూర్ సంఘటననూ, మహిళా సంఘాలనూ, బాల సంఘాలనూ ఏర్పాటు చేసుకున్నారు. సాంస్కృతిక సంఘాలను, ఇతర విప్లవ సంస్థలను ఏర్పాటు చేసుకున్నారు. తమ మీద అణచివేతను అమలు చేస్తున్న అభివృద్ధి నిరోధక, భూస్వామ్య వ్యవస్థలను తొలగదోస్తూ, ప్రజాస్వామ్య సంస్థలను ఏర్పాటు చేసుకుంటున్నారు. ప్రజల ప్రజాస్వామిక సంస్థలను బీజప్రాయంలో ఏర్పాటు చేసుకుంటున్నారు. ఫ్యూడల్ భూస్వాములను,

వడ్డీ వ్యాపారులను, పోలీసు, అటవీ, రెవెన్యూ మొదలైన ప్రభుత్వ యంత్రాంగాలను నిలువరించి ప్రజల అభివృద్ధి నమూనాను రూపొందించుకుంటున్నారు. వీటిలో వారి సృజనాత్మకత, ఉత్పత్తి శక్తుల్లో అభివృద్ధి ఇదివరకెన్నడూ ఆదివాసి సమాజాల గురించి విననంతగా వ్యక్తం అవుతున్నవి. తమ స్వంత ప్రయత్నాలతో, చొరవతో తాము ప్రజాస్వామికంగా పాల్గొంటూ వాళ్లు తమ చెమటా, నెత్తురూ ఓడ్చి తమదైన ఒక స్వావలంబన, స్వపరిపాలన ఏర్పాటు చేసుకుంటున్నారు. అందుకే ఈ దాడిని కేవలం ఒక ఎడ్సమెట్ట ప్రాంతంలో, ఒక గంగులూరు పోలీసు స్టేషన్ పరిధిలో జరిగిన మారణకాండగా కాకుండా ఒక ప్రజల అభివృద్ధి నమూనాపై, దానిని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు అత్యంత ప్రమాదకరమైన ప్రతిఘటనగా భావిస్తున్న దళారీ పాలకవర్గాల దాడిగా అర్థం చేసుకోవాల్సి ఉంటుంది.

ఈ దాడిని సోనియా, మన్మోహన్, చిదంబరం, షిండే, మాంటెక్ సింగ్ రాజకీయ, ఆర్థిక, సైనిక నీతిగా, జయరాం రమేష్, రమణ్‌సింగ్‌ల కుట్రపూరిత 'సురాజ్య' ఆచరణగా, మైనింగ్ కార్పొరేట్ శక్తుల విస్తరణ కాంక్షగా చూడాల్సి ఉంటుంది. మోన్‌శాంటో నాగరికత ఆదివాసుల విత్తనాల పండుగపై కోబ్రా కోరలు సాచి చావు విందు చేసుకున్న విధానంగా చూడాల్సి ఉంటుంది. ప్రజలు చదును చేసుకుంటున్న లక్షలాది ఎకరాల భూమిని వ్యవసాయ యోగ్యంగా చేసి, గనుల తవ్వకాలకు, భారీ ప్రాజెక్టుల నిర్మాణానికి కార్పొరేట్ శక్తులకు అప్పగించడానికే ఈ పోలీసు క్యాంపులు, గాలింపు చర్యలు, సైనిక మోహరింపులు, మానవ రహిత విమానాల ఆకాశ అన్వేషణలు, గృహదహనాలు, లైంగిక అత్యాచారాలు, బూటకపు ఎన్‌కౌంటర్లు. ఈ ఎండాకాలం దక్షిణ బస్తర్ మూడు వైపుల నుంచి నారాయణ్‌పూర్ (చత్తీస్‌గడ్), గడ్చిరోలీ (మహారాష్ట్ర), భద్రాచలం, చర్ల (ఆంధ్రప్రదేశ్)ల మీదుగా వేల సంఖ్యలో యూనిఫైడ్ కమాండ్ ఫోర్సు పేరుతో సిఆర్‌పిఎఫ్, కోబ్రా, గ్రేహౌండ్స్, కోయ కమాండోలు అడవి లోతట్టు ప్రాంతాల్లో కూడా ప్రవేశించి క్యాంపులు పెట్టుకొని, అడవిని జల్లెడ పట్టినట్టు గాలింపు చర్యలను చేయడం ఆదివాసులను విస్థాపన చేయడానికే. అడ్డు తొలగించుకోవడానికే. సర్కెన్‌గూడ మారణకాండపై స్పందించినట్టుగానే దేశంలోని ప్రజాస్వామిక శక్తులు, వ్యక్తులు, విప్లవ సంస్థలు, దేశభక్తులు, రాజకీయ పార్టీలు కదిలి ఎడ్సమెట్ట (గంగులూరు) మారణకాండను ఖండించాలి. తూర్పు, మధ్య భారతాలపై గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను వెంటనే ఆపుచేసి, అర్ధసైనిక బలగాలను వెనక్కి పిలవాలి. మాడ్ ప్రాంతంలో మోహరించిన సైన్యాన్ని ఉపసంహరించుకోవాలి. సైన్యం కోసం కేటాయించిన వందలాది ఎకరాల భూమిని ఆదివాసి ప్రజల వ్యవసాయ, నివాస అవసరాలకు తిరిగి ఇవ్వాలి. పోలీసు క్యాంపులు ఎత్తివేయాలి. గాలింపు చర్యలు నిలిపివేయాలి. బూటకపు ఎన్‌కౌంటర్లు నిలిపివేయాలి.

దండకారణ్యంలో జనతన సర్కార్ అమలు చేస్తున్న ప్రజా అభివృద్ధి నమూనా ప్రయోగాన్ని దేశంలోని బుద్ధిజీవులు, మేధావులు, ప్రజాస్వామ్యవాదులు, మీడియా స్వయంగా చూసి, మాట్లాడి, తెలుసుకొని, చర్చించే ఒక పారదర్శక వాతావరణం ఏర్పడడానికి ప్రజాస్వామ్యవాదులంతా కృషి చేయాలి.

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం నాయకులు)* వీ

## వీక్షణం రచయితలకు సూచనలు

పది సంవత్సరాలలో, నూట నలభైకి పైగా సంచికలలో వీక్షణం రెండు వేలకు పైన వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతిలోనూ, సుబోధకతలోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

- రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (నాలుగు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పేజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు-నాలుగు పేజీల రచన (1800 - 2500 పదాలు) వీక్షణంకు సరిగ్గా సరిపోతుంది.
- చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్‌లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్‌లో గాని, పేజ్‌మేకర్‌లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది.
- రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి.
- రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి.
- వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు-మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు.
- మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణం కు పంపగూడదు.
- దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు.
- రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి.

# రాజ్యాంగ వ్యతిరేక, అరాచక రాజ్యం

***చత్తీస్‌గడ్‌లో ఆదివాసులను భయోత్పాతానికి గురిచేసి, మావోయిస్టుల నుంచి దూరం చేయడానికి, విలువైన ఖనిజ వనరులను కార్పొరేట్లకు అప్పగించడానికి మహేంద్ర కర్మ నాయకత్వంలో సాగిన సాల్వాజుడుం అత్యాచారాలపై సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ బి. సుదర్శన్‌రెడ్డి, సురిందర్ సింగ్ నిజ్జర్ 2011 జూలై 5న ఇచ్చిన తీర్పు నుంచి భాగాలు.***

చత్తీస్‌గడ్‌లో వాస్తవాలు ఒకటొకటీ మా ముందుకు వస్తుంటే, సర్కార్ తన పనులను సమర్థించుకుంటూ వాదిస్తూ ఉంటే, రాజ్యాంగ విలువలను కాలరాస్తున్నారన్న విషయం మరింత స్పష్టమవుతూ వచ్చింది. ఈ పరిణామాలు ప్రమాదకరమైనవి. అన్ని వర్గాలలో వ్యక్తి గౌరవాన్ని రక్షించే హామీని, జాతీయ ప్రయోజనాలను, చివరకు జాతి ఐక్యతకు, సమగ్రతకు కూడా ముప్పు తెచ్చే సంగతులివి. అడ్డూ అదుపూలేని అధికారం, విచక్షణ లేని అధికార వినియోగం, అదే ఒక సూత్రమై, విధానమై చెలరేగిపోవడం ఫలితంగా అన్ని వర్గాల ప్రజల అమానవీకరణ, సహజ వనరులను ఇష్టం వచ్చినట్లు దోచుకోవడానికి నేల తవ్వుకునే సామ్రాజ్యవాద శక్తుల తీరని దాహం, రెండు ప్రపంచ యుద్ధాల దారుణ జ్ఞాపకాల నేపథ్యంలో ఈ ఆధునిక సంవిధాన పాలనా రీతులు రూపుదిద్దుకున్నాయి. అందులో ఒక విధానమే – ఎవరిపైనా రాజ్యం హింసకు పాల్పడకూడదనే మౌలిక సూత్రం. శత్రువైనా, సొంత దేశీయుడైన పౌరుడిపైన కూడా రాజ్య హింస చెల్లదు. ప్రతి వ్యక్తిలోనూ అంతర్లీన మానవ గౌరవ సూత్రానికి అది వ్యతిరేకం.

ఇంకా చత్తీస్‌గడ్ దారుణాలు స్పష్టమైన రూపు దాల్చకముందే మనుషుల్ని రాజ్యాంగ పరమైన నిర్ణయం తీసుకునే వైపు నడుపుతూ చివరకు 'అమ్మో దారుణం – దారుణం' అని గుండెలు బాదుకుంటూ ఆశ్చర్యపోయే దశకు చేరుస్తున్నాయి.

బలీయమైన రాజ్యానికి వ్యతిరేకంగా జనం ఊరికే ఆయుధాలు ఎత్తడం, నిష్కారణంగా సాటి మనుషులను చంపడం కూడా అంత సులువుగా తీసుకునే నిర్ణయం కాదు. అందరం కలిసి బతకడం కోసం, చుట్టూ ఉన్న అరాచకం, భయం తొలగించుకోవడానికి ఒక వ్యవస్థ ఏర్పాటు చేసుకుంటామని థామస్ హాబ్స్ సూత్రీకరించారు. కాని ఆ వ్యవస్థ అమానుషంగా, పేదలను, బలహీనులను కాలరాస్తూ దారుణాలకు పాల్పడుతూ ఉంటే జనం తిరగబడతారు.

◆ ◆ ◆

చత్తీస్‌గడ్‌లోని విస్తారమైన అటవీ ప్రాంతాలు మావోయిస్టుల ప్రభావానికి లోనై ఉన్న విషయం తెలిసిందే. ఒకవైపు మావోయిస్టుల హింస, మరోవైపు రాజ్యం సాగిస్తున్న హింస మధ్య ఆ అటవీ ప్రాంతాలలో జనం నలిగిపోతున్న సంగతులు చాలాసార్లు పత్రికల్లో వచ్చినవే. చత్తీస్‌గడ్‌లో పరిస్థితులు తీవ్రమైన నిరాశకు గురిచేస్తున్నాయి. ఉక్కు పాదంతో అణచివేయడం తప్ప తమకు మరో మార్గం లేదని చత్తీస్‌గడ్ ప్రభుత్వం పదే పదే విన్నవించడం, మమ్మల్ని రెండింతలు ఆశ్చర్య పరుస్తున్నది. న్యాయం కోరిన ప్రతివాడినీ, సాక్ష్యాలు అడిగిన ప్రతివాడినీ మావోయిస్టని అనుమానించడం, శాంతి భద్రతల పేరుతో ప్రతి పౌరుడినీ నేరస్తుడిగా చూడడం, వారిని అణచివేయడమే గత్యంతరం అని రాజ్యం చెప్పడం ఆశ్చర్యకరం. రాజ్యం దృష్టిలో ప్రముఖ చారిత్రకవేత్త రామచంద్ర గుహ, ప్రసిద్ధ విద్యావేత్త నందినీ సుందర్, పౌర ఉద్యమ నేత స్వామి అగ్నివేశ్, మంచి పేరున్న మాజీ అధికారి ఇఎఎస్ శర్మ కూడా మావోయిస్టులే అనుకోవాల్సి వస్తుంది.

రాష్ట్రమంతటా విస్తరించిన ఈ అమానుష దారుణాలను ప్రశ్నించిన ప్రతి వ్యక్తినీ తప్పనిసరిగా మావోయిస్టు అని లేదా వారి సానుభూతి పరుడని భావించాలనుకునే చత్తీస్‌గడ్ రాజ్య సంకుచిత రాజ్యాంగ పరిధి అంధత్వాన్ని చూసి మేం దిగ్భ్రాంతులము అవుతున్నామని చెప్పి తీరాలి. ఈ విధంగా వ్యవహరిస్తూనే ఆ దారుణాలను కొనసాగించడానికి రాజ్యాంగపరమైన అనుమతిని మన సంవిధానం కోసం కోరడం, తద్వారా 'సంవిధాన నిబద్ధమైన వ్యవస్థ'ను నెలకొల్పడం కోసం చత్తీస్‌గడ్ ప్రజల మీద అమానుష హింసాకాండ సాగించే విధానాన్ని కొనసాగించాలను కోవడం కూడా చాలా ఆశ్చర్యకరమైన అంశాలే.

◆ ◆ ◆

చత్తీస్‌గడ్‌లో సమస్య ప్రజలు కాదు. ప్రజల హక్కులను ఒకవైపు మావోయిస్టులు లేదా నక్సలైట్లు, మరోవైపు రాజ్యం, రాజ్యం ప్రతినిధులు ఒక పద్ధతి ప్రకారం, విస్తృత రీతిలో భంగపరుస్తున్నారని మాకు స్పష్టం. మాతోపాటు సమానంగా ఆలోచించే ప్రతివారికీ అది కనిపిస్తున్న సత్యం. అర్థవంతంగా ఆలోచించి, ఈ పరిస్థితుల్ని ప్రశ్నించే సమంజసమైన వ్యక్తులతో కూడా సమస్య లేదు. సమస్య అంతా ఈ రాజ్యం అనుసరిస్తున్న అనైతిక రాజకీయ ఆర్థిక విధానంలో ఉంది. అందువల్ల తప్పనిసరిగా కలిగే విప్లవాత్మక రాజకీయాల పరిణామాలలోనూ ఉంది.

◆ ◆ ◆

రాజ్యాంగ వివేచన ప్రతిఫలించే ఈ సలహాలను పాటించే బదులు – మనం ఈ కోర్టు వివాదంలో చూస్తున్నదేమంటే.. రాజ్యాధికార వ్యూహాలు అధికార కండబలం వినియోగాలు తప్పనిసరి అనే పదే పదే ప్రకటిస్తుండటాన్ని. దంతేవాడలో, చత్తీస్‌గడ్‌లోని ఇతర పరిసర జిల్లాల్లో పరిస్థితులను ఎదుర్కోవడానికి ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలను తెలియజేస్తున్నారేగాని, మావోయిస్టు / నక్సలైట్ హింసకు ప్రతిగా సాగిస్తున్న అరాచక రాజ్య హింసాకాండ సమస్య తీరలేదని, తీరబోదని, పైగా మరింత హింసను పెచ్చరిల్లజేస్తుందని, తీవ్ర హింస – తీవ్ర ప్రతి హింస పునరావృత్తమవుతూనే ఉంటాయనే వాస్తవాన్ని ప్రభుత్వం చూడడం లేదు. చత్తీస్‌గడ్ ప్రభుత్వం వివరించిన మరణాల గణాంకాలే

ఈ వాస్తవాన్ని రుజువు చేస్తున్నాయి. ఒక దశాబ్దం నుంచి పదే పదే జరుగుతున్న ఈ హింస – ప్రతి హింస మామూలు మనిషిని కూడా నిపుణుల సంఘం చెప్పిన మాట వాస్తవమేనని అంగీకరింపజేస్తుంది.

◆ ◆ ◆

సమస్యకు మూలకారణం మరోచోట ఉంది. పరిష్కారం కూడా అక్కడే. భారతదేశమంతటా, ముఖ్యంగా చత్తీస్‌గఢ్‌లో ఆర్థికంగా, రాజకీయంగా అస్థిరమైన పరిస్థితులు ఏర్పడడానికి కారణాలు అడ్డూ అదుపూ లేని స్వార్థం సంస్కృతి, ఆధునిక నయా ఉదార ఆర్థిక వాదం రెచ్చగొట్టిన అంతులేని దురాశ, 'వినియోగం' విపరీతంగా పెంచడం కోసం వస్తున్న తప్పుడు వాగ్దానాలు.

◆ ◆ ◆

ఇవన్నీ చాలవన్నట్టు, ప్రభుత్వం మరొక ప్రమాదకర విధానాన్ని అనుసరించడం ఆరంభించింది. రాజ్యాంగ విలువలకు వివేకానికి తిలోదకాలిస్తూ ఈ కటిక చీకటిలోంచి ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. పేదలకు సంక్షేమ పథకాలు అమలుచేయకపోవడానికి నిధుల కొరత సాకు చూపి తన విధులు నిర్వహించని ప్రభుత్వం ప్రైవేట్ రంగానికి మాత్రం పన్నుల నుంచి మినహాయింపుల మీద మినహాయింపులు ఇస్తూనే ఉంది. పేదలలో యువకుల చేతికి ఆకలి మీద, అలజడి మీద పోరాడడానికి తుపాకులు ఇస్తున్నది. సంపన్నులకు పన్నుల మినహాయింపులు, నిరుపేద యువకులకు తమలో తాము కొట్టుకోవడానికి తుపాకులు ఇవ్వడం ప్రభుత్వం 'భద్రత కోసం, ఉన్నత ఆర్థిక విధానం కోసం' అని వల్లెవేసే కొత్త మంత్రం వలె కనిపిస్తున్నది. ప్రజాస్వామిక, సార్వభౌమ, మతాతీత సమవాద రాజ్యం అనుకున్న జాతి అభివృద్ధి కోసం దర్శించిన మహాదృశ్యం ఇదే అయి ఉండవచ్చు! పౌరులందరి గౌరవాన్ని రక్షించాలన్న ప్రభుత్వ విద్యుక్త ధర్మం అమలు చేయడం కోసం విధాన నిర్ణేతలు రాజ్యాంగ విలువలను, లక్ష్యాలను, పరిమితులను అనుసరిస్తున్నారా లేదా అనే సందేహాలు అనివార్యంగా తలెత్తుతున్నాయి.

సమాజం అంటే అడవి కాదు. అడవిలో అనుకోకుండా చెలరేగిన అగ్ని ప్రమాదాన్ని మరోవైపు అగ్ని రగిలించడం ద్వారా నియంత్రించవచ్చు అనుకుంటారు. మనుషులంటే ఎండిన గడ్డి పోచలు కాదు. జవజీవాలున్న పౌరులు, స్వచ్ఛందంగా వ్యవహరించే వ్యక్తులు. వారికి ఆ విధంగా ఆయుధాలు ఇస్తూ, ఇదివరకు ఎన్నోసార్లు జరిగినట్లు తోటి పౌరుల మీద ఎక్కుబెడతారు. ప్రభుత్వం మీద కూడా తిరగబడవచ్చు. రాజ్యం అండదండలతో పోషణ ప్రోత్సాహాలతో పనిచేసే సాయుధ దళాల ప్రమాదకరమైన పరిణామాలు ఎన్నో చరిత్ర నిండా కనిపిస్తాయి.

◆ ◆ ◆

విధాన నిర్ణేతలు ఎంత బలంగా సమర్థించుకున్నప్పటికీ ఈ దారితప్పిన విధానాలు తప్పనిసరిగా రాజ్యాంగ లక్ష్యాలకు వ్యతిరేకం. ప్రజలు రాజ్యానికి హస్తగతం చేసిన అధికారాన్ని ధనిక పేద తేడా లేకుండా అందరి సంక్షేమానికి వినియోగించాలనీ, అన్ని వర్గాల ప్రజల మధ్య సమ సోదరభావానికి అనుగుణంగా అందరికీ సమాన జీవన గౌరవ ప్రతిపత్తులు కల్పించాలన్న రాజ్యాంగ లక్ష్యానికి ఈ విధానం పూర్తి విరుద్ధం. సమత ఇచ్చే 14వ అధికరణం కానీ, జీవనం ఇచ్చే 21వ అధికరణం కానీ ఏ హక్కుల కోణం నుంచి చూసినా ఈ విధానాలకు సానుకూలం అనడానికి వీలేలేదు. ఈ విధానాలు ఆ అధికరణాలను మౌలికంగా భగ్నం చేస్తున్నాయి. మన జనాభాలో దోపిడీకి బలైన అభాగ్య వర్గాలలోని యువతరానికి పుస్తకాలు ఇచ్చే బదులు తుపాకులిచ్చి అమానవీయం చేసే ప్రమాదకర వాతావరణం కల్పిస్తున్నారు. జాతి విధ్వంసానికి దారులు నిర్మించే అడవుల సంపద దోచుకునే వారికి ఈ యువకులను కాపలా కాయాలంటున్నారు. ఈ న్యాయస్థానం తప్పనిసరిగా జోక్యం చేసుకుని చత్తీస్‌గఢ్ సైనికుల ఆక్రమణలో ఉన్న పాఠశాలలు, వసతి గృహాల నుంచి భద్రతా దళాలను ఖాళీ చేయించాలని ప్రభుత్వాన్ని ఆదేశించవలసి వచ్చింది. ఇటువంటి ఆదేశాల తరువాత కూడా సాయుధ దళాల ఆక్రమణలోనే అనేక పాఠశాలలు, హాస్టళ్లు కొనసాగుతున్నాయి. అంత దారుణంగా సమాజం మానవ జీవితం దిగజారిపోయింది. పరిస్థితులే స్వయంగా ఈ సంగతులు వివరిస్తున్నాయి.

◆ ◆ ◆

ఈ పిటిషన్ విచారణలో మా ముందుకు అనేక అంశాలు వచ్చాయి. ఎన్‌హెచ్‌ఆర్‌సి కనుగొన్న కొన్ని అంశాలు, కాదన్న అంశాలు ఉన్నాయి. మూడు అంశాలకు సంబంధించిన ప్రత్యేకాంశం ఇక్కడ ప్రస్తావిస్తున్నాం. 1) విద్యార్థుల చదువుల కార్యక్రమం సాగడానికి వీల్లేకుండా చేసే విధంగా చత్తీస్‌గఢ్‌లో అనేక జిల్లాలలో పాఠశాలలు, వసతి గృహాలను విభిన్న భద్రతా దళాలు ఆక్రమించుకున్నాయి. 2) ప్రత్యేక పోలీసు అధికారులు (ఎస్‌పిఒ) 'కోయ కమాండో'లను నియమించిన విధానం, వారికి ఇచ్చిన శిక్షణ, మారణాయుధాలు అప్పగించడం, పోలీసు అధికారుల హోదా ఇవ్వడం, వారు అనేక మానవ హక్కుల ఉల్లంఘన చేస్తారన్న ఆరోపణల విచారణ, 3) స్వామి అగ్నివేశ్ మరికొన్ని ఆరోపణలు చేశారు. మోర్పల్లి, తాడిమెట్ల, తిమ్మాపురం గ్రామాలలో మూడు వందల ఇళ్లు తగుల బెట్టారనీ, మహిళలను మానభంగం చేశారనీ, ముగ్గురు మగవారిని చంపారని అన్నారు. ఆ గ్రామాలలో పర్యటించి, అవసరమైన వారికి సహాయం అందించి, అక్కడ జరిగిన సంఘటనల్లో నిజానిజాలు తెలుసుకోవడం కోసం అక్కడికెళ్లిన స్వామి అగ్నివేశ్, ఇతర పౌర సంఘం సభ్యులపైన రెండు వేర్వేరు సంఘటనలో 'సల్వాజుడుం' దళ సభ్యులు దాడి చేశారు. చత్తీస్‌గఢ్ హోంమంత్రి వారికి భద్రత కల్పిస్తామని హామీ ఇచ్చినా, చుట్టూ భద్రతా దళాలున్నా సల్వాజుడుం దళాలు వారిపై దాడి చేయడానికి అనుమతించారు. ఇక్కడ సామాజిక సంఘర్షణను శాంతియుతంగా పరిష్కరించడానికి చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్న స్వామి అగ్నివేశ్ ఒక సాంఘిక కార్యకర్త. చత్తీస్‌గఢ్ పోలీసులను నక్సలైట్లు అపహరిస్తే ఆ పోలీసులను విడిపించడానికి స్వామి అగ్నివేశ్ కృషి చేశారు. ఈ మాట స్వయంగా చత్తీస్‌గఢ్ ముఖ్యమంత్రి అంగీకరించారు.

◆ ◆ ◆

పాఠశాలలను, వసతి గృహాలను భద్రతా దళాలు ఆక్రమించు కున్నాయన్న ఆరోపణను చత్తీస్‌గఢ్ ప్రభుత్వం స్పష్టంగా ఖండించింది. ఏ పాఠశాలా, ఆస్పత్రీ, అంగన్‌వాడీ, భద్రతా దళాలు స్వాధీనంలో లేవని, నిజానికి ఆ భవనాలన్నీ ఖాళీ చేశారని ప్రభుత్వం వివరించింది. కాని విచారణ జరిపినపుడు, అంతకు ముందు ప్రమాణ పత్రంలో పేర్కొన్న అంశాలకు భిన్నంగా పెద్ద ఎత్తున ఎన్నో పాఠశాలలు భద్రతా దళాల ఆధీనంలో ఉన్నాయని తేలింది. ఈ న్యాయస్థానం ఆదేశాల వల్ల, జోక్యం చేసుకోవడం వల్ల, చత్తీస్‌గఢ్ ప్రభుత్వం పాఠశాలల నుంచి, వసతి గృహాల నుంచి సాయుధ దళాలను ఖాళీ చేయించడం ప్రారంభించింది. నిజానికి ఈ ఖాళీ చేసే కార్యక్రమం ఇంకా కొనసాగుతున్నది. ఈ విషయంలో చత్తీస్‌గఢ్ ప్రభుత్వం వ్యవహరించిన తీరుపై మాకు కొన్ని అభ్యంతరాలున్నాయి. ఎందుకంటే ప్రభుత్వం ఇదివరకు కోర్టులో పత్రం ద్వారా ఏ పాఠశాలలు, హాస్టళ్లు కూడా భద్రతా

దళాల ఆక్రమణలో లేవని చెప్పిన విషయం నమ్మి – ఇతర అంశాలపై ఎన్‌హెచ్‌ఆర్‌సి సిఫార్సుల ఆధారంగా ఉత్తర్వులు జారీ చేశాం. కాని ప్రజలకు ఎంతో అవసరమైన మౌలిక వనరులను ఈ విధంగా అందుబాటులో లేకుండా చేయడంపై దృష్టి పెట్టలేదు. ఆ తరువాత చత్తీస్‌గడ్ ప్రభుత్వం విడిగా మరొక ప్రమాణ పత్రం సమర్పించి కోర్టు ఉత్తర్వుల అమలుకు మరికొంత గడువు కావాలని కోరింది. ఎందుకంటే అనేక పాఠశాలల్లో భద్రతాదళాలు ఇంకా తమ శిబిరాలు నడుపుతూనే ఉన్నాయి.

◆ ◆ ◆

వేలాది మంది యువకులకు ఇచ్చిన తుపాకులు ఇతర ఆయుధాలను ఏ విధంగా వెనక్కి తీసుకుంటారో స్పష్టంగా చెప్పాలని మేము రాష్ట్ర ప్రభుత్వాన్ని, కేంద్రాన్ని పదే పదే అడిగాం. ఇప్పటివరకు దానికి జవాబు ఇవ్వలేదు. ఎస్‌పిఒల ఉద్యోగం ముగిసిన తరువాత వారి భౌతిక భద్రతకు ఏవిధమైన చర్యలు తీసుకుంటారో చెప్పకుండా వారి మనుగడ ప్రశ్నకు జవాబు ఇవ్వకుండా ఆయుధాలు తిరిగి ఇవ్వాలని ఒత్తిడి చేస్తే అందుకు కోయ యువకులు నిరాకరించే అవకాశం ఉంది. అదే జరిగితే ఆయుధాలున్న వేలాది యువకులు తమ బతుకులకు ప్రమాదం ఉందనే భయంతో సాగిపోవడం జరుగుతుంది. వారు చట్టాలను ఉల్లంఘించే అవకాశం కూడా ఉంది. వారు రాజ్యానికి ఎదురుతిరగడానికి లేక భద్రతా దళాలనుంచి రక్షించుకోవడానికి ఆ ఆయుధాలను ఉపయోగించే అవకాశం ఉంది. వారు తమ జీవనోపాధికి, పొట్ట గడవడానికి ఆయుధాలు చేతబట్టిన ప్రమాదకర బృందాలుగా మారి ప్రజలను భయపెడుతూ మూడో బలీయమైన వర్గంగా మారవచ్చు.

ఎందరో మానవ హక్కుల ఉద్యమకారులు, పౌర సమాజ వర్గాలు ఎన్నో సందర్భాలలో కోయ కమాండోలు, సల్వాజుడుం అని పిలవబడే ఎస్‌పిఒలను నియమించిన తరువాత దాఖలు చేసిన ఫిర్యాదులు పరిశీలించిన మానవ హక్కుల కమిషన్ కూడా దోపిడీ, హింసాత్మక దాడుల వంటి అనేక సంఘటనలకు ఈ ఎస్‌పిఒలు, భద్రతా దళాలు కారణమని నివేదికలో వివరించింది. దీనికి కారణం ఈ ఎస్‌పిఒలపైన ఎవరికీ నియంత్రణ లేకపోవడమే అనీ, వాస్తవానికి ఎస్‌పిఒల కార్యకలాపాలపై నియంత్రణ చేయగల సామర్థ్యంగానీ నైతిక బలంగానీ ఎవరికి లేకపోవడమే అని అనుమానించక తప్పడం లేదు. సరిగ్గా అక్షరాస్యులు కూడా కాని గిరిజన యువకులను తాత్కాలిక ఎస్‌పిఒలుగా నియమించి మారణాయుధాలు ఇవ్వడం సమాజంలో ఇతర వ్యక్తుల మానవహక్కులను ప్రమాదంలో పడవేసింది. పడవేస్తోంది.

పైన వివరించిన పరిస్థితుల దృష్ట్యా, తక్కువ చదువులున్న గిరిజన యువకులను ఎస్‌పిఒలుగా నియమించడం, తిరుగుబాటు వ్యతిరేక కార్యక్రమాలలో వారికి పాత్ర కల్పించడం ద్వారా భారత రాజ్యాంగం ఆర్టికల్ 21, ఆర్టికల్ 14 భంగపడినాయనీ, ఇంకా భంగపడుతూనే ఉంటాయనీ మేం నిర్ధారిస్తున్నాం.

◆ ◆ ◆

*ఛత్తీస్‌గఢ్‌లో మావోయిస్ట్ లేదా నక్సలైట్ కార్యకలాపాలను నిర్మూలించేందుకు లేదా తగ్గించేందుకు, లేదా ప్రతిఘటించేందుకు లేదా నియంత్రించేందుకు ఉద్దేశించిన చర్యలలో ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా ఏ విధంగానైనా, ఈ రూపంలోనైనా ఎస్‌పిఒలను వినియోగించడాన్ని ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం వెంటనే నిలిపివేయాలి.*

*మావోయిస్ట్ లేదా నక్సలైట్ వర్గాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు వ్యతిరేక చర్యల పేరుతో ఏ రూపంలోనైనా వినియోగించేందుకు ఎస్‌పిఒలను ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా నియమించేందుకు సహాయం చేయడానికి తమ నిధులను వెచ్చించడాన్ని కేంద్ర ప్రభుత్వం వెంటనే నిలిపివేయాలి.*

ఎస్‌పిఒలకు ప్రస్తుతం, ఇదివరకు ఇచ్చిన మారణాయుధాలను వాటితోపాటు, వాటిని వినియోగించడానికి ఇచ్చిన అన్ని అనుబంధ మందుగుండు సామగ్రి, పరికరాలను తిరిగి తీసుకోవడానికి ఛత్తీస్‌గఢ్ రాజ్యం వెంటనే అన్ని చర్యలు ప్రారంభించాలి.

మావోయిస్ట్ లేదా నక్సలైట్లకే పరిమితం కాకుండా, వారితో కూడిన అన్ని రకాల దళాలు బలగాల ముప్పు నుంచి ఇదివరకు ఎస్‌పిఒలుగా నియమితులైన వారికి, ఇదివరకు ఎంపిక చేసిన, తొలి ఉత్తర్వులు ఇచ్చిన వారికి కూడా రాజ్యాంగం సమ్మతించే రీతిలో తగిన విధంగా ప్రాణరక్షణ కల్పించేందుకు ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం వెంటనే ఏర్పాట్లు చేయాలి. కోయ కమాండోల దళాలు, వారికే పరిమితం కాకుండా, వారితో కూడా అనేక బృందాల కార్యకలాపాలను నిలిపివేయడానికి ఛత్తీస్‌గఢ్ రాజ్యం తగిన చర్యలు తీసుకోవాలి. సల్వాజుడుం లేదా కోయ కమాండోలు ఇదివరకు పాల్పడినట్టు ఆరోపణలు వచ్చిన అనేక నేర చర్యలను, ఇదివరకు అన్యాయంగా అసంపూర్ణంగా వదిలేసిన నేర సంఘటనలను, వీటికే పరిమితం కాకుండా ఇతర ఆరోపణలను దర్యాప్తు జరిపించి. ఓ్పట్లు దాఖలు చేయించి వారి ప్రాసిక్యూషన్‌కు ఛత్తీస్‌గఢ్ రాజ్యం అన్ని ఏర్పాట్లు చేయాలి.

వీ

# కూడంకుళం - సుప్రీంకోర్టు తీర్పు

*స్థానిక ప్రజల నిరసనలను అర్థం చేసుకోకుండా అణు విద్యుత్ కేంద్రాన్ని సమర్థించిన సుప్రీంకోర్టు తీర్పు తీరును విశ్లేషిస్తున్నారు* **పి. వరలక్ష్మి**

**కూ**డంకుళం అణువిద్యుత్ కేంద్రం వల్ల ప్రజల ప్రాణాలకు, పర్యావరణానికి ముప్పు ఉందని పూవులగిన్ నన్‌బర్గళ్ (భూమి మిత్రులు) వేసిన పిటిషన్‌పై విచారణ జరిపిన సుప్రీంకోర్టు అందులో లేవనెత్తిన అంశాలను పరిగణలోకి తీసుకుంటూనే విశాల భారతదేశ ప్రజల ప్రయోజనాలు, అభివృద్ధి దృష్ట్యా అణువిద్యుత్ కేంద్రానికి ఆమోదం తెలుపుతున్నట్లు ప్రకటించింది. ఫుకుషిమా ప్రమాదం తర్వాత అణుశక్తి మీద ప్రపంచవ్యాప్తంగా చర్చ జరుగుతూ జపాన్, జర్మనీ, ఇటలీ వంటి ఎన్నో దేశాలు అణువిద్యుత్ కేంద్రాలను మూసివేసే నిర్ణయాలు తీసుకుంటున్నప్పుడు, భారతదేశం అందుకు విరుద్ధంగా సామ్రాజ్యవాద దేశాలతో చేసుకున్న అణుఒప్పందాలను దూకుడుగా అమలుచేస్తూ పోతున్న సమయంలో ఈ తీర్పు వెలువడింది. భారతదేశంలో అణు రాజకీయాలను చర్చకు పెట్టిన కూడంకుళం ప్రజాపోరాటం నేపథ్యంలో వచ్చిన ఈ తీర్పు సహజంగానే చర్చనీయాంశమైంది. పాతిక సంవత్సరాల తమిళనాడు అణుశక్తి వ్యతిరేక ఉద్యమం ఈ తీర్పు ప్రజావ్యతిరేకమైనదని ప్రకటించి ఆందోళన కొనసాగిస్తామని తేల్చి చెప్పింది.

అత్యంత 'ప్రజాస్వామ్య' బద్ధంగా, శాంతియుతంగా కొనసాగిన కూడంకుళం ఉద్యమం కోర్టులతో సహా అన్ని రాజ్యాంగ వ్యవస్థలను పరీక్షించింది. ఈ వ్యవస్థ మమ్మల్ని అర్థం చేసుకోలేదు అని కూడంకుళం తీర ప్రాంత మత్స్యకారుల సంఘం నాయకుడు ఒక మీడియా ఇంటర్వ్యూలో చేసిన వ్యాఖ్య అడుగడుగునా రుజువవుతున్నది. మండల స్థాయి నుండి జాతీయ స్థాయి వరకు అన్ని ప్రభుత్వ కార్యాలయాలకు చేసిన విజ్ఞప్తులు బుట్టదాఖలయ్యాయి. నెలల తరబడి చేసిన దీక్షలు, సత్యాగ్రహాలు ప్రభుత్వాలను కదిలించలేదు. సంవత్సరాల తరబడి చేసిన ఆందోళలను పట్టించుకున్న ప్రభుత్వాలే లేవు. ఒకవేళ కోర్టుకు పోతే ఏమైనా న్యాయం జరుగుతుందేమోనని కోర్టులనూ ఆశ్రయించారు. విద్యుదుత్పత్తి చేసే రియాక్టర్ల భద్రత కోసం అణుశక్తి నియంత్రణ బోర్డు సిఫారసు చేసిన 17 సిఫారసులను అమలు చేసిన తర్వాత కాని వాటిలో ఇంధనం నింపకూడదని, అప్పటిదాకా స్టే విధించాలని దాఖలైన పిటిషన్‌ను 2012 ఆగస్టులో మద్రాసు హైకోర్టు కొట్టివేసి ఇంధనం నింపడానికి పచ్చజెండా ఊపింది.

హైకోర్టు తీర్పు అన్యాయమని రియాక్టర్లలో యురేనియం నింపకుండా మేము అడ్డుకుంటామని ఆందోళనకారులు ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. హైకోర్టు తీర్పుతో మరింత ఉత్సాహంగా ప్రభుత్వం అణచివేత చర్యలకు దిగింది. అణువిద్యుత్తుకు వ్యతిరేకంగా ఏ చిన్న నిరసన తలెత్తినా ఉక్కుపాదం మోపింది. సెప్టెంబరు 10న సముద్రపు ఒడ్డున నిరసన తెలుపున్న రెండు వేల మంది జనంపై రాత్రికి రాత్రి ఇసుక నేలపైన రోడ్డు వేసుకొని మరీ తరలివచ్చిన పోలీసులు విరుచుకుపడ్డారు. ముళ్లు కర్రలతో చావబాది వందల కేసులు మోపారు. దీనిపై నిజ నిర్ధారణకు వెళ్లిన ప్రజాసంఘాల బృందాన్ని నిర్బంధించి నెలరోజులపాటు వేధించింది.

ఒకపక్క ఆందోళన కొనసాగుతుండగానే కేసు సుప్రీం కోర్టుకు పోయింది. అణువిద్యుత్ కేంద్రం వల్ల ప్రజల జీవనానికి రాబోయే ముప్పు గురించి, పొంచి ఉన్న పర్యావరణ వినాశనాన్ని గురించి, ప్రపంచవ్యాప్తంగా ప్రసిద్ధ శాస్త్రవేత్తల అభిప్రాయాలను, నిర్ధారణలను, మరీ ముఖ్యంగా కూడంకుళం అణువిద్యుత్ ప్లాంటు కోసం తీసుకున్న రియాక్టర్ల భద్రతపై ఎంతోమంది నిపుణులు వెలిబుచ్చిన అనుమానాలను ప్రభుత్వం ముందు ఉంచినట్లే కోర్టు ముందూ పెట్టారు. వెయ్యి మెగావాట్ల సామర్థ్యంతో రష్యా నుండి దిగుమతి చేసుకున్న రియాక్టర్ల చుట్టూ మొదటి నుండి అనేక వివాదాలు నడుస్తూనే ఉన్నాయి. మొట్టమొదట అవి ఇక్కడ వాడే డిజైన్‌కు భిన్నంగా ఉన్నాయని, వాటిని నిర్వహించే అనుభవం భారతదేశానికి లేదని, ఇందులో చాలా రిస్క్ ఉందని ప్రఖ్యాతిగాంచిన వివిధ పరిశోధనా సంస్థలకు సంబంధించిన శాస్త్రవేత్తలు తమిళనాడు, కేరళ ముఖ్యమంత్రులకు ఒక లేఖ రాశారు. దీనికి తోడు మొదటి రియాక్టరులో నాలుగు సేఫ్టీ వాల్వులు సరిగా లేవని బైటపడింది. స్వయంగా అటామిక్ ఎనర్జీ రెగ్యులేటరీ బోర్డు ఒప్పుకున్న కొద్ది రోజులకే సుప్రీంకోర్టు తీర్పు వెలువడడం గమనార్హం. అంతే కాదు ఈ రియాక్టర్‌ను సప్లై చేసిన రష్యన్ రోసాటం కంపెనీకి సంబంధించిన అధికారి రియాక్టర్లలో నాసిరకం భాగాలను పెడుతున్నారనే ఆరోపణ కింద అరెస్టయ్యాడు.

అయితే అణువిద్యుత్ ప్లాంటు భద్రతను సమీక్షించిన వివిధ నిపుణుల కమిటీలు సంతృప్తిని వ్యక్తం చేశాయి. ఈ విషయంలో అవి ఏకాభిప్రాయంతో కూడా ఉన్నాయి. కోర్టులు కూడా సంతృప్తి చెందాయి. సాంకేతిక అంశాలలో అవి ప్రభుత్వ నిపుణుల బృందాల నివేదికల మీదే ఆధారపడడం సహజం. ఆ నివేదికలు ఎట్లా ఉంటాయో ఊహించగలం. అదట్లా ఉంచితే సుప్రీంకోర్టు తీర్పులో మరో ముఖ్యమైన విషయం ఉంది. తన 247 పేజీల తీర్పులో సుప్రీంకోర్టు స్పష్టం చేసిన అంశం ఏమిటంటే కూడంకుళంలో అణువిద్యుత్ కేంద్రాన్ని ఏర్పాటు చేయాలన్న నిర్ణయం ప్రభుత్వ విధానంలో భాగమని, విధాన నిర్ణయాల్లో కలగజేసుకోవలసింది ప్రజాప్రతినిధులు తప్ప కోర్టులు కావు అని. భద్రతా ప్రమాణాల విషయంలో అణునియంత్రణ బోర్డులు ప్రజలకు భరోసా

# రక్తం కారడమే, ఎముకలు విరగడమే హింస కాదు

***హింస అనేది శారీరకంగా జరిగేది మాత్రమే కాదనీ, మానసికంగా భయపెట్టడం, అవమానించడం, మనిషిని మనిషిగా గుర్తించకపోవడం కూడా హింసేనని సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును వివరిస్తున్నారు* చెరుకూరి సత్యనారాయణ**

ఇటీవల సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ కె.ఎస్. రాధాకృష్ణన్, జస్టిస్ దీపక్ మిశ్రాలు చత్తీస్‌గడ్ రాష్ట్రం నుండి వచ్చిన ఒక అప్పీలు పరిష్కరించే క్రమంలో గొప్పగా హర్షించతగ్గ తీర్పు ఇచ్చారు. చత్తీస్‌గడ్ రాష్ట్రం పాండీ ప్రాంతంలోని చిర్మిరి కాలరీలో డా. మహమూద్ నయ్యర్ అజాం అనే ఆయుర్వేద వైద్యుడున్నాడు. ఆయన ఆ వైద్య శాస్త్రంలో బిఎఎంఎస్ పట్టా పొంది ఆ ప్రాంతంలో పేద ప్రజలకు వైద్య సేవలు అందించడమేగాక వారిని దోపిడీ దౌర్జన్యాల నుండి బయటపడే అనేక చైతన్యవంతమైన కార్యక్రమాలు నిర్వహించేవాడు.

ఆ వైద్యుని కార్యకలాపాలు సహజంగానే ఆ ప్రాంతంలోని దోపిడిదారులకు, బొగ్గు మాఫియాకు, వాళ్ల తాబేదార్లుగా వ్యవహరించే ట్రేడ్ యూనియన్ నాయకులకూ, పోలీసులకూ ఇబ్బందికరంగా పరిణమించాయి. అతని కార్యక్రమాలు మానుకొమ్మని తీవ్రంగా ఒత్తిడి తేవడం, బెదిరించడం లాంటి విఫల ప్రయత్నాలు చేశారు. ఇక లాభం లేదని కొన్ని కేసుల్లో ఇరికించారు.

కరెంటు దొంగతనం చేశాడని ఆరోపించడమేగాక చీటింగ్‌కు పాల్పడ్డాడని ఆరోపించి న్యాయస్థానంలో హాజరు పరిచి రిమాండ్ ఆర్డర్ పొందారు. దాని ప్రకారం బైకుంతపూర్ జైలుకి ఆ డాక్టర్ని తరలించారు. సరిగ్గా ఇక్కడే పోలీసులు తమదైన శైలిలో ఈ కేసును మలుపు తిప్పారు.

జైలుకు బదులుగా పాండీ పోలీసుస్టేషన్‌కు తీసుకెళ్లారు. అక్కడ ఆ వైద్యుణ్ని కొట్టడం, తిట్టడంతో సంతృప్తిపడక బలవంతంగా అతని ఫొటో

ఇవ్వలేకపోతున్నాయని, అవి సమర్థవంతగా, జవాబుదారీతనంతో పనిచేయాలని, రియాక్టర్ల భద్రతను పూర్తిస్థాయిలో సమీక్షించకుండా పనిలోకి దిగకూడదన్న సుప్రీంకోర్టు ఆదేశాలు ఇక్కడ పెద్దగా ఎవరి లెక్కలోకి రాలేదు. ఏ సంస్థనైతే కోర్టు తప్పుపట్టిందో అదే ఎన్‌పిసిఐఎల్ సంస్థ కోర్టు తీర్పు పట్ల హర్షం వ్యక్తంచేసి తక్షణం పనులు ప్రారంభిస్తామని ప్రకటించింది.

ప్రభుత్వం, ప్రజాప్రతినిధులు పట్టించుకోవలసిన అనేక సమస్యలు కోర్టుల ముందుకు పోవడం నిజానికి దానంతటదే పెద్ద సంక్షోభం. ప్రజల జీవితాలను తీవ్రంగా ప్రభావితం చేసే విధానాలను ఏ మాత్రం జవాబుదారీతనం లేని ప్రభుత్వాలు చట్టసభల్లో ప్రవేశపెడుతున్నాయి. దాని మీద కనీస స్థాయిలో కూడా చర్చ జరగదు. మౌలికంగా అన్ని పార్లమెంటరీ పార్టీల విధానం ఒకటే అయినప్పుడు దీనిని ఎవరూ ఆశించలేరు. కేవలం పాలకులను ఎన్నుకోడానికి తప్ప ఏ నిర్ణయాల్లోనూ ప్రజల భాగస్వామ్యం లేని బూటకపు ప్రజాస్వామ్యంలో ప్రతి అయిదేళ్లకోసారి తాము ఎవరిచేతిలో దోపిడీకి గురికావాలో ప్రజలు ఎంచుకుంటున్నారు.

వివిధ ఆందోళనల రూపాల్లో మీరు తీసుకుంటున్న నిర్ణయాలు తప్పు, నిజంగా మేము కోరుకుంటున్నది వేరే అని ప్రభుత్వాలకు చెప్పడం ద్వారానో, అవి వినకపోతే వ్యవస్థలను స్థంభింపజేసి ఒత్తిడి తీసుకురావడం ద్వారానో కొంత మార్పు తీసుకురావచ్చు. రాజ్యాంగ పరిరక్షణ చేసేవిగా కోర్టులు కొన్ని సందర్భాల్లో కనపడినా దాని వెనక ప్రజాఉద్యమాల ఒత్తిడి, చైతన్యం పనిచేస్తాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు అభివృద్ధి ముసుగేసుకొని విద్యావంతులను, ఆలోచనాపరులను లొంగదీసుకుంటున్నాయి. విడివిడిగా అక్కడక్కడ తలెత్తే ఉద్యమాలు ఎక్కడికక్కడ కార్నర్ చేయబడుతున్నాయి. కూడంకుళం విషయమే తీసుకుంటే విద్యుత్ సంక్షోభాన్ని నివారించడానికి అణువిద్యుత్ కేంద్రం అత్యవసరం అని తమిళనాడు ప్రజలు అభిప్రాయపడేలా ప్రభుత్వం, దాని తరపున మేధావులు ఒక భావజాలాన్ని వ్యాపింపజేశారు. దగ్గరలోని కొన్ని మత్స్యకార గ్రామాల ప్రజల గోడు ఎవరికి పడుతుంది? పర్యావరణ విధ్వంసం తక్షణం అందరికీ అర్థమయ్యే సమస్య కాదు. బలమైన విప్లవ రాజకీయాలున్న ప్రాంతాల్లో తప్ప వనరుల విధ్వంసానికి వ్యతిరేకంగా సంఘటిత ప్రజాస్వామిక పోరాటాలు పెద్దగా లేవు. ఈ సందర్భంలో నిజానికి కోర్టు తీర్పులు మరింత ఆశనిపాతంలా ఉంటాయి తప్ప ఏ మాత్రం ప్రజోపయోగంగా ఉండవు. కూడంకుళంపై సుప్రీం కోర్టు తీర్పు తర్వాత హరియానాలో గోరఖ్‌పూర్ అణువిద్యుత్ కేంద్రంపై రైతులు వేసిన అనేక పిటిషన్లను పంజాబ్ హరియానా కోర్టు కొట్టివేసింది. ఇందుకు అది కూడంకుళంపై సుప్రీం కోర్టు తీర్పును ఉటంకించింది. అణువిద్యుత్తు విశాల దేశప్రజల ప్రయోజనాలకు, అభివృద్ధికి అత్యవసరమని తేల్చి చెప్పింది. పోస్కో కోసం ఇనుప ఖనిజం గనుల కేటాయింపు విషయంలోనూ ఒడిశా హైకోర్టు నిర్ణయాన్ని రద్దుచేసి ప్రభుత్వానికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. ఈ తీర్పులన్నీ వెంటవెంటనే వెలువడడం యాధృచ్ఛికం ఏమీ కాదు. అయితే సుప్రీం కోర్టే చెప్పింది కదా అనిపించడం ప్రభుత్వ విధానాలకు ఒక విధంగా నైతిక బలాన్నిస్తుంది. ఏమైనా అటు తిరిగి, ఇటు తిరిగి చివరకు ఇవి ప్రజాకోర్టుకు చేరవలసిందే. తీర్పు చెప్పవలసింది ప్రజాఉద్యమాలే. వాటిని బలోపేతం చేసే దిశగా ప్రజాస్వామిక శక్తులు ప్రత్యమ్నాయ అభివృద్ధి భావజాలాన్ని జనంలోకి తీసుకుపోవాలి.

*(రచయిత విప్లవ రచయితల సంఘం కార్యదర్శి)* వీ

తీశారు. 'డా. ఎం.ఎన్. అజాం అనే నేను దొంగను, మోసగాణ్ని, లుచ్చాని' అని రాసిన బోర్డుని అతని మెడలో వేలాడ దీశారు. అంతేగాక ఆ ఫొటోల్ని బజార్లో అందరికీ పంచి పెట్టారు. రెవెన్యూ విచారణలో సైతం దాన్ని దాఖలు చేసి తమ తెలివి లేమిని బయట పెట్టుకున్నారు.

ఈ చర్య వలన తాను తీవ్ర మనస్తాపానికి గురైనట్లు వైద్యుడు జాతీయ మానవ హక్కుల కమిషన్‌కు రిపోర్టు చేయగా దానిపై నివేదిక ఇవ్వమని జిల్లా పోలీసు సూపరిటెండెంట్‌ను కమిషన్ ఆదేశించింది. పదే పదే రిమాండ్ చేసినా పోలీసులు ఆ ఆదేశాల్ని ఖాతరు చేయలేదు. అందువలన ఆ వైద్యుడు చత్తీస్‌గడ్ హైకోర్టు బిలాస్‌పూర్ బెంచ్‌ని ఆశ్రయించాడు. గౌరవప్రదంగా బతికే ప్రాథమిక హక్కు తనకు రాజ్యాంగం 21వ అధికరణం ద్వారా సంక్రమించిందని, ఆ హక్కుని భగ్నం చేసిన అధికారుల్ని శిక్షించడమేగాక తనకు పది లక్షల నష్ట పరిహారంగా ఇప్పించమని హైకోర్టును అభ్యర్థించాడు. దీన్ని విచారించిన సింగిల్ జడ్జి ప్రభుత్వ ముఖ్య కార్యదర్శిని, పోలీస్ డైరెక్టర్ జనరల్‌ను తగు చర్యల కోసం ఆదేశించాడు. ఆ తర్వాత కేసుకు సంబంధించిన వాస్తవాలు రికార్డు చేయబడ్డాయి.

చత్తీస్‌గడ్ పోలీస్ రెగ్యులేషన్‌ను ప్రస్తావిస్తూ 'గుర్తింపు కోసం అవసరమైనప్పుడు, వేర్వేరు ప్రాంతాల్లో నిందితుని ఫొటో ప్రదర్శించాల్సిన సందర్భాలలో న్యాయమూర్తి ఆదేశంతో మాత్రమే ఫొటో తీయాలనే' విషయాన్ని గుర్తు చేశారు. ఈ కేసులో ఇందుకు భిన్నంగా పోలీసులు వ్యవహరించడం వలన వైద్యుడు మానసిక వ్యథకు గురి కావడమేగాక స్కూలుకు వెళ్లే అతని పిల్లలు కూడ తీవ్ర వ్యథకు గురైనట్లు చెప్పారు. అందువలన తప్పు చేసిన అధికారుల్ని దండించ వలసిందిగా ఆదేశించారు. చివరకు వైద్యునిపై ఆరోపణలు చేసిన అధికారులు శాఖపరమైన శిక్షలకు (ఛార్జీ మెమోలు ఇవ్వడం, ఇంక్రిమెంటు ఆపడం లాంటిది) గురైనట్లు తెలియపర్చబడింది. ఆ మేరకు రిపోర్టు దాఖలు చేశారు. ఆ అధికారులపై పోలీసు చట్టం కింద కేసు కూడ పెట్టినట్లు హైకోర్టుకు తెలియజేశారు.

సింగిల్ జడ్జి కేసును డివిజన్ బెంచ్‌కి నివేదించగా వారు దాన్ని విచారించి నష్ట పరిహారం కోసం దరఖాస్తు చేసుకోమని సూచించారు. అలా చేసుకున్న దరఖాస్తు నిర్హేతుకంగా తిరస్కరించబడింది.

ఈ సందర్భంలోనే సుప్రీంకోర్టు డి.కె.బసు కేసును కూడా ఉటంకించింది. ఒక మనిషిని వేరొక మనిషి పెట్టే హింసకు రాజ్యాంగంలో ఎక్కడా నిర్వచించకపోయినా 'ఏ రకమైన సమాచారం రాబట్టడానికైనా ఏ రకమైన హింసని ప్రయోగించడమైనా సరైంది, న్యాయ సమ్మతమైంది కాదు. అది రాజ్యాంగంలోని 21వ నిబంధన ప్రకారం నేరం అవుతుంది.

తమ హక్కుల్ని తమ ప్రయోజనాల్ని కాపాడే లక్ష్యంగల న్యాయ వ్యవస్థ కింద తాము జీవిస్తున్నామనే భావాన్ని పౌరుల్లో కల్గించడం పబ్లిక్ లా ఉద్దేశమని గతంలో డా. ఎ.ఎన్. ఆనంద్ ఇచ్చిన తీర్పును కూడా ప్రస్తావించారు.

రక్తం కారేలా, ఎముకలు విరిగేలా కొట్టడంలాంటి చర్యల్నే హింసగా చాలామంది భావిస్తారు. కాని వాస్తవానికి ఒక వ్యక్తి ఆలోచనా క్రమంలోకి బలవంతంగా జొరబడడం కూడ స్వేచ్ఛకి భంగకరంగా మనం గుర్తించాలి. అలాంటి హింసాత్మక చర్యల వల్ల తీవ్రమైన దీర్ఘ కాలికమైన దుష్ఫలితాలు ఉంటాయని న్యాయమూర్తులు అభిప్రాయ పడ్డారు.

ఢిల్లీ న్యాయశాఖ సేవల కేసును ఉదాహరిస్తూ, నిందితుల్ని పట్టుకోవడం, నేరాన్ని పరిశోధించడం, న్యాయస్థానం ముందు వారిని విచారించడం నేరాన్ని నిరోధించడం వీటన్నిటి కన్నా ప్రధానంగా పౌరుల ప్రాణాల్ని, ఆస్తిని కాపాడడం ద్వారా శాంతి భద్రతల్ని పరిరక్షించడం పోలీసు వ్యవస్థ ముఖ్య లక్ష్యం. నిందితుడి పట్ల పోలీసులు కచ్చితంగా సక్రమంగా వ్యవహరించాలని, న్యాయమూర్తులు సక్రమంగా విచారణ చేయాలని చట్టం చెపుతుంది. అయితే రాజ్యాంగం అమల్లోకి వచ్చిన 40 సంవత్సరాల తర్వాత (ఆ కేసు తీర్పు చెప్పినప్పటికి) కూడ ఈ లక్ష్యాలు నెరవేరకపోవడం దురదృష్టం. శాంతిభద్రతల పరిరక్షణ క్రమంలో పోలీసుల మితిమీరిన ప్రవర్తనల గురించి న్యాయస్థానాలు అనేక సందర్భాలలో వ్యతిరేక వ్యాఖ్యలు చేసినా పోలీసు వ్యవస్థపై దాని ప్రభావం కనిపించడం లేదు.

'ప్రతి మనిషిలో ప్రాథమికంగా దైవత్వం ఉంటుందని అలాంటి మనుషులు హుందాగా జీవించడంలోనే జీవితం పట్ల గౌరవ భావన ఏర్పడుతుందని' న్యాయమూర్తులు అభిప్రాయపడ్డారు. గౌరవ ప్రదంగా బతికే వ్యక్తులలో అంతర్లీనంగా ఉండే శక్తియుక్తులన్నీ వికసిస్తాయని వారు అన్నారు. ప్రజల ప్రాథమిక హక్కుల్ని కాపాడే బాధ్యతలో రాజ్యం విఫలమైనప్పుడు ఆ తప్పుకు గాను దాన్ని శిక్షించే ఉద్దేశంతో నష్ట పరిహారం చెల్లింపుకు న్యాయస్థానాలు ఆలోచిస్తాయని అన్నారు.

ఒక వ్యక్తి మానసిక స్థైర్యాన్ని నిలబెట్టగలిగిన శక్తి తాత్వికతకు ఉంటుంది. అయితే ఆ మానసిక స్థైర్యానికి వ్యక్తి గౌరవం పునాది. గౌరవాన్ని కోల్పోయిన ఏ వ్యక్తికయినా అతడు ఎంతటి మానసిక శక్తియుక్తులు ఉన్నవారైనా స్థైర్యాన్ని కోల్పోతాడు. తమ కస్టడీలో ఉన్న నిస్సహాయుడైన వ్యక్తిని అవమానించడం, అతన్ని క్షోభపెట్టడం, భయభ్రాంతికి గురిచేయడం పోలీసు ఉద్దేశంగా కనిపిస్తుంది. ఈ కారణంగా ఆ వ్యక్తిలో మానసిక ఆందోళన ఒత్తిడి కలిగి అతడి స్థైర్యం దెబ్బ తింటుంది. ఇది నెమ్మది నెమ్మదిగా విషం ఎక్కించడం లాంటిది. బలహీనుడి ఇచ్ఛకు వ్యతిరేకంగా బలవంతుడు పాల్పడే చర్య హింస. మానవ నాగరికతలో చీకటి కోణం హింస. ఈ గాయం దృగ్గోచరం. చల్లదనం అంటే మంచులాగా, గట్టిదనం అంటే రాయిలాగా అన్నంత సులువుగా చెప్పదగినది కాదు, లాంటి అనేక అమూల్యమైన వ్యాఖ్యానాలు ఈ తీర్పులో న్యాయమూర్తులు చేశారు.

చివరకు ఐదు లక్షల రూపాయలు నష్ట పరిహారంగా డాక్టరుకు వెంటనే చెల్లించింది. తర్వాత ఆ మొత్తాన్ని తప్పు చేసిన పోలీసుల జీతాల్లోంచి రివకరీ చేసుకోమని ప్రభుత్వాన్ని ఆదేశించారు. ఇలాంటి తీర్పులు చాలా ప్రగతిశీలంగా కనిపించినా, మానవుడి స్వేచ్ఛ పట్ల న్యాయస్థానాలు గొప్ప గౌరవాన్ని ప్రదర్శించినట్లు కన్పించినా ఈ తీర్పుగాని, మన రాష్ట్రంలో జరిగిన నకిలీ ఎన్‌కౌంటర్లపై గత సంవత్సరం జాతీయ మానవ హక్కుల కమిషన్ ఇదే రకంగా స్పందించిన తీరుగాని న్యాయస్థానాలు మరింత ఎక్కువగా స్పందించవలసిన అవసరాన్ని గుర్తు చేస్తున్నాయి. పరువు నష్టం, ప్రాణ నష్టం లాంటి అన్ని చర్యలకు ఇచ్చే పరిహారం అనే స్థాయిని న్యాయస్థానాలు దాటాలి.

*(రచయిత న్యాయవాది)* వీ

# న్యాయవ్యవస్థ పటిష్టత ఎప్పుడు?

***ఏళ్లకు ఏళ్లుగా కోర్టులలో కేసులు వాయిదాలు పడుతూ లక్షల కేసులు పెండింగ్ పడుతున్నాయనీ, న్యాయవ్యవస్థపై సామాన్యులకు నమ్మకం లేకుండా పోతోందనీ అంటున్నారు చిమ్మె జాన్ బర్నబాస్***

**'జ**స్టిస్ డిలేడ్ ఈజ్ జస్టిస్ డినైడ్' (న్యాయం ఆలస్యమైతే, న్యాయం జరగనట్లే) అన్న ఆధునిక న్యాయ సూత్రాన్ని నేడు ఆపాదించుకోవడం చాలా విచారకరం. దేశవ్యాప్తంగా నేడు మూడు కోట్ల కేసులు పెండింగ్‌లో ఉన్నాయని ఇటీవల జరిగిన రాష్ట్రాల ముఖ్యమంత్రుల, ప్రధాన న్యాయమూర్తుల సదస్సులో ప్రధానమంత్రి ప్రకటించడం గమనార్హం. ప్రస్తుతం ప్రజలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో ఇది కూడా ఒకటని దేశ ప్రధాని అంగీకరించినట్లుగా భావించాలి. కేసుల అపరిష్కృతానికి కొన్నిచోట్ల రాజకీయ జోక్యంతో కూడిన ప్రభుత్వ న్యాయవాదుల వ్యవస్థ కూడా ఒక కారణం. దేశంలో పది లక్షల మందికి ఒక న్యాయమూర్తి ఉండడం కూడా కేసుల పెండింగ్‌కు ఒక కారణంగా భావించవచ్చు. ప్రజల – న్యాయమూర్తుల – కోర్టుల నిష్పత్తి కూడా అపరిష్కృతానికి ఒక కారణం.

'ప్రజాస్వామ్య వ్యవస్థలో పౌరుల, ప్రాథమిక హక్కుల ఉల్లంఘనకు కేసుల విచారణలో జాప్యం ఒక ప్రధాన కారణం' అని అన్ని ప్రజాస్వామిక, పౌరహక్కుల సంఘాలు ఘోషిస్తున్నాయి. అందుకోసమే గత ఐదు సంవత్సరాల క్రితం, సత్వర న్యాయ విచారణ కొరకు, ఫాస్ట్ ట్రాక్ కోర్టులను ఏర్పాటు చేశారు. తాత్కాలిక పద్ధతిలో న్యాయమూర్తుల నియామకం జరిగినప్పటికీ, కొద్దో గొప్పో మేలు ఈ ఫాస్ట్‌ట్రాక్ కోర్టుల వలన జరిగిందని భావించాలి. కొన్ని కేసులు మాత్రం పరిష్కారం కావడం లేదు, అందుకు కక్షిదారుల మధ్య పట్టింపులు, న్యాయవాదుల సహాయ సహకారం లేకపోవడం కూడా ఒక కారణం. అన్నింటికన్నా ముఖ్యంగా న్యాయాధికారులు కూడా కొన్ని చోట్ల 'చొరవ' చూపించకపోవడం కూడా ఒక కారణం. మన దేశంలో కక్షిదారులను న్యాయ వ్యవస్థ ఉద్యోగులు (క్లర్క్) కూడా వాయిదాల పేరు మీద వేధించడం కూడా చేస్తున్నారు. ఇది కింది స్థాయి (సబ్ రిజిస్ట్రార్ – జిల్లా స్థాయి) న్యాయ స్థానాలలో సర్వ సాధారణం అయిపోయింది. 'న్యాయస్థానాలకు నిధుల కొరత ప్రధాన సమస్య' అనేది దశాబ్దాలుగా అంటున్న మాటే. ఉన్న పరిస్థితులను సద్వినియోగం చేసుకొని ప్రజలకు సత్వ న్యాయం ఇవ్వాలన్నది కూడా ప్రధానమే. ఆ వైపుగా ప్రస్తుత న్యాయకోవిధులు కృషి చేయాలి.

కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ ఏ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినా, 'అభివృద్ధి – సంక్షేమం' పేరు మీద వేల కోట్ల రూపాయలు నిధుల రూపంలో ఖర్చు చేస్తున్నప్పటికీ, న్యాయవ్యవస్థ పటిష్టతకు, న్యాయవ్యవస్థ అభివృద్ధికి మాత్రం తగినన్ని నిధులు కేటాయించడం లేదు.

రాజ్యాంగానికి మూల స్తంభాలలో ఒకటైన న్యాయవ్యవస్థ, అన్నింటి కన్నా మిన్న అనీ, దానిపట్ల తమకు విశ్వాసం, గౌరవం ఉందనీ ఎప్పుడూ గొప్పలు చెప్పుకొనే రాజకీయ నాయకులు కావాలనే ఈ వ్యవస్థను నిర్లక్ష్యం చేస్తున్నట్లు భావించవలసి వస్తోంది. తమకు ఇబ్బంది కలిగే పరిస్థితులు వస్తే, ఇదే రాజకీయ నాయకులు నేటి న్యాయస్థానాలను సైతం విమర్శించడం కూడా మనం చూస్తున్నాం.

రాజ్యాంగంలోని మౌలిక అంశాల జోలికి వెళ్లకుండా (నేటి పాలకులు), రాజ్యాంగ నిర్మాతలు, రాజ్యాంగ పీఠిక లక్ష్యాలను కాపాడుతూ, పటిష్టమైన ఏర్పాట్లను చేశారు. చారిత్రాత్మకమైన కేశవానంద భారతి కేసు ద్వారా ఈ విషయం సుస్పష్టమైంది. ఆర్థిక సంస్కరణలతో పాటు, ఆర్థిక నేరాలు కూడా పెచ్చుపెరిగిపోయాయి. గతంలో దిగువ స్థాయికి మాత్రమే పరిమితమైన అవినీతి ఇప్పుడు ఉన్నతస్థాయి, రాజకీయ, అధికార వర్గాలలో తిష్టవేయడం వలన అనూహ్యమైన రీతిలో కేసుల సంఖ్య పెరిగిపోతోంది.

ఈ కేసుల విచారణ నుంచి తప్పించుకోవడానికి నిందితులు తరచూ న్యాయస్థానాలను ఆశ్రయించడం కూడా కేసుల విచారణలో జాప్యం జరగడానికి ప్రధాన కారణం. నిందితులెవరో, ప్రజలందరికీ కళ్లకు కట్టినట్లు కనిపిస్తున్నప్పటికీ, వారి నేరాలను రుజువు చేయడానికి, అవసరమైన సమాచారాన్ని, సాక్ష్యాధారాలను సేకరించడంలో దర్యాప్తు సంస్థలైన అవినీతి నిరోధక శాఖ (ఎసిబి), కేంద్ర దర్యాప్తు సంస్థ (సిబిఐ)లు కూడా అనేక సమస్యలను ఎదుర్కొంటున్నాయి.

'బాలలకు రక్షణ లేకపోతే, వారిలో నేర ప్రవృత్తి పెరిగిపోతుందన్న' ప్రస్తుత సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఆల్తమస్ కబీర్ వ్యాఖ్యలు కూడా వాస్తవంగా భావించాలి. బాలనేరస్తుల సంఖ్య పెరగడానికి, కుటుంబ సభ్యుల పాత్ర కూడా ఉంది. అంటే, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, బంధుమిత్రులు పట్టించుకోని కారణంగా బాల నేరస్తులు తయారవుతున్నారు. చట్టాలన్నా, న్యాయస్థానాలన్నా గౌరవం లేకపోవడం, రాజకీయ పలుకుబడితో ఎంతటి శిక్షనైనా తప్పించుకునే మార్గాలు అంతకంతకూ పెరుగుతుండడం కూడా నేరాల సంఖ్య పెరగడానికి కారణమవుతోంది.

తీవ్ర సంచనాలను సృష్టించిన కేసుల విచారణకు మాత్రమే ఫాస్ట్‌ట్రాక్, ప్రత్యేక కోర్టులను ఏర్పాటు చేస్తున్నారు. సివిల్ కేసులు, ప్రజా ప్రయోజనాల వ్యాజ్యాలు పెరగడం వలన కూడా కోర్టుల్లో మునుపటికన్నా, పనిభారం పెరిగింది. అలాగే కుటుంబ న్యాయ స్థానాలను ప్రత్యేకంగా ఏర్పాటు చేసినా వాటి పనిలో కూడా అన్యుల జోక్యం పెరగడం వలన కేసుల విచారణ జాప్యం జరుగుతున్నది.

ముఖ్యంగా, మన దేశంలో 75 లక్షలకు పైగా కేసులు అయిదేళ్లకు పైబడి పరిష్కారానికి నోచుకోక అలమటిస్తున్నవే. అయిదు వేల గ్రామీణ న్యాయాలయాలు రూపుదాల్చి, ప్రతి ఏటా 30–40 లక్షల కేసులు చకచకా అయిపోతాయని మూడేళ్లనాడే కేంద్ర ప్రభుత్వం సందడి చేసినా ఇప్పటికీ అది అమలు కాలేదు. గతంలో లా కమిషన్ చేసిన సిఫారసులను అమలు చేసే కేంద్ర ప్రభుత్వం తన పని త్వరగా చేసినట్లవుతుంది.

*(రచయిత న్యాయవాది)* వీ

# భారత - చైనా సరిహద్దు సమస్య

***పొరుగు దేశాలతో స్నేహ, సహకార సంబంధాలు పెంచుకోకుండా, నిత్యం వివాదాలను పెంచుకుంటూ అమెరికా ప్రాబల్యంతో భారతదేశం అవలంబిస్తున్న విధానాలు దేశ ప్రయోజనాలను దెబ్బతీస్తున్నాయని అంటున్నారు* జి. సత్యనారాయణరెడ్డి**

**జ**మ్మూ – కశ్మీర్ రాష్ట్రానికి చెందిన లడాక్ తూర్పు ప్రాంతంలోని దౌలత్‌బేగ్ ఓల్డి సెక్టార్ పరిధిలోని డెపసాంగ్ కనుమలో కొందరు చైనా సైనికులు ఏప్రిల్ 15న ఒక గుడారాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. ఇది జరిగిన ఆరు గంటలలోపే వారికి ఎదురుగా భారత సైనికులు మూడు వందల మీటర్ల దూరంలో గుడారాలు వేసుకొని సైన్యాన్ని మోహరించారు. దాంతో భారత – చైనా సరిహద్దులో మరొకసారి ఉద్రిక్తత నెలకొంది. దానిపైన రెండు దేశాల దౌత్య అధికారులు, మిలిటరీ అధికారుల మధ్య పలు దఫాలు చర్చలు జరిగి, మే 5న ఒక ఒప్పందానికి వచ్చారు. ఇరు దేశాల సైనికులు తమ గుడారాలను ఎత్తి వేసుకొని ఆ ప్రాంతం నుండి వెనక్కి వెళ్లిపోయారు. ఇది జరిగే దాకా, ఇరవై రోజుల పాటు భారత దేశంలో మరోసారి పెద్ద ఎత్తున చైనా వ్యతిరేకత రెచ్చగొట్టబడింది. ఆ తర్వాత కూడా మరో రూపంలో అది ఇంకా కొనసాగుతూనే ఉంది. 'అది ఒక స్థానిక సమస్య' అని భారత ప్రధానీ, 'ఆ పరిస్థితి మేం సృష్టించింది కాద'నీ రక్షణశాఖ మంత్రి అంటోనీ, 'చైనా సైనికులు వెనక్కి వెళ్లిపోయి సరిహద్దులో యథాతథ పరిస్థితి నెలకొల్పాల'నీ విదేశాంగ శాఖ మంత్రి ప్రకటనలు ఇచ్చారు. రాజుని మించిన రాజభక్తిని ప్రకటిస్తూ ప్రతిపక్ష పార్టీల నాయకులు, చైనా దురాక్రమణను ప్రధాని స్థానిక సమస్యగా పేర్కొనడంపై నిప్పులు చెరిగారు. విదేశాంగ శాఖ మంత్రి చైనా పర్యటనను రద్దు చేసుకోవాలని, లడాక్ నుంచి చైనా సైనికులు వెనుతిరిగే వరకు బీజింగ్‌కు ఎటువంటి పర్యటనలు చేపట్ట వద్దని వారు డిమాండ్ చేశారు. ఇక ప్రసార మాధ్యమాలన్నీ చైనా హద్దు మీరిందని, దానిపై మన సైనిక బలగాలను దూకుడుగా వినియోగించాలంటూ జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టాయి.

'మేం సరిహద్దు తగాదాను రెచ్చగొట్టడం లేదనీ, సరిహద్దుకు ఇటు పక్క మా భూభాగంలోనే ఉన్నామనీ, 'భారత – చైనాల మధ్య సరిహద్దులు నిర్ధారించబడనందు'న ఆ ప్రాంతాల్లో ఈ విధమైన సమస్యలు తలెత్తడం అనివార్యం' అనీ చైనా విదేశాంగ శాఖ ప్రతినిధి హువాజిన్ ఇంగ్ ప్రకటించింది. చైనా ప్రతినిధి ప్రకటించిన ఈ అభిప్రాయంతో వివిధ రూపాల్లో కొందరు భారత ప్రభుత్వ, సైనిక అధికారులు కూడా అంగీకరిస్తున్నారనేది ఇక్కడ గమనించవలసిన ఒక ముఖ్యమైన విషయం.

'ఆ ప్రాంతంలోని వాస్తవాధీనరేఖపై రెండు విభిన్నమైన అవగాహనలు (పర్‌సెప్షన్స్) ఉన్నాయన్న విషయాన్ని భారత దేశపు అధికారులు అంగీకరిస్తున్నారు. సమస్య మరింత పెరగకుండా, శాంతియుతంగా, ఇరుపక్షాలు సంబంధాలు కలిగి ఉన్నాయి'. ('హిందూ' పత్రిక (23 ఏప్రిల్ 2013)లో అనంతక్రిష్ణన్, సందీప్ దీక్షిత్‌ల 'రెండు దేశాల మధ్య పరస్పర ఆమోదంతో నిర్ధారించబడిన సరిహద్దు కాదు' వ్యాసం నుండి)

'వాస్తవాధీన రేఖ అనేది ఒక ఊహ మాత్రమే. ఇరు దేశాల అంగీకారంతో అది నిర్ధారించబడలేదు. ఆ విధంగా ఏ పటం (మ్యాప్) లోనూ పేర్కొనబడలేదు'. (27 ఏప్రిల్ 2013, హిందూ)

ఆనాటి భారత సైనిక దళాల ప్రధానాధికారి జె.సింగ్ 2006లో ఒక పత్రికా విలేకరుల సమావేశంలో ఇచ్చిన సమాధానంలో చెప్పిన విషయాలు చాలా ఆసక్తిదాయకంగా ఉన్నాయి. 'భారత, చైనా సైన్యాలు తమ తమ జెండాలను చూపి తమవని చెప్పుకుంటున్న భూభాగాలను తమవేనని నిర్ధారించడానికి ప్రయత్నిస్తున్నారా' అని విలేకరులు అడిగినప్పుడు, ఆ అధికారి వాస్తవాధీనరేఖ వద్ద గల పరిస్థితి గురించి చెపుతూ –

'ఒక రకంగా అంతే. రెండు పక్షాల వారు కూడా తాము తమ సరిహద్దు ఫలానా చోట వరకు అని అనుకున్నప్పుడు, ఆ విషయాన్ని ఆచరణలో నొక్కి చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే దాని వలన కాల్పులకు దారితీసిన పెద్ద ఘర్షణ కానీ, చిన్న ఘర్షణ కానీ జరగలేదు. గత కొన్ని సంవత్సరాలుగా ఈ సరిహద్దు సాధారణంగా చాలా ప్రశాంతంగా ఉంది'. (హిందూ, 19 మార్చ్ 2006)

పైన పేర్కొన్న వాస్తవాలు స్పష్టం చేస్తున్నదేమిటి? రెండు దేశాల మధ్యన పరస్పర అంగీకారంతో నిర్ధారించుకున్న సరిహద్దులు లేవనేదే. దాన్ని రెండు దేశాల దౌత్య, సైనిక అధికారులు అంగీకరిస్తున్నారనే.

మరి అలాంటప్పుడు చైనా, భారత భూభాగంలోకి పంతొమ్మిది కిలోమీటర్ల వరకు చొచ్చుకొని వచ్చి గుడారాలను ఏర్పాటు చేసుకొన్నదని ఏ విధంగా చెప్పగలం? ఇరు దేశాలు చర్చలు, సంప్రదింపుల ద్వారా, పరస్పర ఆమోదంతో ఒక అంగీకారానికి వచ్చి, ఆ మేరకు భూమిపైన సరిహద్దులు నిర్ణయించుకున్న తర్వాతనే ఏ భూమి ఎంత వరకు ఎవరిదనేది నిర్ధారింపబడుతుంది. అప్పటి వరకూ ప్రస్తుతం వివాదం కొనసాగుతున్న ప్రాంతాలను వివాదాస్పద భూభాగాలుగానే పరిగణించాల్సి ఉంటుంది.

సరిహద్దు ప్రాంతంలో మిలిటరీని, నిర్మాణాలను భారత ప్రభుత్వం పెంచుతూ వస్తోంది. 1965 తర్వాత ఆ ప్రాంతాన్ని మూసివేశారు. అయిదు సంవత్సరాల క్రితమే దానిని తిరిగి పునరుద్ధరించారు. ఈ అయిదు సంవత్సరాల కాలంలో సరిహద్దు వెంట భారత్ పెంచిన మిలిటరీ కార్యకలాపాలు ఈ విధంగా ఉన్నాయి:

'చైనా – భారత సరిహద్దు వెంట భారతదేశం తన మిలిటరీ కార్యకలాపాలను పెంచడం పట్ల చైనా తన అయిష్టతను ప్రదర్శిస్తున్నట్లుగా ఉంది. లడాక్ విభాగంలో వైమానిక దళానికి చెందిన విమానాలను నిలిపే ప్రదేశాలను పెంచింది. చుమార్ సెక్టార్‌లో ముఖ్యమైన రోడ్డు నిర్మాణ ప్రాజెక్టులను పూర్తిచేసింది. దౌలత్‌బేగ్ ఓల్డి ప్రాంతాన్ని లే ప్రాంతంతో కలిపే రోడ్డు నిర్మాణ పనులను ప్రారంభించింది. శక్తిమంతమైన ఫైటర్ విమానాలను టిబెట్‌కు సమీపంలోని స్థావరాల వద్దకు తరలించింది. దానితో పాటుగా రెండు కొత్త పర్వత డివిజన్లను తయారు చేసింది. హిమాలయాల మీద రెండు ఆయుధ బ్రిగేడులను నెలకొల్పడానికి పథకాన్ని సిద్ధం చేసింది. పర్వత ప్రాంతాలపైన దాడి చేయగల సైనిక పటాలాలను అభివృద్ధి చేయవచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే భారత దేశం టిబెట్ ప్రాంతం నుండి కేవలం ఆత్మరక్షణ చేసుకొనే స్థితి నుండి ఎదురు దాడులకు దిగగల పరిస్థితులను అభివృద్ధి చేసుకుంది' (7 మే 2013 'హిందూ'లో ప్రచురించిన మనోజ్ జోషి వ్యాసంలో నుండి). భారతదేశం గత అయిదు సంవత్సరాల కాలంలో సరిహద్దు ప్రాంతంలో తీసుకున్న చర్యలను ఇది స్పష్టంగా పేర్కొంటోంది.

భారత విదేశాంగ మంత్రి సల్మాన్ ఖుర్షీద్ చైనా పర్యటనను ముగించుకొని వచ్చిన రోజే రక్షణ మంత్రి ఆంటోనీ గోవాలో విలేకరుల సమావేశంలో 'సరిహద్దు ప్రాంతంలో మౌలిక సదుపాయాలను, సైనిక పటవాన్ని, ఇతర సౌకర్యాలను అభివృద్ధి చేసుకునే హక్కు భారత దేశానికి ఉంద'ని ప్రకటించడం గమనించవలసిన విషయం. భారతదేశం ఇటీవల తన అన్ని రకాల సైనిక శక్తిని ఏ విధంగా పెంచుకున్నదీ, రాబోయే రోజుల్లో ఏ విధంగా పెంచుకోబోతున్నదనే దానిపై ఒక సుదీర్ఘమైన వివరణను ఆ విలేకర్ల సమావేశంలో ఆంటోని ఇచ్చారు.

పైన పేర్కొన్న వివరాలు చైనా పట్ల భారతదేశం అనుసరించ దల్చుకున్న విధానాన్ని స్పష్టం చేస్తోంది. సరిగ్గా ఈ పరిస్థితుల్లో, ఈ నేపథ్యంలో చైనా దౌలత్‌బేగ్ ఓల్డి ప్రాంతంలో గుడారాన్ని ఏర్పాటు చేసుకుంది.

భారత, చైనాల మధ్య సరిహద్దు సమస్య అనేది చరిత్ర నుండి, గతం నుండి వారసత్వంగా సంక్రమించిన ఒక సమస్య మాత్రమే. రెండు దేశాల మధ్య అనేక వందల సంవత్సరాలుగా మంచి స్నేహ సంబంధాలు కొనసాగుతూ వచ్చాయి. 1947-57 మధ్య, ఆ సంబంధాలు మంచి ఉచ్ఛస్థాయిలో కొనసాగాయి. 'హిందీ - చీనీ భాయి భాయి' (భారత, చైనా దేశాలు సోదరులు) అనే నినాదం రెండు దేశాల్లో మారుమోగింది. 1957 తర్వాత ఆ సంబంధాలు క్రమంగా క్షీణించడం మొదలయ్యాయి. టిబెట్‌లో తిరుగుబాటుదారులకు అమెరికాతో కలసి భారతదేశం సహాయ పడింది. ఈ రెండు దేశాల ప్రోత్సాహంతో 1959లో టిబెట్‌లో ఒక తిరుగుబాటు జరిగింది. ప్రజల మద్దతు లేని, ప్రజల ప్రయోజనాలతో సంబంధంలేని అమెరికా అగ్రరాజ్యం, భారత విస్తరణవాద పాలకుల ప్రోత్సాహంతో జరిగినందున ఆ తిరుగుబాటు సహజంగానే విఫలమయింది. దాంతో దలైలామా, కొంత మంది తన అనుచరులతో కలిసి భారతదేశానికి పారిపోయి వచ్చారు. భారత ప్రభుత్వపు తోడ్పాటు, అన్ని విధాలా అందించిన సహాయాలతో హిమాచల్ ప్రదేశ్‌లోని ధర్మశాల వద్ద ఒక ప్రవాస ప్రభుత్వాన్ని నెలకొల్పాడు. భారత ప్రభుత్వ బడ్జెట్‌ల నుండి గత యాభై సంవత్సరాలకు పైగా మన పాలకులు వారిని కూర్చోబెట్టి పోషిస్తున్నారు.

చైనాను చుట్టిముట్టి దెబ్బతీయడానికి అమెరికా అగ్రరాజ్యం గత యాభై సంవత్సరాలకు పైగా ప్రయత్నిస్తూనే వస్తున్నది. భారతదేశం ఆనాడు కూడా అమెరికా అగ్రరాజ్య ప్రభావంలోనే ప్రధానంగా ఉండేది. (1971-91 మధ్య అది ప్రధానంగా రష్యా అగ్రరాజ్య ప్రభావంలో ఉండింది). చైనాను దెబ్బతీయడం కోసం రెండు దేశాల మధ్య ఉన్న సరిహద్దు సమస్యను ఒక రాజకీయ సమస్యగా మార్చారు. 1962లో భారత, చైనాల మధ్య (అమెరికా ప్రోద్భలంతో) యుద్ధం జరిగింది.

ఆ యుద్ధం మూలంగా అంతకు ముందుకాలంలో కొనసాగిన రెండు దేశాల మధ్య సంబంధాలు పూర్తిగా దెబ్బతిన్నాయి. అవి రెండూ పెద్ద శత్రు దేశాలుగా మారిపోయాయి. వాటి మధ్య సాధారణ దౌత్య సంబంధాలు కూడా లేకుండా పోయాయి. 14 సంవత్సరాల తర్వాత 1976లో లాంఛనప్రాయమైన దౌత్య సంబంధాలు తిరిగి ప్రారంభమయ్యాయి. అయినా పరిస్థితుల్లో చెప్పుకోదగిన మార్పేమీ రాలేదు. సరిహద్దు ప్రాంతాల్లో చిన్న చిన్న సంఘర్షణలు సాగుతూనే వచ్చాయి. 1987లో అరుణాచల్ ప్రదేశ్‌లోని సుందూరాంబాంగ్ లోయ ప్రాంతంలో జరిగిన సంఘర్షణలు రెండు దేశాల మధ్య పెద్ద ఉద్రిక్తతలకు దారితీశాయి. దాంతో ద్వైపాక్షిక సంబంధాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. 1988లో అప్పటి ప్రధాని రాజీవ్ గాంధీ చైనా పర్యటనకు వెళ్లారు. ఆ తర్వాత సరిహద్దుల్లో పరిస్థితి కొంత ఉపశమించింది.

**సరిహద్దు సమస్యకు రాజకీయ పరిష్కారం**

1993లో మొదటిసారి, 1996లో రెండవసారి సరిహద్దు ప్రాంతాల్లో శాంతి కొనసాగించడానికీ, రెండు దేశాల మధ్య విశ్వాసాన్ని పెంపొందించడానికి రెండు ఒప్పందాలను ఇరు దేశాలు కుదుర్చు కున్నాయి. వాటిలో కొన్ని కీలకమైన, సానుకూలమైన అంశాలు పొందు పర్చారు. అయితే అవి ఏనాడూ అమలుకు నోచుకోలేదనేది వేరే విషయం. 1993 ఒప్పందంలోని 2వ క్లాజులో ఈ విధంగా ఉంది - 'రెండు వైపులా ఉన్న సైనికుల సంఖ్యపై పరిమితి ఉండాలి. వాస్తవాధీన రేఖ పొడుగునా ఉన్న సైనిక శక్తిని ఇరు పక్షాలు తగ్గించాలి. ఆ విధంగా తగ్గించవలసిన సైనిక శక్తుల సంఖ్య, స్వభావం, కాలం పరస్పర సంప్రదింపుల ద్వారా నిర్ణయిస్తుంది'. 1996 నాటి రెండవ ఒప్పందంలోని 3వ ఆర్టికల్‌లో ఈ విధంగా పేర్కొన్నారు. 'ట్యాంకులు, కాల్బల యుద్ధ వాహనాలు, ఫిరంగి తుపాకులు, భారీ మోర్టార్లు, భూమిపై నుండి భూమి పైకి, భూమిపై నుండి ఆకాశంలోకి ప్రయోగించే క్షిపణులు (మిస్సైల్స్) తగ్గించబడుతాయి. వాటిపైన విధించే పరిమితి పరస్పర ఒప్పందం ద్వారా నిర్ణయించబడుతుంది'. ఇలాంటి ఒప్పందాన్ని అమలు జరపడానికి అవసరమైన కీలక చర్య గురించి 1996 ఒప్పందంలోని 10వ ఆర్టికల్‌లో ఈ విధంగా పేర్కొంది. 'వాస్తవాధీన రేఖ పైన ఒకే విధమైన అవగాహనకు రావడానికి ఇరు పక్షాలు కృషి చేస్తాయి'. 1993, 1996 ఒప్పందాల్లో ఇలాంటి అనేక ఇతర విషయాలు పొందుపర్చాయి. అయితే అవేవీ ఆచరణలో అమల్లోకి రాలేదు అనేది స్పష్టమే.

సరిహద్దు సమస్యకు ఒక రాజకీయ పరిష్కారాన్ని కనుగొనడానికి ఆనాటి వాజ్‌పేయి నేతృత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వం 2003లో సూత్రరీత్యా అంగీకరించింది. 'భారత - చైనాల మధ్య రాజకీయ సంబంధాలు, సమగ్రమైన సహకారం కోసం సూత్రాల ప్రకటన' అన్న డాక్యుమెంట్‌పై చైనా ప్రభుత్వంతో భారత్ ఒక ఒప్పందం చేసుకున్నది. అప్పటివరకూ సరిహద్దు సమస్యను ఏ సెక్టారుకు ఆ సెక్టారును విడి విడిగా చర్చించి పరిష్కరించుకోవాలనే వైఖరినే భారత ప్రభుత్వాలు అనుసరిస్తూ వచ్చాయి. దాని స్థానంలో 'సరిహద్దు సమస్యకు రాజకీయ పరిష్కారం'ను అంగీకరించడమనేది ఒక స్పష్టమైన మార్పే. 2004లో అధికారంలోకి వచ్చిన యుపిఎ ప్రభుత్వం పై క్రమాన్ని కొనసాగించడానికి అంగీకరించింది. సరిహద్దు సమస్యను మొత్తంగా కలిపి (ప్యాకెజ్ సెటిల్‌మెంట్) పరిష్కారం చేసుకోవడానికి, 'శాంతి, సౌభాగ్యాల కోసం వ్యూహాత్మక సహకార భాగస్వామ్యం' పేరుతో 2005 ఏప్రిల్ 11న చైనాతో భారతదేశం ఒక ఒప్పందాన్ని కుదుర్చుకుంది. ఆ ఒప్పందంలో సరిహద్దు సమస్య పరిష్కారం కొరకు కొన్ని మార్గదర్శక సూత్రాలు, గీటురాళ్ల గురించి పేర్కొన్నారు. 2003, 2004లలో కుదుర్చుకున్న పై రెండు ఒప్పందాల ద్వారా భారత - చైనా సంబంధాలు ఒక కొత్త దశలోకి ప్రవేశించాయి. అయితే ఈ ఒప్పందాల్లో పలు అంశాలు ఆచరణకు నోచుకోనందున సరిహద్దు సమస్య పరిష్కారం విషయంలో ప్రతిష్టంభన నేటికీ కొనసాగుతూనే ఉంది.

**నెహ్రూ ప్రభుత్వ స్వతంత్ర విదేశాంగ విధానం**

నెహ్రూ నాయకత్వంలోని భారత ప్రభుత్వం అమెరికా, రష్యా అగ్ర రాజ్యాల ఆదేశాలకు తలొగ్గకుండా స్వతంత్ర విదేశాంగ విధానాన్ని అనుసరించి ఉన్నట్లయితే, ఇరు దేశాల మధ్యన మైత్రి సంబంధాలున్న (1947-1957 మధ్యన) కాలంలోనే ఆ సమస్య పరిష్కారం అయ్యేది. కాని నెహ్రూ ప్రభుత్వం చైనాతో యుద్ధానికి తలపడే మార్గాన్నే ఎంచుకున్నది.

ప్రస్తుతం యుపిఎ ప్రభుత్వంలోని సీనియర్ నాయకులు కూడా సరిహద్దుల్లో జరుగుతున్న చిన్న చిన్న సంఘర్షణలపై రెచ్చగొట్టే వ్యాఖ్యలు చేస్తూ ఆ వివాదాలకు విస్తృతమైన ప్రచారాన్ని కల్పిస్తున్నారు. వివాదాల పరిష్కారానికి ఎటువంటి నిర్దిష్టమైన చర్యలు తీసుకోకుండా, అవి తీవ్రరూపం తీసుకొని, ప్రముఖంగా ప్రచారంలో ఉండడమే వారి లక్ష్యం. భారత ప్రభుత్వాల ఈ వైఖరి ఫలితంగానే, ఇరు దేశాల ప్రత్యేక ప్రతినిధుల మధ్య గత పది సంవత్సరాల్లో పదిహేనుసార్లు చర్చలు జరిపినప్పటికీ సరిహద్దు సమస్యను పరిష్కరించలేకపోయారు.

వీటన్నిటి బట్టి చూస్తే, సరిహద్దు వివాదాన్ని ఒక సాకుగా చూపెట్టి

భారత – చైనా సంబంధాలు నిజమైన అర్థంలో అభివృద్ధి కాకుండా చూడడమే యుపిఎ ప్రభుత్వ లక్ష్యమనేది స్పష్టమవుతోంది.

ఈ మధ్యన (ఏప్రిల్ 15 నుండి మే 5) సరిహద్దు ప్రాంతంలో జరిగిన సంఘటనలు కూడా పై విషయాన్నే స్పష్టం చేస్తున్నాయి. భారత విదేశాంగ మంత్రి ఖుర్షీద్ చైనా దేశ పర్యటనను ముగించుకొని భారతదేశం చేరుకున్న రోజునే రక్షణ మంత్రి ఆంటోని విలేకరుల సమావేశంలో 'సరిహద్దు ప్రాంతాల్లోని మన స్వంత భూభాగాల్లో మన సైన్యం, వైమానిక దళాలు తమ శక్తి సామర్థ్యాలను పెంపొందించు కుంటున్నాయి. ఈ క్రమం ఇక ముందు కూడా కొనసాగుతుంది' అని ప్రకటించారు.

ఇటీవల చైనాతో సరిహద్దులో వచ్చిన వివాదాన్ని దృష్టిలో పెట్టుకొని ఆయన 'పక్క దేశాలతో సమస్యలు పరిష్కరించుకోవడానికి భారతదేశానికి బాగా నెలకొల్పబడిన పద్ధతులు ఉన్నాయి' అని అన్నారు (హిందూ, 12 మే 2013). ఆంటోని ప్రకటనలో ఇతర విషయాలతో పాటు మూడు ముఖ్యమైన అంశాలు ఉన్నాయి.

1962 భారత – చైనా యుద్ధం, ఆ తర్వాత పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధాల వలన భారత ప్రభుత్వాలు తమ రక్షణ రంగ బడ్జెట్‌ను విపరీతంగా పెంచుకుంటూ వస్తున్నాయి. బడ్జెట్‌లో అది కనీసం 20 శాతం దాకా ఉంటోంది. (ప్రభుత్వ లెక్కలు దానిని తగ్గించి చూపుతాయి). అది ప్రజలపైన ఒక మోయలేని అనవసర భారంగా ఉంటోంది. ఇరుగు పొరుగు దేశాలతో ఉన్న వివాదాలను శాంతియుతంగా చర్చల ద్వారా పరిష్కరించుకుంటే, వాటితో వివాదాలు రాకుండా చూసుకుంటే ఇప్పుడున్నటు వంటి భారీ స్థాయిలో రక్షణ రంగ బడ్జెట్‌లు అవసరం ఉండదు. సైనిక వ్యయాన్ని కనీసానికి తగ్గించి, ఆ విధంగా మిగిలే ధనాన్ని దేశ అభివృద్ధి కోసం, ప్రజల ప్రయోజనాల కోసం ఖర్చు పెట్టవచ్చును. కానీ ఆంటోని పై ప్రకటనలో సరిహద్దు ప్రాంతంలో 'మిలిటరీ తమ శక్తి సామర్థ్యాలను పెంపొందించుకొంటుంది. ఈ క్రమం ముందు కూడా కొనసాగుతుంద'ని ప్రకటించడాన్ని బట్టి రక్షణ వ్యయాన్ని నిరంతరం పెద్ద ఎత్తున పెంచుకొంటూనే పోతారు గాని తగ్గించరని స్పష్టమవుతోంది.

ఆంటోని ప్రకటనలో గమనించవలసిన రెండవ విషయం, 'సరిహద్దు ప్రాంతాల్లోని మన స్వంత భూభాగాల్లోనే మన సైన్యం తన శక్తి సామర్థ్యాలను పెంపొందించుకొంటోంది' అనేది. భారత, చైనా దేశాల మధ్య పరస్పర ఆమోదంతో నిర్ణయించుకున్న సరిహద్దులు లేవనీ, వాటి పైన రెండు విభిన్నమైన వైఖరులు ఉన్నాయనే విషయం స్పష్టమే. అలాంటప్పుడు వివాదాస్పద సరిహద్దులో సైనిక నిర్మాణాలను, కట్టడా లను భారత ప్రభుత్వం నిర్మించడం ఏ విధంగా సరైనదవుతుంది? ఒక పక్క సరిహద్దులపై వివాదం ఉందని అంగీకరిస్తూనే వాటిని మన 'స్వంత ప్రాంతాల'ని ప్రకటించడం పరస్పర విరుద్ధంగా ఉందనేది స్పష్టమే.

ఇక పై ప్రకటనలోని మరో ముఖ్యమైన విషయం – 'పక్క దేశాలతో సమస్యలు పరిష్కరించుకోవడానికి భారతదేశానికి 'బాగా నెలకొల్పబడిన' పద్ధతులున్నాయనేది. ఏమిటి ఆ బాగా నెలకొల్పబడిన పద్ధతులు? పక్క దేశాల్లోని ఆంతరంగిక సమస్యల్లో జోక్యం చేసుకొని ఆ దేశాన్ని చీల్చడం (పాకిస్తాన్, బంగ్లాదేశ్), పక్క దేశంలోకి ఏదో సాకుతో మన సైన్యాన్ని పంపించడం (శ్రీలంక), పక్కన ఉన్న చిన్న రాజ్యాన్ని భారతదేశంలో కలిపివేసుకోవడం (సిక్కిం), వారితో అసమాన ఒప్పందాలు చేసుకొని వారి ఆంతరంగిక సమస్యల్లో తలదూర్చడం (నేపాల్), దక్షిణాసియా దేశాలపై తనకు 'సహజమైన హక్కు' ఉన్నదనీ, తాము చెప్పినట్లుగానే వారు నడుచుకోవాలనీ ఆదేశించడం (మాల్దీవులు చైనాతో సంబంధాలు పెట్టుకోవడాన్ని వ్యతిరేకించడం), ఇక పాకిస్తాన్ పైన నిరంతరం జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టడం – ఇవే కదా భారత ప్రభుత్వపు బాగా నెలకొల్పబడిన ఆ పద్ధతులు?'

ఇవన్నీ కూడా భారత పాలకులు గత అరవై ఐదు సంవత్సరాలుగా అనుసరిస్తూ వస్తున్న కల్తీలేని ప్రాంతీయ ఆధిపత్యవాద, జోక్యందారీ, విస్తరణవాద విధానాలే తప్ప మరేమీ కావనేది స్పష్టమే. ఈ వివాదాల వల్లనే ఏ ఒక్క ఇరుగు పొరుగు దేశాలతోనూ మిత్రుత్వ సంబంధాలు అభివృద్ధి కాలేదు. భారత పాలకులు ఈ విధానాలను కొనసాగించినంత కాలం పరిస్థితులు ఇదే విధంగానే కొనసాగుతూ ఉంటాయి.

అందువలన భారత పాలకులు దేశాన్ని అప్రతిష్టపాలు చేసిన పై పద్ధతులను వదిలి వేయాలి. ఇరుగు పొరుగు దేశాలతో స్నేహ, సహకార సంబంధాలను అభివృద్ధి చేసుకోవడం కోసం కృషి చేయాలి. అది జరగాలంటే భారత ప్రభుత్వం అమెరికా అగ్రరాజ్య ప్రాబల్యం నుండి బయటకు రావాలి. వారితో చేసుకున్న, దేశ ప్రయోజనాలకు విరుద్ధమైన అసమాన ఒప్పందాలన్నింటినీ రద్దు చేసుకోవాలి. తద్వారా స్వతంత్రమైన రక్షణ, విదేశాంగ విధానాలను అమలు జరపాలి. చైనాతో నిజమైన సాధారణ, స్నేహ సంబంధాలను అభివృద్ధి చేసుకోవాలి. దానిలో భాగంగా ఆ దేశంతో ఉన్న సరిహద్దు సమస్యలను వెంటనే పరిష్కరించుకోవడానికి నిర్దిష్టమైన చర్యలను ప్రారంభించాలి. భారత – చైనా దేశాల మధ్య 2005 ఏప్రిల్‌లో కుదిరిన ఒప్పందంలోని మార్గదర్శక సూత్రాలలోని ఆర్టికల్ ఒకటిలో ఈ విధంగా పేర్కొన్నారు.

'శాంతియుతమైన, స్నేహపూర్వకమైన సంప్రదింపుల ద్వారా ఇరు పక్షాలు కూడా సరిహద్దు సమస్యను పరిష్కరించుకుంటాయి'. 'సరిహద్దు సమస్యపై తమ తమ వైఖరులలో పరస్పర ఆమోదయోగ్యంగా ఉండే అర్థవంతమైన సర్దుబాట్లు చేసుకోవడం ద్వారా ఇటువంటి ఒప్పందాన్ని సాధించాలని' మార్గదర్శక సూత్రాల్లోని ఆర్టికల్ 3 నిర్దేశిస్తోంది. ఆ ఒప్పందం అనేది తుది నిర్ణయం గానూ, సరిహద్దుల్లోని అన్ని విభాగాలకు (సెక్టార్లకు) వర్తించేదిగానూ ఉండాలని కూడా పై ఆర్టికల్ పేర్కొన్నది. సరిహద్దు సమస్య పరిష్కారానికి ఇరు దేశాలు కూడా పై ఒప్పందాన్ని, ఆ ఒప్పందంలోని మార్గదర్శక సూత్రాలను ప్రాతిపదికగా చేసుకోవాలి.

'దాని ద్వారా చారిత్రక ఆధారాలు, పత్రాల ఆధారాలు, వాటితో పాటుగా సాంప్రదాయికంగా వస్తున్న పద్ధతుల ఆధారంగా చేసుకొన్నట్లయితే, ఉభయ పక్షాలకు ఆమోదయోగ్యమైన కొన్ని సర్దుబాట్లతో ప్రస్తుత వాస్తవాధీన రేఖను (ఎల్‌ఒసి) పరిష్కారానికి ప్రాతిపదికగా చేయాలి. ఇది కాక భారత పక్షానికి అనుకూలంగా ఉండే మరో పరిష్కారమేది ఉండజాలదు.' (దేవులపల్లి వెంకటేశ్వరరావు వ్యాసం – చైనాతో సాధారణ సంబంధాల ఏర్పాటు, అక్టోబర్ 1978)

భారత రక్షణ, విదేశాంగ విధానాలను అమెరికా అగ్రరాజ్య రథచక్రాలకు కట్టిపడివేసిన ప్రస్తుత భారత పాలకులు పై విధమైన చర్యలు చేపడతారని ఆశించడంలో అర్థం లేదు. అమెరికా అగ్రరాజ్యంతో కుదుర్చుకున్న అసమాన ఒప్పంధాలన్నింటిని రద్దు చేసుకొని, భారత ప్రభుత్వం స్వతంత్ర విదేశాంగ విధానాన్ని అనుసరించాలనే డిమాండ్‌తో దేశంలో ఒక బలమైన ప్రజా ఉద్యమాన్ని (మాస్ క్యాంపెయిన్) నిర్మించాలి. ఆ ఉద్యమంలో నిజమైన దేశభక్తియుత శక్తులను, ప్రజాతంత్ర శక్తులను, విప్లవ శక్తులను భాగం చేయాలి. చైనాతో సాధారణ, స్నేహ సంబంధాల అభివృద్ధి ద్వారా ప్రయోజనాన్ని ఆశించే పెట్టుబడిదారుల్లోని ఒక భాగం కూడా దానికి మద్దతు ప్రకటించే అవకాశం ఉంటుంది.

అలాంటి బలమైన ఉద్యమం ద్వారా చైనాతో సరిహద్దు సమస్యతో పాటుగా ఇతర సమస్యలను కూడా పరిష్కరించుకొనేట్లుగా ప్రభుత్వంపై ఒత్తిడిని పెంచాలి. చైనాతో మైత్రి సంబంధాల అభివృద్ధి భారతదేశ ప్రయోజనాలకు, ప్రజల ప్రయోజనాలకు అనుకూలమైనదనే విషయాన్ని అర్థం చేసుకొని దాని కోసం కృషి చేయాలి.

*(రచయిత 'పోరు నేల' ప్రచురణ సంస్థ సంపాదకులు)* వీ

# మన దుస్తులకు అంటిన రక్తం, కన్నీళ్లు

*ప్రపంచ మార్కెట్‌ను శాసిస్తున్న వస్త్ర వ్యాపారుల, తయారీదారుల లాభాపేక్ష బంగ్లాదేశ్ కార్మికుల జీవితాలను సజీవ సమాధి చేస్తోందని అంటున్నారు* **సి. రాజశేఖర్**

**2013,** ఏప్రిల్ 24 బంగ్లాదేశ్‌లో, వేలాది మంది పేద కార్మికుల జీవితాల్లో బీభత్సం సృష్టించిన రోజు. వెయ్యి మందికి పైగా సజీవ సమాధి అయిన రోజు. అది మొదటి సారీ కాదు, ఆఖరిదీ కాదు. బంగ్లాదేశ్ కార్మిక జీవితాల్లో ఒకానొక చీకటి రోజు.

ఢాకాలోని రాణా ప్లాజా అనే ఎనిమిది అంతస్తుల సముదాయంలో ఐదు వస్త్ర పరిశ్రమలు పనిచేస్తున్నాయి. మూడు వేల మందికి పైగా కార్మికులు పనిచేస్తుంటారు. అందులో అత్యధిక భాగం మహిళలు. కడు పేదరికంలో మగ్గుతున్న వారు. నెలకు మూడు వేల నుంచి ఐదు వేల రూపాయలకు జీతం ఉన్నవారు. వెట్టి, బానిస బతుకులు. దారుణమైన పని పరిస్థితులు, తక్కువ జీతాలు (అవి కూడా సరైన సమయానికి ఇవ్వకపోవడం, రెండు మూడు నెలలకు ఒకసారి ఇవ్వడం), శారీరక, మానసిక హింస, అవమానాలు భరిస్తూ పనిచేస్తున్నారు. కాని అక్కడ తయారయ్యేవి ప్రపంచంలోని కార్పొరేట్ చాంపియన్ అయిన వాల్‌మార్ట్ లాంటి బహుళజాతి సంస్థల ప్రముఖ బ్రాండ్ వస్త్రాలు.

రాణా ప్లాజా యజమాని సోహేల్ రాణా అధికార పార్టీ నాయకుడు. అతనిపై ఎన్నో హత్యానేరారోపణలు, మత్తు పదార్థాల స్మగ్లింగ్ ఆరోపణలు ఉన్నాయి. రాణా ప్లాజా కట్టడమే అవినీతికి నిలయం. సరైన డిజైన్ కానీ, అనుమతి కానీ లేకుండా కట్టబడింది. కనీస సౌకర్యాలు కూడా కల్పించలేదు. ఎలాంటి అగ్ని ప్రమాదాలు సంభవించినా రక్షించగలిగే పరికరాలు లేవు.

నేడు ప్రపంచమంతా బ్రాండ్ దుస్తుల కోసం ఎగబడుతున్న కాలం. ఈ బ్రాండ్ దుస్తుల తయారీలో లక్షల బతుకులు ఛిద్రమవుతున్నాయి. బ్రాండ్ కంపెనీల రెడీమేడ్ దుస్తుల ఎగుమతుల్లో చైనా తరువాత బంగ్లాదేశ్ రెండో స్థానంలో ఉంది. దాదాపు నాలుగు వేల వస్త్ర పరిశ్రమల్లో నలభై లక్షల మందికి పైగా కార్మికులు పనిచేస్తున్నారు. బంగ్లాదేశ్ ఎగుమతుల్లో 80 శాతం వీరి వాటానే. 1980లో ఈ రెడీమేడ్ దుస్తుల ఎగుమతి 4 శాతం నుంచి ఇప్పటికి అది 80 శాతానికి పెరిగింది. అందుకే ప్రభుత్వం బ్రాండ్ కంపెనీలను కాపాడడానికి కార్మికుల జీవితాలను ఫణంగా పెడుతోంది.

పరిశ్రమల్లో నాణ్యతా ప్రమాణాలు, కార్మికుల స్థితిగతులను పర్యవేక్షించడానికి బంగ్లాదేశ్ వస్త్ర ఉత్పత్తి, ఎగుమతి దారుల అసోసియేషన్ (బిజిఎంఇఎ) ఉంది. కాని, ఇది వ్యాపారుల, ప్రభుత్వ అధికారుల గొడుగు సమాఖ్య. ఈ అసోసియేషన్‌లో ముఖ్యపాత్రధారులు మంత్రులు, ఎంపిలు, అధికార, ప్రతిపక్ష పార్టీ ప్రముఖులు, పోలీసు అధికారులు, మీడియా ప్రతినిధులు. వీరి చేతుల్లో సంపద, అధికారం పోగుపడి ఉంది. వీరు కార్మికుల పక్షాన నిలబడడం కాకుండా, బహుళజాతి సంస్థలకు అండగా ఉంటారు. ప్రభుత్వంలో ఉన్నవారి కర్తవ్యం ఈ పరిశ్రమలకు వచ్చే ఈ బ్రాండ్ కంపెనీల ఆర్డర్లను కాపాడడం. వాటి కోసం ఎంత మంది కార్మికులు బలి అయినా సరే.

ఈ పరిశ్రమల్లో ప్రపంచంలోనే ప్రసిద్ధిపొందిన ప్రముఖమైన రెడీమేడ్ దుస్తులు తయారవుతాయి. ప్రైమార్క్ (బ్రిటన్), కార్రిఫోర్ (ఫ్రాన్స్), మ్యాంగో (స్పెయిన్), బెనెటన్ (ఇటలీ), లోబ్లా (కెనడా), ప్రపంచ కార్పొరేట్ చాంపియన్ వాల్‌మార్ట్ (అమెరికా) లాంటి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కంపెనీల రెడీమేడ్ దుస్తుల లేబుళ్లు రాణా ప్లాజా శిథిలాల కింద దొరికాయి.

బంగ్లాదేశ్ అనే కాకుండా మూడో ప్రపంచ దేశాల్లో ప్రముఖ ఆదాయ వనరు అయిన వ్యవసాయాన్ని సామ్రాజ్యవాద దేశాలు ధ్వంసం చేశాయి. ఆ రంగంలో ఉపాధి పొందుతున్న లక్షలాది మంది రైతులకు, వ్యవసాయ అనుబంధ వృత్తులపై ఆధారపడ్డవారికి ఉపాధి లేకుండా చేశాయి. ఈ నేపథ్యంలో గ్రామీణ ప్రాంతాల నుంచి ఉపాధి వెతుక్కుంటూ పట్టణాలకు వలసలు ఎక్కువయ్యాయి. ఒక అంచనా ప్రకారం బంగ్లాదేశ్‌లో ప్రతి మూడు నిమిషాలకు ఒక కుటుంబం గ్రామాల నుంచి పట్టణాలకు వలస పోతోంది. ఈ లెక్కన ఎన్ని లక్షల కుటుంబాలు పట్టణాలకు చేరాయో అంచనా కట్టడం కష్టం.

ఇలా వలస వచ్చిన వారు పెద్ద పెద్ద పట్టణాలలోని మురికివాడలలో అతి హీనమైన, దుర్భరమైన పరిస్థితులలో ఆవాసాలు ఏర్పర్చుకుంటున్నారు. అతి ఇరుకైన, అపరిశుభ్రమైన పరిసరాలలో నివాసం ఉండవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ప్రభుత్వం వీరికి కనీస మౌలిక సౌకర్యాల కల్పన అందించదు. అపరిశుభ్రమైన నీరు, నిత్యం పారే మురికికాలువలు, విద్యుత్ సరఫరా లేని ఆవాసాలలో వీరు బతుకు వెళ్లదీయవలసి వస్తుంది.

రెడీమేడ్ దుస్తుల పరిశ్రమల్లో ఎక్కువగా పనిచేస్తోంది మహిళలే. కాని వారికి సరైన రక్షణ ఉండదు. ఇక్కడ పనిచేస్తున్న మహిళలను కదిపితే ఒక్కొక్కరిది ఒక్కో కథ. ముఖ్యంగా వీరిలో 18 నుంచి 25 సంవత్సరాల వారే అధికం. అవివాహితులు, కొత్తగా పెళ్లయిన వారు, లేదా ఒకరో ఇద్దరో చిన్న పిల్లలు కలవాళ్లు. వారి పని పరిస్థితులు ఎట్లా ఉంటాయంటే, కనీసం మరుగుదొడ్లు కూడా సరైనవి ఉండవు. అపరిశుభ్రంగా, నిత్యం దుర్గంధం వెదజల్లుతూ ఉంటాయి. ఫ్యాక్టరీ యజమానులు వారిని అసభ్యంగా తిడుతూ, కొడుతూ పని చేయిస్తారు. కొన్నిసార్లు వారిని గదిలో పెట్టి బయటికి వెళ్లకుండా గదులకు తాళాలు వేసుకొని వెళ్లిపోతారు. రోజుకు పన్నెండు నుంచి పదిహేను గంటల వరకు పనిచేయించుకుంటారు.

ఇన్ని గంటలు పనిచేసినా వారికి వచ్చే జీతాలు అంతంత మాత్రమే. అవి కూడా యజమానుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటాయి. కొన్నిసార్లు నెలల తరబడి కార్మికులను వారి చుట్టూ తిప్పుకుంటూ కొద్ది కొద్దిగా జీతాలు ఇస్తుంటారు.

గత నవంబర్‌లో బంగ్లాదేశ్‌లోనే టాజ్రీన్ ఫాషన్స్ దుస్తుల ఫ్యాక్టరీలో జరిగిన అగ్ని ప్రమాదంలో వంద మందికి పైగా మరణించారు. రెండు వందల మందికి పైగా గాయపడ్డారు. ఇంత ఎక్కువ మరణాలకు యజమానులు గదులకు తాళాలు వేయడం కూడా ఒక కారణం. కొంత మంది మహిళలు ప్రాణాలు కాపాడుకోవడానికి భవనం పై నుంచి దూకారు. ఈ ప్రయత్నంలో కొంతమంది ప్రాణాలు కోల్పోయారు, మరి కొంతమంది తీవ్రంగా గాయపడ్డారు. చనిపోయిన వారికి గానీ, గాయపడ్డవారికి గానీ ఇంతవరకు ఎటువంటి నష్టపరిహారం కాని, సహాయం కాని అందలేదు. ఇక్కడ కూడా వాల్‌మార్ట్ కంపెనీ దుస్తుల లేబుళ్లు లభించాయి. రాణా ప్లాజా దుర్ఘటన కంటే ముందు కూడా బంగ్లాదేశ్‌లో 2005 నుంచి జరిగిన అగ్ని ప్రమాదాలు, ఇతర ఫ్యాక్టరీ దుర్ఘటనల్లో వెయ్యి మందికి పైగా కార్మికులు మరణించారు.

రాణా ప్లాజా దుర్ఘటన జరిగిన ముందు రోజు భవనంలో పగుళ్లు కనిపించాయి. కాని ఫ్యాక్టరీ యజమానులు ఫ్యాక్టరీలను మూసి వేయడానికి ఒప్పుకోలేదు. కార్మికులను భయపెట్టి పని చేయించారు. ఒక్కరోజు పనికి రాకపోతే వారి జీతంలో నుంచి మూడు రోజుల వేతనం కోత పడుతుంది. రోజూ చచ్చి బతుకుతూ పనిచేసే కార్మికులు ఆ రోజు పనికి వెళ్లి శాశ్వతంగానే ప్రాణాలు విడిచారు.

ప్రపంచ మార్కెట్ కొనుగోలుదారుల మార్కెట్ అయినందున ఎవరు తక్కువ అమ్మితే వారి వద్ద కొనుగోలు చేయడానికి వ్యాపారులు ఎగబడతారు. కొనుగోలుదారులు వచ్చిన ప్రతిసారీ బేరమాడుతారు. దీంతో దుస్తుల తయారీదారులు అధిక లాభాల కోసం, అతి తక్కువ ధరలకు అమ్మడం కోసం తిరిగి ఆ భారాన్ని కార్మికులపైనే మోపుతారు.

ఒక అంచనా ప్రకారం బంగ్లాదేశ్‌లో తయారయ్యే ఒక టీ-షర్ట్ ధర 4.70 డాలర్లు ఉంటే, అదే అమెరికాలో తయారయ్యే టీ-షర్ట్ ధర 13.22 డాలర్లు ఉంటుంది. దానికి ముఖ్యకారణం లేబర్. ఒక్క టీ-షర్ట్ తయారు చేయడానికి బంగ్లాదేశ్‌లో కార్మికుడికి 0.22 డాలర్లు చెల్లిస్తే, అమెరికాలో 7.47 డాలర్లు చెల్లిస్తారు. అంటే 33 రెట్లు అధికం.

దుస్తుల వ్యాపారంలో అంతర్జాతీయ రిటైల్ కొనుగోలుదారులు, అమ్మకందారులు ఖరీదులో 60 నుంచి 80 శాతం వరకు లాభాలు కూడగట్టుకుంటారు. దీనికి వారు అవలంబించేది రెండు పద్ధతులు. 1) ఉత్పత్తి ఖర్చు ఎంత తక్కువ అయితే అంత తక్కువ చేయడం, 2) అమ్మకంలో ఎంత లాభం పొందగలిగితే అంత పొందడం. దీనికి వారు ఎటువంటి నీచపు దిగజారుడు పద్ధతులైనా చేపడతారు. దీని కోసం ఎంత మంది కార్మికులనైనా బలి ఇస్తారు. రాణా ప్లాజాలో జరిగింది కూడా అదే. వ్యాపారుల లాభాపేక్ష, ఉత్పత్తిదారుల అత్యాశ, నిర్లక్ష్యం, క్రూరత్వం బయటపడ్డాయి. పెట్టుబడినీ, లాభాలనూ పెంచుకోవడానికీ, అతి స్వల్పకాలంలోనే ధనవంతులు అయిపోవాలనే ఫ్యాక్టరీ యజమానుల అత్యాశకూ ఈ దుర్ఘటన నిదర్శనం. అండగా నిలవాల్సిన ప్రభుత్వం, కార్మికుల అసోసియేషన్ వ్యాపారుల కొమ్ముకాస్తున్నాయి.

దుర్ఘటన జరిగిన తరువాత కార్మికులు నిరసన చర్యలు చేపట్టారు. వేలాది మంది కార్మికులు నిరసన ప్రదర్శనలు చేపట్టారు. పరిశ్రమలలో పని నిలిపి వేయాలనీ, కనీస వేతనాలు, మెరుగైన పరిస్థితులు కల్పించాలని డిమాండ్ చేశారు. దేశంలోనే పెద్దదైన అశులియా సముదాయాన్ని దిగ్బంధనం చేశారు.

అశులియాలో దాదాపు రెండు వందల దుస్తుల పరిశ్రమలు నడుస్తున్నాయి. నాలుగు లక్షలకు పైగా కార్మికులు రోజూ అక్కడ పనిచేస్తుంటారు. మొత్తం దుస్తుల ఎగుమతుల్లో 20 శాతం అశులియా నుంచే వెళతాయి. బిజిఎంఇఎ అశులియాలోని పరిశ్రమలను నిరవధికంగా మూసివేయడానికి పిలుపునిచ్చింది. కేవలం కార్మికులు నిరసన తెలుపుతున్న చోటనే దాని ప్రభావం కనిపించింది. మిగతా అన్ని ఫ్యాక్టరీలలో పని యథావిధిగా నడుస్తోంది. ఒకవైపు కార్మికులు నిరసన తెలుపుతున్నా యజమానులు అసలు ఏమీ జరగనట్టు పనిలో చేరమని కార్మికులపై ఒత్తిడి తెచ్చారు. పని జరగని రోజుకు వేతనం ఉండదని బెదిరించారు.

నిరసనలతో దిగివచ్చిన ప్రభుత్వం కనీస వేతనాలు, ఫ్యాక్టరీలలో భద్రతా ప్రమాణాలపై సమీక్ష జరిపి నిర్ణయం తీసుకుంటామని హామీ ఇచ్చింది. కాని వ్యాపారుల చేతుల్లో కీలుబొమ్మ అయిన ప్రభుత్వం కార్మికులకు ఇచ్చిన హామీని ఏ మేరకు తీరుస్తుందో కాలమే తేల్చాలి.

ఈ దుర్ఘటన తరువాత బంగ్లాదేశ్ కార్మికుల భద్రతా ప్రమాణాలను మెరుగుపరచడానికి బంగ్లాదేశ్ ఫైర్ అండ్ బిల్డింగ్ సేఫ్టీ ఒప్పందానికి ప్రముఖ బ్రాండ్‌లైన ఎచ్ అండ్ ఎం, జారా, ప్రైమార్క్, టెస్కో, బెనెటన్, మార్క్స్, స్పెన్సర్, నెక్స్ట్,సి అండ్ ఎ, జి స్టార్ తమ ఆమోదం తెలిపాయి.

కాని, వాల్‌మార్ట్ ఈ ఒప్పందానికి అంగీకరించడం లేదు. ప్రపంచంలో ఎక్కడ తక్కువ మానవ శ్రమ దొరుకుతుందా అని అన్వేషిస్తూ గద్దలా వాలే వాల్‌మార్ట్ కంపెనీ దొరికిన వారి రక్తాన్ని పీల్చి పిప్పిచేసి, కోట్లాది డాలర్లను ఆర్జిస్తూ, పెట్టుబడి ఇంకా ఇంకా పెంచుకుంటూ పోతూ ఇట్లాంటి దుర్ఘటనలకు కారణమవుతోంది.

బాంబులు పెట్టి అమాయక ప్రజలను చంపుతున్నారంటూ తీవ్రవాదుల బూచి చూపుతున్న సామ్రాజ్యవాద అగ్రరాజ్యాలు లాభాపేక్షతో కార్మికులనూ, పేద, మధ్యతరగతి రైతాంగాన్నీ పొట్టన పెట్టుకుంటున్న వాల్‌మార్ట్, మోన్‌శాంటో లాంటి కంపెనీలను ఏ తీవ్రవాద జాబితాలో చేరుస్తాయి? వీరి లాభాపేక్ష, అత్యాశ వందలాది ఆటంబాబులై నిత్యం లక్షలాది ప్రాణాలను బలి తీసుకుంటున్నాయి.

దుర్ఘటన నుంచి తప్పించుకున్న వారికి ఇంకా ముప్పు మిగిలే ఉంది. తోటి వారి మరణాన్ని తలుచుకుంటూ ఆ భయానక వాతావరణంలో చుట్టుపక్కల ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు తిరిగి పనులకు వెళ్లడానికి జంకుతున్నారు. కానీ తప్పదు. ఆ భయానక మృత్యుకూపాల్లోకి అడుగు పెట్టాల్సిన తప్పని పరిస్థితి. లేదంటే వారికి వేరే జీవనోపాధి లేదు.

అది మన పొరుగుదేశమే, కాని వారు మన కార్మిక సోదరులు. వారి పక్షాన నిలబడాల్సిన కర్తవ్యం మనముందుంది. ప్రభుత్వంపై తీవ్ర ఒత్తిడి తేవాలి. దాడికి కారకులైన వారికి శిక్షపడేలా చూడాలి. చనిపోయిన వారి కుటుంబాలకూ, తీవ్ర అంగవైకల్యానికి గురైనవారికీ జీవితకాలానికి అవసరమయ్యే నష్టపరిహారం ఇచ్చేలా చెయ్యాలి. కార్మికులకు పని అభద్రతను తొలగించి, పని చేసే స్థలంలో భద్రత, కనీస వేతనభత్యాలు కల్పించాలి. ఈ దుర్ఘటనపై స్వతంత్ర దర్యాప్తుకు ఆదేశించాలి. దీనికి ప్రపంచ కార్మికులంతా ఏకం కావాలి.

*(రచయిత వీక్షణం సబ్ ఎడిటర్)* వీ

# కార్పొరేట్ గుప్పెట్లో ఆదివాసుల హక్కులు

*ఆదివాసులు పోరాడి సాధించుకున్న హక్కులను, చట్టాలను కాపాడాల్సిన ప్రభుత్వాలే వాటిని ఉల్లంఘిస్తూ అడవి ప్రాంతాన్ని కొల్లగొట్టడానికి బహుళజాతి కంపెనీలకు అండగా ఉంటున్నాయని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

దేశ జనాభాలో ఎనిమిది శాతం ఉన్న గిరిజనులు భారతదేశంలో అత్యంత వెనకబాటులో ఉన్న వర్గం. అత్యంత విలువైన సహజ వనరులున్న ప్రాంతాల్లో నివసిస్తున్నప్పటికీ పేదరికమే వారి చిరునామాగా ఉంది. తమ జీవనశైలి, సంస్కృతి, హక్కులకు భంగం కలిగించకుండా– విద్యా, వైద్యం, రవాణా, ఇతర మౌలిక వసతులను కల్పించాలన్న ఆదివాసుల ఆకాంక్షలు అరణ్యరోదనగానే మిగిలిపోతున్నాయి. నిజానికి అధికార మార్పిడి జరిగిన తొలినాళ్లలో ఆదివాసి ప్రాంతాల పాలన, అభివృద్ధి కోసం రాజ్యాంగంలో ప్రత్యేకంగా అయిదో షెడ్యూల్‌ను పొందు పరిచారు. అమాయకులైన ఆదివాసులను దోపిడీ బారినపడకుండా కాపాడి – సామాజికంగా, విద్యాపరంగా, ఆర్థికంగా, రాజకీయంగా వారి సాధికారతకు బాటలు వేయడం సర్కారు బాధ్యత అని సదరు షెడ్యూల్ స్పష్టంగా చెబుతోంది. దాన్ని అర్థం చేసుకుని అమలు చేసే చిత్తశుద్ధి పాలకుల్లో కొరవడినందువల్లే ఆదివాసుల బతుకులు దయనీయంగా మారాయి.

ఆదివాసి నివాస అటవీ ప్రాంతాల్లోనే ఖనిజ సంపద పుష్కలంగా ఉంది. ఆ సంపద అన్వేషణ, వెలికితీతకు గతంలో ప్రభుత్వరంగ సంస్థలకే అధికారం ఉండేది. స్మగ్లర్లు, అటవీ పోలీసు అధికారుల కుమ్మక్కుతో అటవీ సంపద దోపిడీకి గురవుతుండేది. గిరిజనులు సేకరించే అటవీ చిరు ఉత్పత్తులను షావుకారులు నామమాత్రపు రేటుకు కొంటూ గిరిపుత్రులను నిత్య దారిద్ర్యంలోనే ఉంచేవారు. అటు తర్వాత గిరిజన అభివృద్ధి కార్పొరేషన్‌ల ద్వారా మార్కెటింగ్ సౌకర్యాలు కొంత మెరుగైనప్పటికీ దోపిడీ పెద్దగా తగ్గిందిలేదు. ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనా పేరిట ఆదివాసుల జీవనాధారమైన అడవులను, ఖనిజ వనరులను దోచుకొనే ప్రయత్నాలు ముమ్మరం చేశారు. ఫలితంగానే నేడు ఆదివాసి ప్రాంతాలు అశాంతికి నెలవుగా మారాయి. తమను రక్షించాల్సిన ప్రభుత్వాలతోనే తలపడాల్సిన దుస్థితిలో నేడు గిరిజనులు కొట్టుమిట్టాడుతున్నారు.

నిజానికి రాజ్యాంగంలోని అయిదో షెడ్యూల్ ప్రకారం – ఆదివాసులకు వారి భూములపై గల హక్కులకు గట్టి అభయం ఇవ్వాలి. రాష్ట్రపతి 'నోటిఫై' చేసిన ప్రాంతాలు, తెగలు మాత్రమే అయిదో షెడ్యూల్ పరిధిలోకి వస్తాయి. 1950లో భారత రాష్ట్రపతి ఆంధ్రప్రదేశ్, చత్తీస్‌గడ్, గుజరాత్, మహారాష్ట్ర, ఒడిశా, హిమాచల్‌ప్రదేశ్, జార్ఖండ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లలోని గిరిజన ప్రాంతాలను 'నోటిఫై' చేస్తూ వాటిని షెడ్యూల్ ప్రాంతాలుగా ప్రకటించారు. అక్కడ గిరిజనుల సలహా మండళ్ల నిర్ణయాల మేరకే – అభివృద్ధి ప్రణాళికలు, ప్రాజెక్టుల ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. కేంద్ర ప్రభుత్వ ప్రణాళిక నుంచి కేటాయించిన నిధులను సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థల ద్వారా షెడ్యూల్ ప్రాంతాల అభివృద్ధికి ఖర్చు చేయాలి. 'నోటిఫై' చేసిన షెడ్యూల్ గ్రామాలను ఆ హోదా నుంచి తొలగించాలన్నా, కొత్త గ్రామాలను షెడ్యూల్ ప్రాంత జాబితాలో చేర్చాలన్నా ఆ అధికారం రాష్ట్రపతికి మాత్రమే ఉంటుంది. అది రాష్ట్ర గవర్నర్‌ను సంప్రదించాక మాత్రమే నిర్ణయం తీసుకోవాలి. నిర్వహణ పరంగా అవి రాష్ట్రాల్లో భాగం కనుక షెడ్యూల్ ప్రాంతాల్లో శాంతియుత సుపరిపాలన అందించేందుకు గవర్నర్లకు విచక్షణాధికారాలను అప్పగించారు. ఆయా రాష్ట్రాల్లోని గిరిజన శాసనసభ్యులు, గిరిజన సంక్షేమశాఖ ఉన్నతాధికారులతో కూడిన గిరిజన సలహా మండలిని ఎప్పటికప్పుడు గవర్నర్ సంప్రదించాలి. గిరిజన ప్రాంతాల అభివృద్ధిని, రాజ్యాంగ నియమాల ద్వారా సంక్రమించిన హక్కులు, చట్టాలను వర్తింపజేస్తున్న తీరును పర్యవేక్షిస్తుండాలి.

గిరిజన ప్రాంతాలకు ఏదైనా చట్టాన్ని వర్తింపజేసే లేదా మినహాయించే హక్కు రాష్ట్ర గవర్నర్‌కు ఉంటుంది. కేంద్రం లేదా రాష్ట్రం చేసిన చట్టాన్ని గవర్నర్ తన విచక్షణాధికారంతో యథాతథంగా గానీ, సవరణలతో గానీ షెడ్యూల్ ప్రాంతాలకు వర్తింపజేయవచ్చు. ఈ అంశాలపై కోరినప్పుడల్లా రాష్ట్రాల గవర్నర్లు రాష్ట్రపతికి నివేదిక సమర్పించాలి. అడవి బిడ్డలను అభివృద్ధి పరిచే క్రమంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య పరిస్థితులను సమన్వయం చేస్తూ కేంద్ర గిరిజన సంక్షేమశాఖ సరైన చర్యలు తీసుకోవాలి. అయితే రాజ్యాంగపరమైన నిబంధనలను పాలక వర్గాలు ఖాతరు చేయని మూలంగా గిరిజనులకు జరుగుతున్న అన్యాయం అంతా ఇంతా కాదు. లోక్‌సభ, శాసనసభల్లో గిరిజనేతరులదే మెజారిటీ. ఇక్కడ గిరిజన ప్రజాప్రతినిధుల మాట చెల్లుబాటు కావడం అసాధ్యం. ఇలాంటి పరిస్థితిని దృష్టిలో పెట్టుకునే – రాజ్యాంగ రూపకర్తలు రాష్ట్రపతి, గవర్నర్లకు విశిష్ట అధికారాలు కల్పించినా అవి ఏనాడూ ఆచరణలోకి రాలేదు. షెడ్యూల్ ప్రాంతాల్లో అమల్లోకి వచ్చిన పాత చట్టాలను పరిశీలించి – గిరిజనుల సామాజిక, ఆర్థిక, సంస్కృతీ, సాంప్రదాయాలకు అనువుగా ఆయా చట్టాలు ఉన్నాయా అని వాటిని సమీక్షించే బృహత్కార్యానికి ఇప్పటి వరకూ ఏ గవర్నరూ పూనుకోలేదు. రాజ్యాంగబద్ధ కర్తవ్య నిర్వహణలో చిత్తశుద్ధిని ప్రదర్శించి, విచక్షణాధికారాలను వినియోగించిన గవర్నరూ ఒక్కరు సైతం కనిపించకపోబట్టే గిరిజనుల పరిస్థితి నానాటికీ తీసికట్టుగా మారుతోంది.

## కార్పొరేట్ల బినామీ పెత్తనం

షెడ్యూల్డ్ ప్రాంతాల్లో ఆదివాసీల హక్కుల పరిరక్షణకు ప్రత్యేక చట్టాలున్నాయి. ఛత్తీస్‌గఢ్ భూముల నియమావళి, ఆంధ్రప్రదేశ్ 1970 భూసేకరణ చట్టం, మధ్యప్రదేశ్, జార్ఖండ్, ఒడిశా రాష్ట్రాల చట్టాలు గిరిజనుల భూములను గిరిజనేతరులకు బదిలీ చేయడాన్ని నిషేధించాయి. అయితే ఖనిజాలతో సుసంపన్నమైన ప్రాంతాల్లో కార్పొరేట్ సంస్థలు ప్రవేశించక ముందే గిరిజనేతరులు గిరిజన మధ్యవర్తుల ద్వారా భూములను సేకరించిన సందర్భాలున్నాయి. గిరిజనుల భూములను పెద్ద మొత్తంలో తమ ఆధీనంలో ఉంచుకునేందుకు, ఆదివాసీ కార్మికులను మరింతగా అనాథలుగా చేసేందుకు పాలకవర్గాలు సాధారణంగా బినామీ లావాదేవీలను ఉపయోగిస్తున్నారు. నయా ఉదారవాద వ్యవస్థలో బినామీ అంశం నూతన ప్రాధాన్యతను సంతరించుకుంది. మైనింగ్ రంగాన్ని ప్రైవేటీకరించడంతో మౌలిక వసతుల కార్పొరేట్ సంస్థలు గిరిజన ప్రాంతాల్లో తమ కార్యకలాపాలను ఆదివాసీ ప్రాంతాలకు విస్తరించాయి. అవి అవసరమైన భూసేకరణ పద్ధతులు, అటవీ, పర్యావరణ అనుమతుల కోసం ఎదురు చూడకుండా తమ ప్రాజెక్టులను ప్రారంభిస్తున్నందున ఈ లావాదేవీలన్నీ స్వభావరీత్యా చట్టబద్ధమైనవి కావు. చత్తీస్‌గడ్‌లోని విద్యుత్ కంపెనీలు సాధారణ ప్రక్రియలను దాటవేస్తూ ప్రాజెక్టు పనులను త్వరితగతిన చేపట్టేందుకు బినామీ లావాదేవీలను నిర్వహిస్తున్నట్లు డౌన్ టు ఎర్త్ (సైన్స్, పర్యావరణ కేంద్రం ప్రచురించే ఒక పత్రిక) పేర్కొంది. అవంతా గ్రూప్ కంపెనీలు విద్యుత్ ప్రాజెక్టును నెలకొల్పేందుకుగాను 358 హెక్టార్ల భూసేకరణ జరిపేందుకు ప్రభుత్వానికి ప్రతిపాదనలు సమర్పించడానికి ముందే ప్రాజెక్టు పనులను ప్రారంభించాయి. ఇది చత్తీస్‌గడ్‌లో ఒక విద్యుత్ ప్రాజెక్టు వ్యవహారం మాత్రమే. రాష్ట్రంలో ఇది కాకుండా మరో 70 బొగ్గు ఆధారిత థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులు ఖనిజ వనరులు పుష్కలంగా ఉన్న ప్రాంతాల్లో వస్తున్నాయి. అనేక పారిశ్రామిక సంస్థలు ఈ ప్రాజెక్టుల నుంచి ప్రయోజనం పొందేందుకు ప్రయత్నిస్తున్నాయి. అవి గిరిజన సేవకుల పేరుతో లేదా అవి నియమించే గార్డుల పేరుతో లేదా గుర్తు తెలియని గిరిజన ప్రజల పేరుతో అవి భూములను కొనుగోలు చేశాయి.

బినామీ లావాదేవీలు ఒక్క చత్తీస్‌గడ్ రాష్ట్రానికే పరిమితం కాలేదు. మధ్యప్రదేశ్‌లో బినామీ భూ ఒప్పందాల ద్వారా అక్రమ మైనింగ్ కార్యకలాపాలకు పునాదులు పడ్డాయి. బేతుల్ జిల్లాలోని సాత్పురా అటవీ హక్కుల చట్టం కింద గిరిజనులకు సాగుకోసం మంజూరు చేసిన పట్టా భూముల్లో అక్రమ మైనింగ్ కార్యకలాపాలు నిర్వహించినట్లు తెహెల్కా పత్రిక నిర్వహించిన అధ్యయనంలో వెల్లడైంది. వ్యవసాయం చేసేందుకు అడవుల్లో గిరిజనులు హక్కులు పొందిన భూముల్లో మైనింగ్ కంపెనీలు అక్రమ మైనింగ్ నిర్వహిస్తున్నాయి. ఇటువంటి అక్రమ మైనింగ్ కార్యకలాపాలు ఆంధ్రప్రదేశ్‌లో కూడా విస్తృతంగా జరుగుతున్నాయి. అరకు లోయలోని గిరిజన రైతుల భూముల్లో బాక్సైట్ మైనింగ్ జరుగుతున్నట్లు హైదరాబాద్‌లోని ఆర్థిక, సామాజిక అధ్యయనాల కేంద్రం తెలియజేసింది. అనేక సందర్భాల్లో ఆంధ్రప్రదేశ్ ఖనిజాభివృద్ధి కార్పొరేషన్ ప్రైవేటు కంపెనీలకు మధ్యవర్తిగా వ్యవహరించి చిన్న రైతుల నుంచి భూమిని సేకరిస్తోంది.

## గిరిజన మధ్యవర్తులు - కార్పొరేట్లు

బినామీ లావాదేవీలు సాధారణంగా కంపెనీ, భూమి యజమానులకు మధ్య చోటుచేసుకోనందున కార్పొరేట్ చొరబాటు పద్ధతులు గిరిజన సమాజాలపై తీవ్ర ప్రభావం చూపాయి. అనేక గిరిజన కుటుంబాల నుంచి భూములను కొనుగోలు చేసేందుకు కంపెనీలు ఆ గ్రామంలోని పెద్దలు లేదా ప్రధాన గిరిజన పౌరులను సాధారణంగా ఉపయోగించు కుంటాయి. అవి ఈ గిరిజన మధ్యవర్తులకు డబ్బు అందజేయడం ద్వారా ఆ భూములను కొనుగోలు చేయించి తరువాత తమ ప్రాజెక్టుల నిర్మాణానికి వారి నుంచి ఆ భూములను లీజుకు తీసుకుంటాయి. చత్తీస్‌గడ్ హోంమంత్రి కుమారుడు సందీప్ కున్వర్ అనేక గిరిజన కుటుంబాలకు చెందిన భూములను విద్యుత్ కంపెనీ కోసం కొనుగోలు చేశాడు. రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించిన అమ్మకం ధరలో మూడవ వంతు మొత్తానికి ఆ భూములను కొనుగోలు చేశాడు. రాష్ట్ర ప్రభుత్వం ప్రజా ప్రయోజనాల నిమిత్తం ఆ భూమిని సేకరిస్తే పొందే మొత్తం కంటే గిరిజన యజమానులు బాగా తక్కువ మొత్తాన్ని పొందారు. మధ్యవర్తులకు ఉన్నత స్థాయి రాజకీయ నాయకులతో సంబంధాలుంటాయి. చత్తీస్‌గడ్ లోని జాంజ్గీర్ ఛంపా గ్రామంలో ఒక గిరిజన పెద్ద పన్నెండు గిరిజన కుటుంబాల నుండి వీడియోకాన్ కంపెనీ కోసం రూ. 3.36 కోట్లకు భూములను కొనుగోలు చేశాడు. ఈ భూమిని కొనుగోలు చేసేందుకు అవసరమైన డబ్బు అతడి వద్ద లేదని ప్రత్యేకంగా పేర్కొనాల్సిన అవసరం లేదు. కార్పొరేట్ సంస్థ ఆ మొత్తాన్ని చెల్లించింది. ఈ విధంగా భూమిని లీజుకు తీసుకునే ప్రక్రియ రెండు దశల్లో జరుగుతుంది. తొలుత గిరిజన మధ్యవర్తులను గుర్తిస్తారు. వారు కంపెనీ తరపున భూమిని కొనుగోలు చేస్తారు. మధ్యవర్తులు సాధారణంగా గ్రామ పెద్దలు, అక్కడ ఏర్పాటు చేయబోయే కంపెనీలో షేర్లు, ఇతర ప్రయోజనాలు కలిగిన రాజకీయ సంబంధాలున్న కుటుంబాలకు చెందినవారై ఉంటారు.

మధ్యప్రదేశ్‌లోని కాంగ్రెస్, బిజెపి ఎమ్మెల్యేల కుటుంబాలకు ఖనిజ వనరులు పుష్కలంగా ఉన్న సెహోర్, బేతుల్ వంటి ప్రాంతాల్లో అక్రమ మైనింగ్‌కు పాల్పడుతున్న అనేక కంపెనీలున్నట్లు తెహెల్కా పత్రిక సాక్ష్యాధారాలతో బయటపెట్టింది. ఈ కంపెనీలు మధ్యవర్తులకు (వీరిలో ఎక్కువ మంది గిరిజనులే) డబ్బు చెల్లిస్తాయి. వారు భూమి యజమానులకు హెక్టారుకు లక్ష రూపాయల చొప్పున చెల్లించి దాన్ని లీజుకు తీసుకుంటారు. ఈ భూముల్లో ఎక్కువ భాగం అటవీ హక్కుల చట్టం కింద పంపిణీ చేసిన పట్టాభూములే. ఇది స్పష్టంగా చట్ట ఉల్లంఘనే అవుతుంది. ఆ విధంగా కంపెనీలు భూమి మార్కెట్‌లో గిరిజనులను ప్రవేశ పెడుతున్నాయి. ఇది పూర్తిగా కొత్త పరిణామం. రాజకీయంగా శక్తివంతులైన వారు మాత్రమే కాకుండా సాధారణ గిరిజన కుటుంబాలకు కూడా ప్రమేయం కల్పిస్తారు. గ్రామాల్లో సంపన్నులైన భూముల యజమానులకు కూడా ఇందులో పాత్ర కల్పిస్తారు.

ఈ దళారి వర్గం ఆవిర్భావంతో గిరిజన ప్రాంతాల్లో నూతన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఈ వర్గ విభజన గిరిజన కార్మికులు తమ హక్కులను పరిరక్షించుకునేందుకు సంఘటితంగా పోరాటం చేయడం అనివార్యం చేస్తోంది. ఇది ముఖ్యంగా గిరిజనులు వ్యవసాయం చేసుకునేందుకు పట్టాలు పొందుతున్న ప్రాంతాలకు మరింత ఎక్కువగా

వర్తిస్తుంది. అదే సమయంలో ఆదివాసీ ప్రాంతాలను కార్పొరేట్ సంస్థలకు అప్పజెప్పేందుకు అవకాశం కల్పించే భూసేకరణ చట్టంపై కూడా పోరాటం చేయడం ముఖ్యం. గిరిజనుల హక్కులను పరిరక్షించేందుకు, బినామీ లావాదేవీలను నిరోధించేందుకు, ఆ భూములు సక్రమంగా ఉపయోగపడేందుకు ప్రస్తుతం అమలులో ఉన్న రాష్ట్రాల చట్టాలను పటిష్టం చెయ్యాలి. భూ సేకరణలో సమాంతర వ్యవస్థను నెలకొల్పుతున్న అక్రమ కార్పొరేట్ విధానాలను అరికట్టేందుకు చర్యలు తీసుకోవాలి. అటువంటి అక్రమ విధానాలకు పాల్పడే కంపెనీలపై చర్యలు తీసుకునే విధంగా పటిష్టమైన భూసేకరణ చట్టాన్ని తీసుకురావాల్సిన అవసరముంది.

1950లో 'నోటిఫై' చేసిన గిరిజన ప్రాంతాలే నేటికీ అయిదో షెడ్యూల్ పరిధిలో ఉన్నాయి. ఆనాడు పరిమిత యంత్రాంగం సాయంతో పరిశీలించి ఈ ప్రాంతాలను గుర్తించారు. ఈ జాబితాలో చాలా గిరిజన గ్రామాలకు చోటు లేకుండా పోయింది. అడవితో మమేకమై పూర్తిగా గిరిజనులే నివసిస్తున్న అనేక గ్రామాలకు షెడ్యూల్ హోదా ఇద్దామన్న తలంపు ఆ తరవాత మన పాలకుల్లో తలెత్తనే లేదు. ప్రత్యేక హక్కులు, చట్టాలు వర్తించే షెడ్యూల్ ప్రాంత హోదా ఉన్నా బాక్సైట్ గనుల ప్రాంతంలో అడుగడుగున అక్రమాలు చోటు చేసుకున్నా గిరిజన సలహా మండలిగానీ, గవర్నర్‌గానీ జోక్యం చేసుకున్న పాపాన పోలేదు. 'పీసా', భూబదలాయింపు చట్టం, సుప్రీంకోర్టు ఇచ్చిన 'సమత' తీర్పులను అధిగమించి దొడ్డిదారిన దోచిపెట్టేందుకు రాష్ట్రప్రభుత్వమే ముందుకు వచ్చింది. 'ఏపిఎండిసి'ని బినామీగా మార్చి ఖనిజ నిక్షేపాలను కొల్లగొట్టే ప్రయత్నాలకు శతదా సహకరించింది. మన రాష్ట్రంలోనే తొమ్మిది జిల్లాల పరిధిలో సుమారు 800 గిరిజన గ్రామాలు షెడ్యూల్ ప్రాంత హోదా కోసం ఎదురుచూస్తున్నాయి. శ్రీకాకుళం జిల్లా కన్నెధార కొండలు, తూర్పుగోదావరి జిల్లా వంతాడ, ఆవెల్తి ప్రాంతాల్లో నాగుల కొండల్లో గనుల దోపిడీకి... గిరిజన బతుకుల విధ్వంసానికి కారణం ఆయా ప్రాంతాలకు షెడ్యూల్ ప్రాంత హోదా లేకపోవడం కూడా కారణమే అవుతుంది.

మన రాష్ట్రంలో గిరిజనేతరులు భూములు కొనుగోలు చేయకుండా భూబదలాయింపు చట్టం (1ఆఫ్70),బయటివారి దోపిడీని నిలువరించే వడ్డీ నియంత్రణ చట్టాలు ఆ ప్రాంతాల్లో అడవి బిడ్డలకు రక్షణగా రూపొందించారు. గిరిజనులు సుదూరంలోని న్యాయస్థానాలను ఆశ్రయించే కష్టం లేకుండా వారి ప్రాంతాల్లో రెవెన్యూ అధికారులే వివాదాలు పరిష్కరించగల వెసులుబాటు కల్పించారు. 'నోటిఫై' చేసిన గిరిజన ప్రాంతాల్లో ప్రభుత్వ శాఖలో కిందిస్థాయి ఉద్యోగావకాశాలన్నీ అడవిబిడ్డలకే రిజర్వు చేస్తూ ప్రభుత్వ ఉత్తర్వు (జిఒ-3) వెలువడింది.

ఆంధ్రప్రదేశ్ గవర్నర్ నరసింహన్ తన పరిధిలోని రాజ్యాంగ నియమాలను బొత్తిగా విస్మరించారు. కాబట్టే - రంగంలోకి దిగి తన అధికారాలను ఉపయోగించాల్సి వచ్చిందని కేంద్రమంత్రి కిశోర్ చంద్రదేవ్ కొంత కాలం క్రితం బద్దలుకొట్టి మరీ చెప్పారు. రాజ్యాంగ నియమాలకు సంబంధించి గవర్నర్ల వ్యవహార సరళిపై ఆయన వ్యక్తం చేసిన అసంతృప్తిలో సహేతుకత ఉంది. నిరుడు అక్టోబర్‌లో రాష్ట్రాల గవర్నర్లు, సీనియర్ అధికారులతో కిశోర్ చంద్రదేవ్ గిరిజన ప్రాంతాల్లో గవర్నర్ల పాత్రపై కీలక సదస్సు ఒకటి నిర్వహించారు. ఆ సదస్సులో రాజ్యాంగ నిబంధనల మేరకు గిరిజనులకు దఖలుపడ్డ హక్కులు, చట్టాలను వారికి వర్తింపజేయడంలో జరుగుతున్న అన్యాయాన్ని కేంద్ర మంత్రి గవర్నర్లకు కూలంకషంగా వివరించారు. గవర్నర్లు కీలక రాజ్యాంగబద్ధ కర్తవ్యాలను సరిగ్గా నిర్వర్తిస్తేనే గిరిజన ప్రాంతాల్లో సవాళ్లను ఎదుర్కోవడం సాధ్యమని సూచించారు. స్వయం పాలనాధికారం (పిసా చట్టం), అటవీ హక్కుల గుర్తింపు చట్టాలను పటిష్టంగా అమలు చేయడం ద్వారానే పరిస్థితిలో మార్పు తీసుకు రాగలమని హితబోధచేశారు. గవర్నర్ కార్యాలయాల్లో రాజ్యాంగబద్ధ కర్తవ్య నిర్వహణకు ఈ ఏడాది మార్చిలోగా ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయాలని సూచించారు. ఆయన సూచనలు నేటికీ వాస్తవరూపం దాల్చకపోవడం విచారకరం.

గిరిజనుల బతుకులను ప్రమాదంలో పడదోసి, పర్యావరణాన్ని సంక్షోభంలోకి నెట్టే - బాక్సైట్ గనుల తవ్వకాలకు సంబంధించిన ఒప్పందాల్లో మన రాష్ట్రప్రభుత్వం పెద్దయెత్తున అక్రమాలను ప్రోత్సహించిందన్న ఆరోపణలున్నాయి. లక్షల కోట్ల రూపాయల జాతి సంపదను ప్రైవేటు వ్యక్తులకు దోచిపెట్టేందుకు అడుగడుగున నిబంధనలను అతిక్రమించింది. ఆ ఒప్పందాలను రద్దు చేయాలంటూ గతంలో కేంద్రమంత్రి స్వయంగా రాసిన లేఖలకు - రాష్ట్ర సర్కారుగానీ, ఇతర గవర్నర్లు గానీ సరైన రీతిలో స్పందించనే లేదు. ఎంతోకాలం వేచి ఉండి ఇక స్పందన రాదు అని నిర్ధారించుకున్న తరవాత - చివరికి రాజ్యాంగం అయిదో షెడ్యూల్‌లోని విచక్షణాధికారాలను ఉపయోగించి గనుల లీజుల రద్దుకు కేంద్రమంత్రి కిశోర్ చంద్రదేవ్ ఉపక్రమించారు. 'రాజ్యాంగంలో పొందు పరిచిన గిరిజన రక్షణ నియమాలను గడిచిన అరవై ఏళ్లలో ఏ ఒక్క గవర్నరూ ఉపయోగించలేదు. ఆ నియమాలు ఉండాలా, వద్దా అన్న విషయంపై జాతీయస్థాయిలో చర్చ జరగాలి. లీజులు రద్దు చేయాలంటూ ఇచ్చిన ఆదేశాలను రాష్ట్ర ప్రభుత్వం అమలు చేయకుంటే రాజ్యాంగం, పార్లమెంటు, ప్రజాస్వామ్యం దేనికోసం?' అంటూ కిశోర్ చంద్రదేవ్ తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. ఈ వ్యాఖ్యలు దేశవ్యాప్తంగా ఏళ్ల తరబడి గిరిజన సమాజంలో గూడుకట్టుకున్న అసంతృప్తిని, ఆవేదనను ప్రతిబింబిస్తున్నాయని చెప్పాలి.

గత రెండు దశాబ్దాల్లో వచ్చిన పెద్దమార్పు ప్రాజెక్టులు, పరిశ్రమల పేరుతో గిరిజనుల భూములు లాక్కోవడం, తరతరాల నివాస ప్రాంతాల నుండి తరిమి వేయడం, ఖనిజ సంపద వెలికితీతలోకి ప్రైవేటు కార్పొరేట్ శక్తులు ప్రవేశించడం. నయా ఉదారవాద సంస్కరణలు గిరిజనుల పాలిట శాపమైనాయి. తమ ప్రాంతం నుండి వెలికితీసే సంపదలో వారికి వాటా నిరాకరించబడుతోంది. రాజ్యాంగంలోని ఐదవ షెడ్యూల్ గిరిజనులకు తమ నివాస ప్రాంతాల్లో పూర్తి రక్షణ కల్పిస్తోంది. కార్పొరేట్ రంగంతో కుమ్మక్కు అయిన ప్రభుత్వాలు రాజ్యాంగాన్ని ఉల్లంఘించి అటవీ సంపద దోపిడీకి లైసెన్సులిస్తున్నాయి. పర్యవసానంగా, కొంత చైతన్యం పెరిగిన ప్రాంతాల్లో ఆదివాసీల ప్రతిఘటన పెరుగుతోంది. కొన్ని ప్రాంతాల్లో సాయుధ పోరాటం గిరిజనుల్లో బలపడింది. గిరిజనుల ఉద్యమానికి మావోయిస్టులు నాయకత్వం వహిస్తున్నారు. ప్రభుత్వాలు ఇవాళ ఆ ఉద్యమకారులపై పెద్ద ఎత్తున విరుచుకు పడుతున్నాయి. గ్రీన్‌హంట్ పేరుతో ఆదివాసీలను అడవి నుంచి పారదోలే ప్రయత్నం

చేస్తున్నాయి. కాని ఈ పరిస్థితి సృష్టించింది తామేనని మరిచి పోతున్నారు.

ఇవాళ దండకారణ్యంలో నెత్తురు ఏరులై పారుతుంది. అడవిలోని ఖనిజ సంపదను లూటీ చేయడానికి బహుళజాతి సంస్థల దేగ కన్ను పడ్డ కారణంగా అభివృద్ధి పేరుతో, ప్రాజెక్టుల నిర్మాణం పేరుతో, ఖనిజాల తవ్వకాల పేరుతో ఆదివాసుల జీవితాలను, జీవనాధారాలను కొల్లగొడుతున్నారు. ఇదేంటి అని అడిగితే సల్వాజుడుం, ఆపరేషన్ గ్రీన్‌హంట్ అంటూ ఆదివాసుల హణనానికి పాలకులు పాల్పడుతున్నారు. అందుకే దండకారణ్యంలో గత ఏడు సంవత్సరాలుగా బిఎస్ఎఫ్, ఐటిబిఎఫ్, సిఆర్‌పిఎఫ్, ఎస్‌టిఎఫ్, కోబ్రా దళాలు, కోయ కమాండోలు, సి-60, క్రాక్ కమాండో, మానవ రహిత యుద్ధ విమానాలు (డ్రోన్) వంటి బలగాలతో భారత ప్రభుత్వం అమెరికా సామ్రాజ్యవాద దన్నుతో ఆదివాసీలపై యుద్ధం ప్రకటించిన విషయం మన కేంద్ర గిరిజన మంత్రికి తెలియదనుకుంటే అది మన అమాయకత్వమే అవుతుంది.

కేంద్ర గిరిజన వ్యవహారాల మంత్రి వైరిచర్ల కిశోర్ చంద్రదేవ్ నిగ్గు తేలుస్తూ, లీజుల రద్దు ఆదేశాలతో అయిదో షెడ్యూల్ నియమాలను తెరపైకి తీసుకురావడం ఆహ్వానించదగ్గ పరిణామం. ఇదే తరహా దూకుడును దేశవ్యాప్తంగా గిరిజన ప్రాంతాల్లో జరుగుతున్న చట్ట ఉల్లంఘనలపైనా కనబరుస్తారని గిరిజన సమాజం ఎంతో ఆశతో ఉంది. నిజానికి జల్-జంగిల్-జమీన్ పై తమ హక్కుల కోసం ఆదివాసీలు గడిచిన కొన్ని దశాబ్దాలుగా అనేక ఆందోళనలు కొనసాగిస్తున్నారు. గత రెండు దశాబ్దాలుగా అడవిలోని ఖనిజ సంపదను, ఇతర వనరులను దోచుకోవడానికి బడా కార్పొరేట్ సంస్థలైన టాటా, జిందాల్, పోస్కో, వేదాంత, మిట్టల్, సలీం లాంటి కార్పొరేట్ సంస్థలతో జార్ఖండ్, పశ్చిమబెంగాల్, ఒడిసా, చత్తీస్‌గఢ్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు అడవిలో ఉన్న లక్షల కోట్ల రూపాయల ఖనిజ సంపదను సామ్రాజ్యవాద కార్పొరేట్లకు, వారి తాబేదార్లకు కట్టబెట్టడానికి కుదుర్చుకున్న అవగాహన పత్రాలు కిశోర్ చంద్రదేవ్‌కు తెలియదనుకోవాలా? ఈ ఆరాటం అంతా సంవత్సర కాలంలో ఎన్నికలు రానున్నందున గిరిజన ఓటుబ్యాంక్ కాపాడుకునే ఎత్తుగడ తప్ప మరొకటికాదు. నిజంగా ఆయనకు గిరిజనుల పట్ల ప్రేమాభిమానాలు ఉంటే, మొదటగా 'గ్రీన్‌హంట్ ఆపరేషన్' నిలిపివేయాలి, పోలీసు క్యాంపులు ఎత్తి వేయించాలి, కార్పొరేట్ సంస్థలతో కుదుర్చుకున్న ఒప్పందాలు రద్దు చేయించి నిజాయితీ నిరూపించుకోవాలి.

ఇటీవలనే ఆదివాసీల హక్కుల కొరకు పోరాడుతున్న 20కి పైగా ప్రజాసంఘాలు ఢిల్లీలో 2013 ఏప్రిల్ 30న వేలసంఖ్యలో జంతర్ మంతర్ వద్ద ధర్నా నిర్వహించి, ఆతర్వాత పార్లమెంటుకు మహాయాత్ర నిర్వహించాయి. ఇందులో దేశం నలుమూలల నుండి వచ్చిన భూముల నుండి బేదఖలు చేయబడిన, నిర్వాసితులు కాబడిన వేలాది మంది గిరిజనులు జల్, జంగల్, జమీన్ (నీరు, అటవి, భూమి) కొరకు, ప్రభుత్వ కుమ్మక్కుతో కార్పొరేట్ సంస్థలు సహజ వనరులను చట్ట విరుద్ధంగా ఆక్రమించుకోవడానికి వ్యతిరేకంగా నినాధాలు చేశారు. గిరిజన పేద ప్రజల హక్కుల నిరాదరణ ప్రభావం పట్ల నిస్సహాయులైన గిరిజనులు తీవ్ర ఆందోళన చెందారు. సహజ వనరులను, ప్రత్యేకించి భూమి, గనులు, అడవులు, నీరు స్వాధీనం చేసుకోవడంలో ప్రభుత్వం భారీ కుంభకోణాలకు పాల్పడడాన్ని కొనసాగిస్తున్న పద్ధతిని బాధిత ప్రాంతాల నుండి వచ్చిన గిరిజనులు ఖండించారు. కార్పొరేట్ రంగం సహజ వనరులను చట్టవ్యతిరేకంగా ఆక్రమించుకున్న ఫలితంగా సర్వస్వం కోల్పోయిన లక్షలాది మందికి న్యాయం కలుగజేయాలని వారు డిమాండ్ చేశారు. సహజ వనరులను కారుచౌక ధరలకు వారికి అప్పగించడాన్ని తీవ్రంగా నిరసించారు. స్థానిక గిరిజనులకు చట్టంలో సమకూర్చబడిన హక్కులను గౌరవించడం ఒక్కటే దేశవనరుల దోపిడీని నిలువరించేందుకు మార్గమని వారు పేర్కొన్నారు. ప్రస్తుతం చట్టంపై నిరంకుశాధికారుల పెత్తనం స్వారీచేస్తున్నదని, దేశ ప్రయోజనాలు, ప్రజల హక్కులు గాలికివదిలారని వారు విమర్శించారు. 2013 మే ఒకటిన గిరిజన ప్రతినిధి వర్గం భారత రాష్ట్రపతిని కలిసి ప్రభుత్వ చట్ట వ్యతిరేక, రాజ్యాంగేతర చర్యల గురించిన విజ్ఞాపన పత్రాన్ని ఆయనకు అందజేసింది.

గత ఎన్నికలకు ముందు యుపిఎ ప్రభుత్వం గిరిజనులకు, షెడ్యూల్ ప్రాంతంలో తరతరాలుగా నివశిస్తున్న గిరిజనేతరులకు వారు సాగు చేసుకుంటున్న భూమిపై, సేకరించే అటవీ ఉత్పత్తులపై, నివాస ప్రాంతాలపై హక్కు కల్పిస్తూ అటవీ హక్కుల చట్టం ఆమోదించింది. ప్రారంభంలో ప్రచారార్భాటం తప్ప అటు తర్వాత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు దాని ఊసు మరచిపోయాయి. అభివృద్ధి చెందుతున్న దళారి పెట్టుబడిదారీ వర్గం సమాజంలో అట్టడుగున వున్న గిరిజనులను తమ స్వార్థ ప్రయోజనాలకు బలి చేయడానికి చూపుతున్న ఆసక్తిలో ఆవగింజ వంతైనా వారి అభివృద్ధి విషయంలో చూపడం లేదు. అందువల్లనే హిందూ, క్రైస్తవ మత సంస్థలు, గిరిజన ప్రాంతాల్లో చొరబడగలిగాయి. గిరిజనుల హక్కులకై సాగించే ప్రజాతంత్ర ఉద్యమాలను సైతం తీవ్రవాదం పేరు చెప్పి అణచివేసే దుష్ట నీతిని పాలకవర్గాలు ఆచరిస్తున్నాయి. షెడ్యూల్ తెగలు, అటవీ నివాసితులకు సుపరిపాలనను అందించేందుకు, వారి హక్కులు కాపాడేందుకు ఐదవ షెడ్యూల్‌లోని నిబంధనలతో పాటు ఆర్టికల్ 224 కింద తమకు గల అధికారాలను ఉపయోగించాలని హక్కుల సంఘాలు, ప్రజాతంత్ర వాదులు చాలా కాలం నుంచి కోరుతున్నాయి. ప్రస్తుతానికిది అరణ్య రోదన. ఈ వాదన ప్రభుత్వాల పెనునిద్దర వదిలించాలని, గిరిజనులకు రాజ్యాంగం హామీ ఇచ్చిన కనీస హక్కులు అమలుకు నోచుకోవాలని ఆశిద్దాం! ఈ వర్గ సమాజంలో అదేమంత సులువుకానప్పటికీ పోరాడగా, పోరాడగా ఎప్పటికో అప్పటికి కొంత మేలు జరగకపోదు.

అక్షరజ్ఞానం బహుతక్కువగా ఉన్న నిస్సహాయులైన గిరిజనులకు, కంపెనీల అదుపాజ్ఞల్లో కొనసాగుతున్న పాలకవర్గాలకు మధ్య నేడు అలుపెరుగని పోరు సాగుతోంది. ప్రపంచీకరణ అభివృద్ధి నమూనా అమలు జరుపుతున్న పరిస్థితుల్లో, ఆర్థిక ఉదారవాదాన్ని, సహజ వనరుల లూటీ నిస్సిగ్గుగా అమలు జరుపుతున్న పరిస్థితుల్లో ఆదివాసీలు అత్యంత దారుణంగా ఇబ్బందులకు గురవుతున్నారు. అడవి బిడ్డల బాగోగులను చూసుకోవడం జాతిజనుల ఉమ్మడి బాధ్యత అని రాజ్యాంగ నిర్మాతలు స్పష్టం చేసిన విషయాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాల్సిన తరుణమిది. గతంలో 'సమత వెర్సెస్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం' వ్యాజ్యంలో సర్వోన్నత న్యాయస్థానం రాజ్యాంగ హక్కులను పునరుద్ఘాటిస్తూ వెలువరించిన తీర్పులో అన్యాయాలను సరిదిద్ది, పూర్వస్థితిని పునరుద్ధరించకపోతే

# బయ్యారం ఉక్కు - ఆదివాసుల హక్కు

***సహజ వనరులు స్థానిక ప్రజలకే దక్కాలని రాజ్యాంగం అంటున్నా పాలకులు ఆ విధానాలను అమలు చేయకుండా, ఆ వనరులను బహుళజాతి కంపెనీలు కొల్లగొట్టడానికి అనుమతిస్తున్నారని అంటున్నారు* వూకే రామకృష్ణ**

ఖమ్మం జిల్లాలో బయ్యారం మండలం పూర్తిగా ఏజెన్సీ ప్రాంతం. సంపూర్ణంగా ఆదివాసిల ప్రాంతం. ఆ ప్రాంతం విప్లవాలకు పురిటిగడ్డ. ఎంతో మంది విప్లవకారులు, కళాకారులు, వివిధ నక్సలైట్ గ్రూపులకూ నిలయం. సహజ వనరులు, ఖనిజ సంపదకు పుష్కలంగా ప్రకృతి ఒడిలో అంతర్భాగమై వాగులు, వర్రెలు, సెలయేరులు గలగల పారుతూ బాహ్య సమాజానికి దూరంగా స్వేచ్ఛగా జీవనం గడుపుతున్న ఆదివాసులు నేడు ఖనిజ సంపద మూలాలుగా వారి జీవితాలు ధ్వంసం అవుతున్నాయి. ఈ ప్రపంచంలో ఎక్కడ ఆదివాసిలు ఉన్నా ఆ ప్రాంతం అంతా బహుళజాతి కంపెనీలు కన్నేసి ఖనిజ సంపదను దోచుకోవడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి.

బయ్యారం మండలంలో ఉన్న ఖనిజ సంపద మొత్తం 1/70 చట్టం పీసా చట్టం పరిధిలో ఉంది. రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్డ్ ప్రకారం, పీసా చట్టం ప్రకారం గ్రామ సభల ఆమోదం లేనిదే అక్కడ ఏ చిన్న పని కూడ చేయరాదు. కాని నేడు ఆదివాసిల ప్రాంతాలలో నిక్షిప్తమై ఉన్న ఖనిజ సంపదనూ కైవసం చేసుకోవడానికి బహుళజాతి కంపెనీలు తిష్టవేసి కూర్చున్నాయి. ఈ విధానాలు మొత్తం ఆదివాసిల జీవన విధనాన్ని, వారి ప్రాథమిక హక్కులను ధ్వంసం చేసే విధంగా కొనసాగుతున్నాయి. నాడు వై.ఎస్. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రి ఉన్నప్పుడు బయ్యారం గనులు, విశాఖపట్నంలో ఉన్న బాక్సైట్ నిక్షేపాలను, సహజ వనరులను, ఖనిజ సంపదను తన అనుచర వర్గానికి, బంధువర్గానికి ధారాదత్తం చేశారు. ఎన్నో ప్రజాసంఘాల ఒత్తిడి మేరకు, అందోళన మేరకు, మీడియాలో వచ్చిన కథనాలకు భయపడి రద్దు చేశారు. సహజ వనరులు, ఖనిజాలు జాతి సంపద అంటూ బహుళజాతి కంపెనీలకూ, అమెరికన్ సామ్రాజ్యవాదులకూ తాకట్టు పెట్టి ఆదివాసులను ఆ ప్రాంతాల నుండి వెళ్లగొట్టాలనే ప్రయత్నాలు నేడు పాలకవర్గాలు కుట్రలు పన్నుతున్నాయి. అంతేకాకుండా నేడు మన ముఖ్యమంత్రి బయ్యారం ఉక్కు విశాఖ స్టీల్ ప్లాంట్‌కూ తరలించాలని ప్రకటనలు చేస్తూ తెలంగాణ ప్రజలనూ, ఆదివాసిలనూ నిలువునా మోసం చేస్తూ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కాదు 'ఆంధ్ర ముఖ్యమంత్రి'గా నిరుపించుకున్నారు.

బయ్యారం మండలంలో 2500 హెక్టార్లు విశాఖ కర్మాగారానికి కేటాయిస్తూ ప్రభుత్వం జి.ఒ. జారీ చేసింది. బయ్యారం మండల పరిధిలో 17 రెవెన్యూ గ్రామాలు ఉన్నాయి. 25,899 హెక్టార్ల 13,143 హెక్టార్ల అటవీ భూమి ఉంది. ఈ ప్రాంతం మొత్తం పచ్చని పొలాలతో కళకళలాడుతూ ఆదివాసిల జీవన విధానంతో నిత్యం ఆహ్లాదకరంగా ఉంటుంది. మొత్తం కేటాయించిన 5032 హెక్టార్లకు గానూ కేవలం బయ్యారం మండలంలోని 2500 హెక్టార్లు ఉంది. 6వ వంతు ఎకరాలు విధ్వంసానికి గురవుతాయి. బయ్యారం మండలంలో ఉక్కు పరిశ్రమ ఏర్పడితే ఎంత మందికి ఉద్యోగాలు వస్తాయి? అందులో ఆదివాసిలకూ ఎన్ని ఇస్తారు? ఇలాంటి ప్రశ్నలకు సమాధానం లేదు.

బయ్యారం ఉక్కు విశాఖపట్నానికి తరలించాలని ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి ఏప్రిల్ 17న జి.ఒ. జారీ చేశారు. ఈ జి.ఒ. కచ్చితంగా ముఖ్యమంత్రి ఆదేశాల మేరకు వచ్చిందనేది వాస్తవం కాదా? బయ్యారం ఖనిజ సంపదను విశాఖ ఉక్కుకు తరలించేందుకు మొదటి దశలో బెనిఫికేషన్ ప్లాంట్ ఏర్పాటు చేయాలనీ, అనంతరం రెండో దశలో బయ్యారంలో ఉక్కు పరిశ్రమ ఏర్పాటు చేయాలనీ ఆ మెమో పేర్కొంది. ఇది కచ్చితంగా కుట్ర పూరితమైన జి.ఒ.గా చెప్పవచ్చు. బెనిఫికేషన్ ప్లాంట్, ఉక్కు కర్మాగారం బయ్యారంలో జ్యాపం చేసి ఆ లోపు మడి ఖనిజం మొత్తం తరలించేందుకు రంగం సిద్ధమైందని అర్థం చేసుకోసుకోవాలి. గత వారం రోజులుగా అన్ని రాజకీయ పక్షాలు, ఎర్రజెండా పార్టీలు 'బయ్యారం ఉక్కు-తెలంగాణ హక్కు' అని నినదిస్తున్నాయి తప్ప 'బయ్యారం ఉక్కు - ఆదివాసి హక్కు' అని

చట్టాలు గిరిజనులకు న్యాయం అందించలేని ఎండమావులే అవుతాయని, గిరిజనులను సామాజికంగా, ఆర్థికంగా సాధికారత దిశగా నడిపించే క్రమంలో ఆ తీరు ప్రతిబంధకమవుతుందని, అడవి బిడ్డల వ్యక్తిగత గౌరవానికి భంగం కలుగుతుందని చేసిన వ్యాఖ్యలు ఈ సందర్భంగా గమనార్హం. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వంతో కూడిన సామాజిక వ్యవస్థపట్ల విశ్వాసం ఉన్న ప్రతి ఒక్కరూ గిరిజనుల గుండెఘోషను అర్థం చేసుకోవాలి. దుర్మార్గపు, అనాగారిక, మార్కెట్ సంస్కృతికి వ్యతిరేకంగా తమ హక్కుల కొరకు జీవన్మరణ పోరాటం సాగిస్తున్న ఆదివాసులకు అండగా ఉండడం ప్రజాస్వామిక వాదుల, ప్రగతి కాముకుల కనీస బాధ్యతగా గుర్తించాలి. రాజ్యాంగ రూపకర్తలు ఎంతో ముందుచూపుతో అయిదో షెడ్యూల్‌లో దఖలు పరిచిన నియమ నిబంధనలను గిరిజన సమాజానికి నూటికి నూరుపాళ్లూ వర్తింప జేసేందుకు వీలుగా పాలకవర్గాలపై ఒత్తిడి పెంచాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

మాట్లాడలేక పోతున్నాయి. దేశ మూలావాసులుగా, సంస్కృతి, సంప్రదాయాలకు వారసులుగా ఉన్న ఆదివాసులపై అన్ని రాజకీయ పార్టీలు, ఎర్రజెండా పార్టీలు సవితి తల్లి ప్రేమను ఒలకబోస్తున్నాయి తప్ప నిజమైనా ప్రేమ కాదు. కేవలం ఎన్నికలప్పుడే గుర్తుకొచ్చే ఆదివాసులు వారికి అన్యాయం జరుగుతున్నప్పుడు ఎవరూ నోరు విప్పడం లేదు.

బయ్యారంలో మొదటి దశ రెండవ ప్లాంటు ఏర్పాటు చేసి శుద్ధి చేసి అనంతరం విశాఖ ఉక్కు కర్మాగారానికి తరలించాలనే ఆలోచనలో ఉన్నట్లు కనిపిస్తుంది ప్రభుత్వం. దుమ్ము, ధూళి ఇక్కడ బయ్యారం వాసులకూ, ఆదివాసులకూ, స్వచ్ఛమైనా ఖనిజం విశాఖకూ తరలించే ప్రయత్నాలను ఆదివాసిలు వ్యతిరేకిస్తున్నారు. ముడి సరుకు తెలంగాణ ప్రాంతానిది. ఉద్యోగాలు ఆ ప్రాంతానికి. ఇది ఘనత వహించిన ప్రజాస్వామ్య ప్రభుత్వంగా పిలుస్తున్న కాంగ్రెసు పాలన. మోసాలు చేయడం. కాంగ్రెసు పార్టీకి వెన్నతో పెట్టిన విద్య. ఖమ్మం, కరీంనగర్, వరంగల్ జిల్లాలో ఐరన్ ఓవర్, డోలమైట్, స్యాండ్, లైమన్‌స్టోన్, నీరు ఇతర ఖనిజ సంపద పుష్కలంగా ఉన్నాయి. అయినా ఈ జిల్లాలో పరిశ్రమలు స్థాపించకుండా ఎక్కడో ఉన్న పరిశ్రమలకూ తరలించడం నిజంగా ఈ ప్రాంత ఆదివాసుల్ని మోసం చేయడం అవుతుంది. విశాఖ స్టీల్ ఫ్యాక్టరీ వల్లా 35 వేల మందికి ఉపాధి లభిస్తుంది. అందులో కనీసం 5 శాతం కూడ ఆదివాసిలు లేరు. చెత్త, దుమ్ము, ధూళీ వెదజల్లె పరిశ్రమని ఇక్కడ పెట్టి, ఖనిజాన్ని తరలించడాన్ని తక్షణమో నిలిపివేయాలి. బయ్యారం ఉక్కునూ విశాఖకూ తరలించడం మూలంగా ఐదు వేల కోట్లు లాభం వస్తుందని వివిధ గణాంకాలు తెలియజేస్తున్నాయి. ఖమ్మం జిల్లా బయ్యారంలో స్టీల్ ఫ్యాక్టరీ పెట్టేది లేదని విశాఖ పరిశ్రమ సిఎండి కుండబద్దలు కొట్టినట్లు స్పష్టం చేశారు.

ఖమ్మం జిల్లాలోని బయ్యారంలో ఉక్కునూ తరలించకుండా ఈ ప్రాంతంలోని స్టీల్ ఫ్యాక్టరీ ఏర్పాటు చేయాలనే ఆదివాసి సంఘాలు కోరుతున్నాయి. ఖమ్మం జిల్లాలో ఉన్న ఆదివాసి ఎం.ఎల్.ఎ.లు నలుగురు ఉన్నప్పటికి ఏ మాత్రం ఆదివాసిల గురించి ఆలోచించే ఓపిక లేకపోయింది. కేవలం ఓట్ల బ్యాంకు రాజకీయాల కోసం ఆలోచించే ఈ ప్రజా ప్రతినిధులు ఆదివాసిలకు అవసరం లేదు. బయ్యారంలో ఇంత పెద్ద ఎత్తున నిర్వాసితులు అవుతున్నా ఆదివాసి ఎంఎల్ఎలు ఏ మాత్రం పట్టించుకోవడం లేదు. కేవలం పాలక వర్గాలకు తొత్తులుగా తయారవుతున్నారు. ఆదివాసి ప్రాంతాల్లో ఉన్న ఖనిజ సంపద గ్రామ సభల ఆమోదంతో వెలికితీయాలి. 1/70 చట్టం ప్రకారం, పీసా చట్టం ప్రకారం మొత్తం ఆదివాసిలకు అందులో భాగస్వామ్యం కల్పించాలి. ఆదివాసి ప్రాంతాల్లో విలువైనా ఖనిజ సంపద మొత్తం వివిధ బహుళ జాతి సంస్థలు తీసుకువెళ్లడాని వేల కోట్లు ఖర్చు పెడుతున్నారు. కాని అందులో 25 శాతం కూడ ఆదివాసిల అభివృద్ధి కొరకు ఖర్చు చేయడం లేదు.

ఆదివాసి ప్రజల్ని పట్టించుకొనే ఏ ప్రజాసంఘాలు లేవా? పౌర సమాజం కోరే పౌర హక్కులు లేవా? ఏ మానవ హక్కులు లేవా? ఒక పక్క తెలంగాణ సకల జనుల పోరాట చరిత్ర పురోగమనం. మరో పక్క అభివృద్ధి పేరు మీద ఆగమవుతున్న మైనింగ్ బతుకుల వినాశన అభివృద్ధి. ఓపెన్‌కాస్ట్‌లు, ప్రాజెక్టులు, ఉక్కు పరిశ్రమలు ఆదివాసుల జీవితాలను బుగ్గిపాలు చేస్తున్నాయి. స్వాతంత్ర్యం వచ్చి ఆరు దశాబ్దాలకు పైబడి అయినప్పటికీ ఈ దేశ మూలవాసులు పౌర సమాజంలో అంతర్భాగం కాలేకపోయారు. ఇప్పుడు వారి జీవనానికి మూల ఆధారమైనా అటవీ సంపద శాశ్వతంగా అన్యాక్రాంతం చేసే ప్రక్రియ సాగుతోంది. ఎంతటి దుర్భర స్థితి గతంల్లో జీవిస్తున్నప్పటికీ ఆదివాసులు ఈ దేశ సహజ వనరులలో అటవీ సంపదనూ, పర్యావరణాన్నీ ప్రాణపదంగా కాపాడుతూ వస్తున్నారు. ఆదివాసిలను ప్రకృతి నుండి విడదీసి, అడవులను నాశనం చేసే సరుకులుగా మార్చే కుతంత్రానికి ప్రపంచీకరణ తోడయింది. చత్తీస్‌గడ్‌లో ఇప్పుడు జరుగుతున్న గ్రీన్‌హంట్ వెనుక మావోయిస్టుల అణిచివేత లక్ష్యంగా కంటే, ఆదివాసుల సాంప్రదాయిక హక్కులు హరించి ప్రపంచ ప్రభువులకు అప్పగించే ఆర్థిక లక్ష్యమే ప్రధానం అయింది. రాచరికపు మహా సామ్రాజ్యాలు కూడ ఆదివాసుల విషయంలో చేయనంత విధ్వంసాన్ని ఓపన్ కాస్టుల పేర ఈ అత్యాధినిక రాజ్యం చేస్తుంది. ప్రాజెక్టులు, బాక్సైట్ నిల్వలు మీద బహుళజాతి కంపెనీలు వాలితే నష్టపోతున్నది ఆదివాసిలు మాత్రమే.

ఓపెన్ కాస్టులు, పోలవరం , టైగర్ ప్రాజెక్టులు ఈ దేశ మైనింగ్ మాఫియా దోపిడీ వీరంగంలో ప్రతి ఆదివాసి ఒక అనాథ. అయితే ఓపెన్ కాస్టులు శ్మశాన వాటికలు. ఆ శ్మశాన వాటికలో ఆదివాసులను తగలపెడుతున్న సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలకూ వ్యతిరేకంగా మేధావులు అంతా ఆదివాసిలకు అండగా నిల్చి, వారి ప్రజాస్వామిక హక్కుల కోసం పోరాడవలిసిన కాలం ఇది. ఈ నేపథ్యంలో బయ్యారం ఉక్కు, ఆదివాసిల హక్కు అని ఆ ప్రాంతంలో స్టీల్ ఫ్యాక్టరీ నిర్మాణం చేస్తే అందులో వంద శాతం ఆదివాసులకూ ఉద్యోగాలు ఇవ్వాలి. భూమి కోల్పోయే నిర్వాసితులకూ నష్టపరిహారం ఇవ్వాలి. ఆ ఫ్యాక్టరీ లాభాలతో యాభై శాతం ఆదివాసి ప్రాంతాలను అభివృద్ధి చేయాలి. ఆదివాసి ప్రజా ప్రతినిధులు నిర్వాసితులకు న్యాయం చేయాలి. బయ్యారం ప్రాంతంలో ఉన్న ఆదివాసిలకు గ్రామ సభ ఏర్పాటు చేయాలి. ఆదివాసిలతో వారి ఆమోదంతో స్టీల్ ఫ్యాక్టరీ ఏర్పాటు చేయాలి. ఆదివాసిలనూ భాగస్వామ్యం చేయాలి. ఆదివాసి ఎం.ఎల్.ఎ, ఎం.పి, ఎం.పి.పి. సర్పంచ్‌లను భాగస్వామ్యం చేయాలి. బయ్యారం ఉక్కు ఆదితవాసిల హక్కు అని మిలిటెంట్‌గా పోరాడాలి. అందుకోసం ఆదివాసి సంఘాలు, ఆదివాసి విద్యవంతులు, మేధావులు కొమరం బీం, అల్లూరి, గంటందోర, మల్లుదొర భీర్సాముండా వారి పోరాట వారసత్వాని పుణికి పుచ్చుకొని ఐక్యంగా పోరాడాలి. అప్పుడే బయ్యారం ఉక్కు–ఆదివాసిల హక్కు అవుతుంది.

*(రచయిత ఆదివాసీ రచయితల సంఘం ఖమ్మం జిల్లా ప్రధాన కార్యదర్శి)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి. – సం.*

# కేశవరెడ్డి నవలల్లో వలసపాలన-భూస్వామ్యం

*ప్రపంచీకరణ, నూతన ఆర్థిక విధానాల వల్ల వ్యవసాయరంగం, చేతివృత్తులు ధ్వంసమయి, ఆత్మహత్యలు, వలసలు పెరిగాయనీ, కేశవరెడ్డి రచనలు ఈ ఇతివృత్తాలను విపులంగా చిత్రీకరించాయనీ అంటున్నారు* **ఎస్. జగన్‌రెడ్డి**

విప్లవ విద్యార్థి దశలో రాజకీయ తరగతులకు వెళ్లినప్పుడు మార్క్సిస్టు ఫిలాసఫీని సిలబస్‌గా చదువుకున్నప్పుడు మార్క్స్ రచనలతో స్వల్ప పరిచయం ఏర్పడింది. భారతదేశంపై ఆయన రాసిన వ్యాసాలలో స్వయం పోషక గ్రామం, ఆసియా ఉత్పత్తి విధానం (ఏసియాటిక్ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్) పట్ల విపరీతమైన ఆసక్తి ఏర్పడింది. దేశంలోని గ్రామీణ జీవితంపై సైద్ధాంతిక స్థాయిలో చర్చించిన వ్యక్తి మార్క్స్. యూరప్ కంటే చైనా, భారతదేశంలో కాయకష్టం చేస్తూ పంటలు పండించే రైతు ఉనికిని గుర్తించిన తొలి వ్యక్తి మార్క్స్. దీనినే ఆయన ఏసియాటిక్ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్ అన్నారు. పరస్పరాధారితంగా భిన్న కులాల వాళ్లు వస్తు మార్పిడితో బతికే గ్రామీణ జీవితాన్ని ఆయన 'స్వయం పోషక ఆర్థిక విధానం'గా వ్యాఖ్యానించారు. చిత్రంగా ఆయన భారతదేశంపై చేసిన ఈ రెండు ప్రతిపాదనలపై జరిగిన అధ్యయనాలు అంతంత మాత్రమే.

ఈ నేపథ్యంలో గ్రామీణ జీవితం కేంద్రంగా కథా కాలాన్ని 1925 వరకు విస్తరించి డా. పి. కేశవరెడ్డి మూగవాని పిల్లన గ్రోవి, చివరి గుడిసె, స్మశానం దున్నేరు, ఇన్‌క్రెడిబుల్ గాడెస్, రాముడుండాంది – రాజ్యముండాంది, అతడు అడవిని జయించాడు వంటి నవలలు రాశారు. ఈ నవలలన్నీ గ్రామీణ జీవితాన్ని అల్లకల్లోలం చేస్తున్న భూస్వామ్యం, కులం లేదా వర్ణ వ్యవస్థ, అధికారం వంటి వ్యవస్థల వల్ల అణగారిపోతున్న యానాదులు, మాలలు, రైతులు, సమస్త వృత్తుల జీవితాలను రచనా రంగం మీదికి తెచ్చినవే. గతంలో కూడా ఈ వర్గాల మీద సాహిత్యం వచ్చినప్పటికీ వాటి నేపథ్యం పూర్తిగా వేరు. స్వానుభవంతో రాసినవి కావవి. సంస్కరణ, జాతీయ రైతాంగ పోరాటాల నేపథ్యంలో వచ్చిన రచనలవి. అందుకే వాటికి ఉండే పరిమితి వాటికి ఉన్నవి. మార్క్స్ ప్రతిపాదించిన స్వయం పోషక గ్రామం, ఆసియా ఉత్పత్తి విధానం నేపథ్యంలో కేశవరెడ్డి నవలలను పరిశీలించడం నా రచన లక్ష్యం.

భూమిని పోగొట్టుకున్నందున ఒక రైతు అనుభవించిన మానసిక, సాంఘిక, ఆత్మ సంక్షోభాల చిత్రణ మూగవాని పిల్లనగ్రోవి నవల. పూర్తిస్థాయిలో రైతు జీవితాన్ని, భూమిని పోగొట్టుకున్న నేపథ్యంలో చిత్రించిన నవల ఇది.

రైతుకు, భూమికి, వ్యవసాయానికి, గ్రామీణ జీవితానికి ఉన్న అనుబంధాన్నే మార్క్స్ ఆసియా ఉత్పత్తి విధానంగా ప్రతిపాదించారు. రైతు – వ్యవసాయం పునాదిగా భిన్న, భిన్న వృత్తి కులాల ద్రవ్య మార్పిడి (సారాంశంలో తమ ఉత్పత్తుల మార్పిడి)తో జీవించే విధానాన్ని ఆయన స్వయం పోషక గ్రామంగా అభివర్ణించారు. ఈ అవగాహన పదిలపరుచుకున్న తొలి వ్యక్తులు భారతదేశంలో గాంధీజీ, చైనాలో మావో. ఈ అవగాహనతో వాళ్లు పని చేయడం వల్లే చైనా, భారత గ్రామీణ సమాజాలు వారి వెంట నడిచాయి. సాహితీ వేత్తలలో ప్రేమ్‌చంద్. అందుకే రాజకీయ ఉద్యమాలలో గాంధీజీ వలే ప్రేమ్‌చంద్ దేశవ్యాప్తంగా పాఠకుల మన్నన పొందారు. కాని, రైతు జీవిత కేంద్రంగా వచ్చిన సాహిత్యం స్వల్పమే. మలయాళ రచయిత శివశంకరపిళ్లై, కన్నడ రచయిత బి.వి. కారంత్ మాత్రమే రైతు జీవితాలను చిత్రించిన రచయితలు. కాని, అవి కూడా పాక్షికమే.

భారతదేశంలో ప్రగతిశీల రాజకీయాలలో భాగంగా జరిగిన సంఘర్షణలన్నిటికీ పేరు రైతాంగ పోరాటాలే. రైతుకు, భూమికి ఉన్న అనుబంధం మీద వచ్చిన అధ్యయనాలు తక్కువే. ఇది ఇలా ఉంటే ఒకే కులంలో వర్గం కూడా ఉన్నదని గుర్తించిన మొదటి రచయిత కేశవరెడ్డి. ఆయన రచన స్మశానం దున్నేరులో భూస్వామి పెద్దరెడ్డిది రెడ్డి కులమే. మూగవాని పిల్లనగ్రోవిలో పాత్రధారి బక్కిరెడ్డిది కూడా ఆ కులమే. కాని చేసేది కాపుదనం వృత్తి. మూగవాని పిల్లనగ్రోవి నవలలో 'నా కయ్యలు పోయినాయి నేను కాపోడనెట్టయితి' అన్న ప్రశ్న ఉంటుంది. కయ్యలు అంటే మడిచెక్కలు. తన తాత తండ్రుల నుంచి వారసత్వంగా వచ్చిన భూమి మణియం (భూస్వామి) పాలైన తరువాత తాను 'బతికేది ఎట్టా?' అన్న ప్రశ్న బక్కిరెడ్డిది. భూమిని తన బతుకుదెరువుకు ఆదెరువుగా చూడడం నుంచి వచ్చిన ప్రశ్న అది. రైతుగా తన ఆత్మగౌరవానికి, ఆత్మ విశ్వాసానికి, తన మనుగడకు భూమి చిహ్నం. తనకు, తన వాళ్లకు తరతరాలుగా ఆదెరువుగా ఉన్న భూమి పోవడంతో బక్కిరెడ్డి ఆత్మగౌరవమే కాదు, ఆత్మవిశ్వాసాన్ని కూడా కోల్పోతాడు. ఇది భూమిని కాపు కుల వృత్తికి పునాదిగా భావించినందువల్ల వచ్చిన సంక్షోభమది. చేతి వృత్తులు చెల్లుబాటు కానప్పుడు శ్రామికులను ఆవరించే సంక్షోభమే ఇది. దీనిని అధిగమించడానికి వాళ్లు ఆత్మహత్యలకు పాల్పడడం, శుష్కించి, శుష్కించి బలవన్మరణం పొందడం భారత దేశవ్యాప్తంగా జరుగుతున్న పరిణామమే.

ఈస్ట్ ఇండియా కంపెనీ భారత దేశంలో వేళ్లూనుకున్న కాలం నుంచి వృత్తుల మీద జరుగుతున్న దాడి కొనసాగింపే ఇది. చేతి వృత్తుల వారి చలనం గురించి బాగా రాసిన నవల 'రాముండుండాంది – రాజ్యముండాంది'. చేతి వృత్తులతో ఇల్లు గడవనప్పుడు తమ గ్రామాన్ని వదిలేసి పని దొరికిన దగ్గరికి వెళ్లడం చేతి వృత్తుల కుటుంబాలు తమ కుల వృత్తి బాగా సాగే గ్రామాలకు, పట్టణాలకు వెళ్లడం, సన్యాసం తీసుకోవడం చాలా కాలంగా ఉంది. బెస్తలు, వడ్రంగులు, చేనేత, స్వర్ణకారులు, కంసాలి కుటుంబాలలో ఈ వలసల కథలు అనేకం

ఉంటాయి. రైతులు భూముల్ని వెతుక్కుంటూ వెళ్లిన కథలు కూడా అనేకం ఉంటాయి. స్వయంగా ఈ వ్యాసకర్త కుటుంబాలలో ఈ కథలున్నాయి. ఇదిగాక పన్నుల బాధ భరించనప్పుడు రైతులు రాజవంశాలకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు చేసిన దాఖలాలు అనేకం ఉన్నాయి. మొగలాయిలకు వ్యతిరేకంగా జాట్లు తిరుగుబాటు చేయడం, సిక్కులు సాయుధ యుద్ధాలకు దిగడం ఉందే. ఇందుకు సమ్మక్క – సారలక్క తిరుగుబాటుకు మించిన దాఖలా మరొకటి లేదు. ఈ తరహా వర్గ సంఘర్షణ కేశవరెడ్డి అన్ని నవలలో ఉంది. ఈ వాస్తవికత ఇట్లా ఉంటే మార్క్స్ మాత్రం స్వయం పోషక గ్రామం అంటూ కితాబు ఇస్తూనే జడత్వం ఆవరించిన గ్రామంగా పేర్కొనడానికి బలమయిన కారణాలు ఉండే ఉంటాయి.

కాని, అంతర్గతంగా ప్రజలలో చలనం ఉన్నా, క్రాంవెల్ నాయకత్వంలో ఇంగ్లిష్ విప్లవం (15వ శతాబ్దం), ఫ్రెంచ్ విప్లవం (17వ శతాబ్దం) వలె భారతదేశంలో మూకుమ్మడి తిరుగుబాట్లు రాజ్యాధికారం కోసం జరగనందు వల్ల ఆయన ఆ విధంగా అభిప్రాయపడి ఉండవచ్చు. స్వయంగా రైతుగా తన యవ్వనం వరకు జీవించిన కేశవరెడ్డికి మాత్రమే ఈ తరహా రచన సాధ్యమయింది. పైగా ఇది ఆయన తండ్రి కథేననడం కూడా తెలిసింది. అలనాటి ఈస్ట్ ఇండియా పాలన నాటి నుంచి బ్రిటన్ వలస పాలన (1857) అప్పటి నుంచి ఇప్పటి వరకు పరిస్థితులు బేరీజు వేస్తే వలస పాలన నుంచి విముక్తి అయిందని చెప్పుకుంటున్న భారతదేశంలో తిరిగి వలస పాలనలోకి వెళ్లిందని చెప్పుకోవాల్సి ఉంటుంది. వలస పాలనలో బక్కిరెడ్డి మరణించినా, ఇప్పుడు దేశవ్యాప్తంగా రైతులు మరణిస్తున్నా కారణాలు, పరిస్థితులు అవే. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన వేళ్లూనే క్రమంలో సంస్థానాధీశులతో ఒప్పందాలు చేసుకుని స్థానిక, చేనేత, వ్యవసాయ ఉత్పత్తులపై వేటు వేసి మన ముడిసరుకులు తరలించుకపోయి బ్రిటన్ మనకే అమ్మింది. పరిస్థితులు విషమించడంతో 1857లో బ్రిటిష్ పాలకులకు రాజ్యాధికారాన్ని అప్పజెప్పింది. దీంతో మరింత దోపిడీకి దారులు వేసినట్టయింది. రైత్వారీ చట్టాన్ని తీసుకొచ్చిన ఆంగ్ల ప్రభుత్వం భూమిని సొంత ఆస్తిగా మార్చి భూస్వాములకు, పెద్ద జమిందారులకు దాఖలు పరిచింది. దీంతో రైతులు కౌలుదారులుగా, కూలీలుగా, కట్టు బానిసలుగా అనేక కడగండ్ల పాలై వాటిని భరించలేక బ్రిటిష్ వారికి అర్జీలు పెట్టుకున్న విషయాన్ని మార్క్స్ రాశారు.

ఈస్ట్ ఇండియా కంపెనీకి మరో రూపంగా వచ్చిన ప్రపంచ బ్యాంక్ భారతదేశ వ్యవసాయరంగంపై, గ్రామీణ ఉత్పత్తులపై అనేక విధి? నిషేధాలు విధించడం, ఆనాటి జమిందారీలకు మారు రూపంగా సెజ్‌లు ఏర్పాటు చేయడం చూస్తూనే ఉన్నాం. అప్పుడయినా, ఇప్పుడయినా రైతులు, భూములు కోల్పోవడం, మరణించడం చూస్తూనే ఉన్నాం. 1870లలో వచ్చిన రైత్వారీ చట్టం వల్ల సొంత ఆస్తి అన్న భావన తలెత్తింది. అప్పటి వరకు స్వయం పోషక సమాజంగా ఉన్న భారతదేశంలో సొంత ఆస్తి లేదా వ్యక్తిగత ఆస్తి అన్న భావనే లేదు. ఎప్పుడయితే, భూస్వాములకు ఈ భావన తలెత్తిందో కౌలుదారులుగా మారిన రైతులకు, కట్టు బానిసలయిన వెట్టి బానిసలకు అనేక కడగండ్లు మొదలయ్యాయి. ఆధునిక నగర జీవితాలకు అలవాటు పడ్డ భూస్వాములు, జమీందారులు తమ తాబేదార్లతో రైతులపై అనేక దౌర్జన్యాలు చేయించేవారు. ఇది బ్రిటిష్ పాలిత ప్రాంతాలలో కొంత ఎక్కువగానూ, సంస్థానాలలో తక్కువగానూ ఉండేది. ఇందుకు సంబంధించిన కేశవరెడ్డి నవల 'చివరి గుడిసె'లో ఒక ప్రస్తావన ఉంది.

1850లలోనే ఆదివాసులలో కొన్ని సమూహాలను నేరస్థులుగా ముద్రవేసి వారిని అడవుల నుంచి తరలించి సెటిల్‌మెంటు గ్రామాలను ఏర్పాటు చేసి బ్రిటిష్ ప్రభుత్వం వారికి వ్యవసాయ భూమినిస్తుంది. గ్రామంలో ఉంటూ వ్యవసాయం చేసుకునే యానాదులపై దొంగతనం నేరం మోపుతాడు ఆ గ్రామ భూస్వామి. వారిని అక్కడి నుంచి బేదఖల్ చేసి వారి భూమిని కాజేయాలని భూస్వామి పన్నాగం. ఈ మేరకు ఆంగ్ల అధికారి అయిన కలెక్టర్‌కు వారు దొంగలని, తొలగించాలని అర్జీ పెట్టుకుని వారి భూమిని కాజేస్తాడు. ఇది భూస్వాములకు – వలస పాలకులకు ఉన్న సంబంధాలను తెలియ చెప్పేది. అందుకే 1860లలో అమలులోకి వచ్చిన పీనల్ కోడ్‌లో మనిషి ప్రాణరక్షణ కంటే ఆస్తి రక్షణకే అత్యధిక చట్టాలున్నాయని అంటారు మార్క్సిస్టు మేధావి తరిమెల నాగిరెడ్డి. చివరి గుడిసె నవలలో నాలుగు వరికంకులు తెంపుకపోయాడన్న నెపంతో యానాదోడు 'మన్నుగాడిని' ఒంటిల్లు గ్రామ భూస్వామిక (మణిమాల) హత్య చేస్తాడు.

వలస పాలనలో నేరస్థ జాతులుగా ముద్రవేయబడ్డ ఆదివాసుల దుస్థితికి ఇది ప్రబలమయిన దాఖలా. చరిత్రంతా వర్గపోరాటాల చరిత్రే అని మార్క్స్ అన్న సూత్రీకరణ గురించి తెలిసిందే. ఎటువంటి రాజకీయ, సామాజిక ఉద్యమాల నేపథ్యంలో లేని కాలం భూస్వామ్య వర్గంపై అదను చిక్కినప్పుడల్లా రైతులు తిరుగుబాటు చేశారని చెప్పడానికి మరో దాఖలా కేశవరెడ్డి నవల స్మశానం దున్నేరు. ఆ సూత్రీకరణకు అక్షరాల సాక్ష్యం ఈ నవల. 1920ల నాటి తెలంగాణలో కూడ ఇటువంటి సంఘటనలు జరిగిన దాఖలాలు ఉన్నాయి. ఈ మేరకు దేవులపల్లి వెంకటేశ్వరరావు రాసి ఉన్నారు. ఇప్పటి వరకు భూస్వామ్య సంబంధాల గురించి విపులంగా తెలియచెప్పే రెండు ప్రసిద్ధ రచనలు సీమాంధ్రపై వెలువడడం ఆలోచించదగ్గవి. అందులో ఆంధ్ర భూస్వామ్య సంబంధాలకు యజ్ఞం దాఖలా అయితే, రాయలసీమ భూస్వామ్య సంబంధాలకు దర్పణం స్మశానం దున్నేరు. కారంచేడు, చుండూరు, లక్ష్మింపేట హత్యాకాండలకు ఈ నవలలో చిత్రితమయిన హింసాకాండకు తేడా ఏమీ లేదు. తెలంగాణలో 1930ల నాటి భూస్వామ్య వ్యతిరేక పోరాటాలపై నవలలు వస్తే కోస్తాలో 1960ల నాటికి కూడా రాలేదు. 1960లలో యజ్ఞం కథ వెలువడితే 1978లో కేశవరెడ్డి నవల స్మశానం దున్నేరు వెలువడింది. అంటే అక్కడ 1970ల నాటికి కూడా భూస్వామ్య సంబంధాలు యథాతథంగా ఉన్నాయన్న మాట. సీమాంధ్ర వలస పాలకవర్గాలు ఘనంగా చెప్పుకునే వలస పాలన ఒట్టి బూటకమేనని తెలియ చెబుతుంది. నిజానికి తెలంగాణ భూ సంబంధాలపై వచ్చిన నవలలన్నీ భూస్వామ్య వ్యతిరేక తిరుగుబాట్లను చిత్రించినటువంటివే. ఆళ్వారుస్వామి నవల ప్రజల మనిషి 1930ల నాటి భూస్వామ్య వ్యతిరేక రాజకీయ పోరాటాన్ని గొప్పగా చిత్రించిన నవల. 1980లలో వెలువడిన అల్లం రాజయ్య నవల కొలిమంటుకున్నది కూడా అంతే. ఈ నేపథ్యంలో తెలంగాణలో జరిగిన 1969 తిరుగుబాటు, ఇప్పటి మలిదశ ఉద్యమం

సీమాంధ్ర భూస్వామ్య వ్యతిరేక ఉద్యమమని తెలంగాణ మేధావులు చేస్తున్న వాదన సమంజసమయిందే.

సారాంశంలో చెప్పుకోవాలంటే స్మశానం దున్నేరు నవల భూస్వామ్యపు కట్టుబాట్లను జవదాటితే జరిగే పరిణామాల కథ. హింసాకాండ, అణచివేతల చరిత్ర. అది మితిమీరినప్పుడు జరిగే అంతిమ తిరుగుబాటు కథ కూడా. ఆ సంస్కృతికి కొనసాగింపే దళితులపై దాడులు. అందుకు కారంచేడు, చుండూరు, ఇటీవల జరిగిన లక్షింపేట దాడి కథ కూడా. మరోరకంగా తెలంగాణ కథ. సీమాంధ్ర పాలకుల ప్రతినిధి పెద్దిరెడ్డి ప్రభుత్వాధి నేతల ప్రతిరూపమయితే వారి హింసాకాండకు, అణచివేతకు గురయ్యే కష్టజీవులు తెలంగాణ జనసామాన్యమనుకోవాలి. ఇలా ఉంటే స్మశానం దున్నేరు నవలలో పెదిరెడ్డి తండ్రి లచ్చింవ్‌రెడ్డి పాత్ర ప్రస్తావన వస్తుంది.

కట్టుబడి, వెట్టి కూలీలు కూడా లచ్చింవ్‌రెడ్డిని ధర్మాత్ముడు, మహాత్ముడు అని కితాబు ఇస్తుంటారు. ప్రజల మనిషిలో కూడా భూస్వామి తండ్రి గొప్పవాడనే ప్రస్తావన ఉంటుంది. అంతెందుకు తెలంగాణ సాయుధ పోరాటపు ప్రతినాయకుడు విసునూరి రామచంద్రారెడ్డి తండ్రి కూడా ధర్మాత్ముడని సాయుధ పోరాట యోధుడు నల్లా నర్సింహులు రాశారు. తండ్రులంతా మంచి వాళ్లయి కొడుకులంతా నరరూప రాక్షసులు కావడానికి కారణాలేమయి ఉంటాయి. భారతదేశం మీద మార్క్స్ రచనలు చదివినప్పుడు ఇది ఆలోచించాల్సిన ప్రశ్న అనిపించింది. ఇందుకు వలస పాలకులు 1857 తర్వాత వలసవాదులు జరిపిన భారత సామాజిక వ్యవస్థ పునర్‌వ్యవస్థీకరణకు దగ్గరి సంబంధం ఉందనే అనిపించింది. వలసవాదానికి భూస్వామ్యానికి ఉన్న అధికార సంబంధాలను అర్థం చేసుకోవడానికి ఇది తప్పనిసరి. నిజానికి ఈ భూస్వాములు తల్లిదండ్రులందరూ రమారమి 1857కు ముందు బ్రిటిష్ పాలన కుదురుకోక ముందు పుట్టినవాళ్లు. అంటే బ్రిటిష్ వారి ప్రత్యక్ష, పరోక్ష పాలనకు చెందిన వాళ్లు. ఒకరకంగా మార్క్స్ రాసిన స్వయం పోషక గ్రామానికి చెందిన వాళ్లు, మతపరమయిన నైతిక సూత్రాలు, సనాతన ధర్మం ప్రవచించిన నీతిసూత్రాల ఆధారంగా జీవనం సాగించిన వాళ్లు ఈ పరిస్థితులను బాగా ప్రతిఫలించిన రచనలు ప్రసిద్ధ రచయిత విశ్వనాథ సత్యనారాయణ నవలలు. స్వయంగా సనాతన ధర్మానికి ప్రాతినిధ్యం వహించే విశ్వనాథ వలస పాలన వల్ల కుదుపులకు లోనై ఛిన్నాభిన్నమవుతున్న సంప్రదాయ గ్రామీణ జీవితపు అల్లకల్లోలాలన్ని, సంక్షోభాన్ని సంప్రదాయ పాలకవర్గం – వలస పాలకుల మధ్య సంబంధాల ఘర్షణను చిత్రించారు. ఆయన రచనలు వేయి పడగలు, బద్దన్న సేనాని, వీరవల్లుడు, మోయు తుమ్మెద, చెలియలికట్ట వరకు దీనిని చిత్రించాయి. ఒకే సమాజానికి సంబంధించి ఒక పార్శ్వాన్ని, అది ప్రధానంగా పాలకవర్గం దృష్టి నుంచి విశ్వనాథ చిత్రిస్తే మరో పార్శ్వాన్ని అంటే కష్టజీవుల దృష్టి నుంచి కేశవరెడ్డి చిత్రించారు. ఈ ఘర్షణ పర్యవసనాన్ని చిత్రించింది ప్రేంచంద్. విశ్వనాథ పాత్రల అనుభవంతో చట్టబద్ధమయిన పాలన, పట్టణ జీవితం కానీ లేవు. భూమి వ్యక్తిగత ఆస్తి అన్న భావనే లేని కాలమది. ఎవరైనా ఎక్కడయినా గ్రామాన్ని పొందిచ్చి భూమిని సాగు చేసుకోవచ్చు. స్థానిక రాజు, జమీందారులకు శిస్తు కడితే చాలు. ఎంతకాలమయినా వ్యవసాయం చేసుకోవచ్చు. భారత దేశంలోని తమ పాలిత ప్రాంతాల సమాజాలపై పూర్తి పట్టు సాధించడానికి ఉపక్రమించిన కుంఫిణీ చట్టాలను చేయడానికి ఉపక్రమించింది. అంతవరకు మొగులాయి పాలన ఉన్నందు వల్ల వారి రాజ్యనిర్వహణ తీరు పూర్తిగా వేరు. ఆస్తి సంబంధాలకు సంబంధించి వారి చూపు పూర్తిగా వేరు. పంచ భూతాలయిన భూమి, నీరు, గాలి, నిప్పు, ఆకాశంపై రాజుకు, భగవంతునికి మాత్రమే సర్వాధికారా లున్నాయని వారి అవగాహన. కుంఫిణీ పాలనతో ఈ వైఖరి మారింది. తమ వలస దోపిడీ ప్రబలంగా జరగడానికి అనుకూలంగా చట్టాలు చేసి, అమలు చేయడానికి 17వ శతాబ్దం నుంచి కుంఫిణీ 1851 నుంచి బ్రిటిష్ పాలకవర్గం ఉపక్రమించింది. ఇది భారతదేశ వ్యాప్తంగా ఆస్తి సంబంధాలలో, వ్యక్తిగత, సామాజిక సంబంధాలలో మౌలికమయిన మార్పులకు దారి తీసింది. దీనితో వ్యక్తిగత ఆస్తి అన్న వ్యవస్థ లేని కాలం నుంచి భారతీయ సమాజాన్ని వ్యక్తిగత ఆస్తి అన్న వ్యవస్థలోకి 1857లో ఏర్పడిన బ్రిటిష్ పాలన తోసివేసింది. ఇందుకు ప్రధాన కారణం బ్రిటిష్ ప్రభుత్వం దేశవ్యాప్తంగా అమలు చేసిన రైత్వారీ చట్టం. ఈ చట్టం పేరుతో సారవంతమైన భూములను కైవసం చేసుకున్న భూస్వాములు కరువులతో సంబంధం లేకుండా శ్రమ దోపిడీని నిర్బంధం చేసి, తీవ్రతరం చేయడానికి మధ్య యుగాల హింసాత్మక శిక్షలన్నిటినీ అమలు చేశారు. దీని వల్లే తల్లిదండ్రులు ధర్మాత్ములయితే కొడుకులు 18వ శతాబ్దపు చివరి పాదానికి నరరూప రాక్షసులు కావడం మొదలు పెట్టారు. దీనితో ఆస్తిపరమయిన వర్గాలు, ఆస్తి లేని వర్గాలుగా సమాజం చీలిపోయింది. భూస్వాములు, వారి కింద పనిచేసే కౌలుదారులు, వెట్టికూలీలు, చేతివృత్తుల వారిగా చీలిపోయిన వర్గ సంబంధాలు ఏర్పడ్డాయి. వలస పాలనకు, దోపిడీకి అనువయిన ఈ సంబంధాలు స్వాతంత్ర్యం సాధించి అధికార మార్పిడి జరిగే వరకు కొనసాగాయి. కౌలుదారీ చట్టం, జమీందారీల రద్దుతో రైతాంగానికి కొంత వెసులుబాటు కలిగింది. అది తాత్కాలికమే.

ప్రపంచీకరణ, నూతన ఆర్థిక విధానాల పేరుతో ప్రపంచ బ్యాంక్ కొత్త వ్యూహంతో ముందుకు వచ్చింది. భారతదేశపు సబ్సిడీ, సంక్షేమం ఇరుసుగా గల ఆర్థిక రంగం పునర్‌వ్యవస్థీకరణకు తెరదీసింది. పూర్తిస్థాయి వ్యాపార పెట్టుబడిదారీ సంబంధాలను ప్రవేశపెట్టడానికి శాయశక్తులా ప్రయత్నిస్తోంది. ఇందులో భాగమే పి.వి. నర్సింహారావు, మన్మోహన్ సింగ్ విధానాలు. ఆ క్రమంలోని సంక్షోభం వల్లే గ్రామీణ ప్రాంతాలలో పెరిగిపోయిన చేతివృత్తుల వారి, రైతాంగపు ఆత్మహత్యలు, వలసపాలనలో గ్రామీణ జనం దుస్థితికి ఇప్పటికి తేడా లేకపోవడానికి అప్పుడు పురోహిత, భూస్వామ్య వర్గమే వలస పాలకులతో కుమ్మక్కయితే, ఇప్పుడు రూపం మార్చుకున్న అదే వర్గం అమెరికా, ప్రపంచ బ్యాంక్ నయా వలస విధానాలతో కుమ్మక్కయి, భారతదేశపు ఆర్థిక రంగాన్ని అమెరికా అనుబంధ వ్యవస్థగా మార్చేందుకు దిగింది. ఈ పరిణామాల ప్రతిఫలనమే కేశవరెడ్డి రచన. వలస పాలనలో ప్రేంచంద్. ఇప్పటి ప్రపంచీకరణ నేపథ్యంలో అమెరికా వలసల కాలాన కేశవరెడ్డి. అవే పాత్రలు, అవే పరిస్థితులు, అదే దుస్థితి. కావాల్సింది మాత్రం ఆచరణ, ఏరుక.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# లెనిన్ రచన 'ఏం చెయ్యాలి?'

***నరోద్నిక్‌లు కార్మికులను ఆర్థిక పోరాటాలకే పరిమితం చేసిన తప్పుడు పోరాటాల నుండి, కార్మికుల విముక్తి కోసం లెనిన్ చేసిన పోరాట కృషిని వివరిస్తున్నారు* ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

రష్యాలో ప్రజలపై పరమక్రూరమైన జార్ నిరంకుశ పాలననూ, ప్రజలలో అత్యధికులైన పేద రైతాంగంపై తీవ్ర దోపిడీ, భూస్వాముల అణచివేతనూ, సాగిస్తున్న పీడననూ తొలగించడానికి మొదట ప్రయత్నించిన వారు నరోద్నిక్‌లు. (నరోద్ అంటే ప్రజలు అని అర్థం. ప్రజల పట్ల అంకితభావం కలవారు గనుక వీరికి నరోద్నిక్కులనే పేరొచ్చింది) అయితే నరోద్నిక్కులు రైతాంగాన్నే ప్రధాన విప్లవశక్తిగా భావించి, వీరోచితంగా పోరాడడమేగాక, ఎన్నో ఆత్మత్యాగాలూ చేసినప్పటికీ కార్మికవర్గ నాయకత్వ శక్తి గురించి ఏమాత్రం ఆలోచించ లేదు. అంతేకాదు. వీరు రైతాంగాన్నీ సరిగా అర్థం చేసుకోకపోవడం వల్ల ఎంతో నష్టపోయారు కూడా. రైతాంగాన్నీ విప్లవ పోరాటానికి సన్నద్ధం చెయ్యడం కోసం విశ్వ విద్యాలయ విద్యార్థులైన నరోద్నిక్ యువ విప్లవ మేధావులు (వీరిలో స్త్రీలు ఉన్నారు) వందలాది మంది ప్రజల వద్దకు వెళ్లుతున్నామనే పేరుతో గ్రామాలకు వెళ్లినా, అక్కడ రైతాంగ మద్దతు దొరకకపోవడంచేత అధిక సంఖ్యలో అరెస్టు కావడమో లేక సైబీరియాకు ప్రవాసం వెళ్లాల్సి రావడమో జరిగింది. ఇక మిగిలిన వారు ప్రజల మద్దతు లేకుండానే ఒంటరిగా తామే జార్ ప్రభుత్వంతో పోరాటానికి దిగి వ్యక్తిగత హింసాకాండకు పూనుకుని మరిన్ని తప్పులు చేశారు. వీరిలో తీవ్రవాద వర్గం నరోద్నవోల్య (ప్రజాభీష్టం) అనే రహస్య సంఘాన్ని ఏర్పరచి, నాటి జార్ రెండో అలెక్సేంద్ర్‌ను బాంబు దాడిలో 1881, మార్చ్ 13న చంపేశారు. అయితే ఈ హత్య వల్ల వారు ఆశించినట్లు ప్రభుత్వ నిరంకుశత్వంగానీ, భూస్వామ్య వర్గంగానీ నశించకపోగా, తర్వాత అధికారంలోకి వచ్చిన మూడో అలెక్సేంద్ర్ మరింత నిరంకుశంగా మారి నరోద్నవోల్య సంస్థని నామరూపాల్లేకుండా నాశనం చేశాడు. (నరోద్నయా వోల్య సభ్యులు ఇతరులని చంపాలని ప్రయత్నించినా, ఆ పథకం విఫలమైంది. ఈ విఫల పథకంలోనే లెనిన్ అన్న అలెక్సేంద్రని అరెస్టు చేసి, ఉరితీశారు)

నరోద్నిక్కుల ఉద్దేశంలో చరిత్ర నిర్మాతలు వీరులే తప్ప ప్రజలు కాదు. వీరి దృష్టిలో ప్రజలు ఒట్టి గుంపు మాత్రమే. ఈ గుంపు వీరుల్ని గుడ్డిగా అనుసరిస్తుంది. అంతే కనుక తాము వీరకృత్యాలు సాగిస్తే, అంటే శత్రువుల్ని వ్యక్తిగతంగా మట్టుపెడితే, అప్పుడు ప్రజలు అంటే గుంపు తమను అనుసరిస్తుందని వీరు భావించారు. ఈ కారణంచేతనే వీరు రైతాంగంలోనూ, కార్మిక వర్గంలోనూ విప్లవ కార్యక్రమాల్ని వదిలేసి, వ్యక్తి హింసకు పూనుకొని ప్రజల చొరవను అడ్డుకున్నారు. ఇంత మాత్రమేగాక నరోద్నిక్కుల వల్ల విప్లవోద్యమానికి కలిగిన అతిపెద్ద నష్టం రష్యాలో మార్క్సిజం వ్యాపించకుండా వీరు అడ్డుకోవడం. సంస్థాగతంగా నరోద్నిక్కులు ఒక శక్తిగా లేకపోయినప్పటికీ, వారి త్యాగాల వల్ల ప్రజల్లో వారికి పలుకుబడి ఇంకా నిలిచే ఉంది. అందువల్ల సోషల్ డెమోక్రసీ పేరుతో రష్యాలో వేళ్లూనుకుంటున్న మార్క్సిస్టు సంస్థలు వ్యాప్తి చెందడానికి ఈ నరోద్నిక్కులు ప్రధాన అవరోధంగా తయారయ్యారు. అందువల్ల నరోద్నిక్కులపై దాడి చెయ్యడమే మార్క్సిస్టుల మొదటి దాడి కార్యక్రమం అయ్యింది! నరోద్నిక్కులపై మొదటి దాడి ప్లెహానోవ్ నుంచి వచ్చింది. అయితే ఈ ప్లెహానోవ్ ఎవరో కాదు. ఈయన మొదట నరోద్నిక్కే. జార్ ప్రభుత్వం నుంచి ఎదురయ్యే ప్రమాదాల నుంచి తప్పించుకోవడానికి విదేశాలకు వెళ్లి, అక్కడ మార్క్సిజంతో పరిచయం ఏర్పడి, ఆ సిద్ధాంతం వల్ల ప్రభావితుడై, నరోద్నిజంతో తెగతెంపులు చేసుకోవడమేగాక, రష్యాలో మార్క్సిజాన్ని ప్రచారం చేయడం కోసం జెనీవాలో 'కార్మిక విమోచన సమితి' అనే పేర 1883లోనే తొలి మార్క్సిస్టు సంస్థను ఏర్పాటు చేశాడు. అయితే నరోద్నిక్కులను ఎదుర్కొనకుండా రష్యాలో మార్క్సిజాన్ని ప్రచారం చేయడం కష్ట సాధ్యం కనుక ఆయన నరోద్నిజంలోని లోపాలను ఎండగడుతూ, విప్లవాన్ని సాధించడానికి మార్క్సిజమే ఎలా సమర్థవంతంగా పనిచేస్తుందో తెలియజేసేందుకు పలు సిద్ధాంత గ్రంథాలు రాశాడు. అలాగే మార్క్సిజంలో పలు సమస్యలను విశ్లేషిస్తూ పలు గ్రంథాలు రాసి, రష్యాలోనేగాక, ప్రపంచస్థాయిలోనే మార్క్సిజానికి ప్రముఖ ప్రచారకుడయ్యాడు. ఈ విధంగా ప్లెహానోవ్ రష్యాలో తొలి మార్క్సిస్టు అవడమే గాక నరోద్నిక్కుల తప్పుడు భావాలపై నరోద్నిక్కులను గురి చూసి కొట్టాడు. ప్లెహానోవ్ సాగించిన పోరాటం వల్ల రష్యన్ విప్లవ మేధావుల్లో మొట్టమొదటి మార్క్సిస్టు విమర్శచేసి నరోద్నిక్కుల పలుకుబడి చాలా వరకు, నశించిందిగానీ, ఆ పని ఇంకా కొంత మిగిలే ఉంది. మార్క్సిజానికి శత్రువైన నరోద్నిజంపై చిట్టచివరిగా మరింత గట్టిదెబ్బ కొట్టడం లెనిన్ వంతయింది. అంతేగాక ప్లెహానోవ్ ప్రతిపాదించిన సిద్ధాంతం, ఎత్తుగడల్లోని కొన్ని లోపాలను సవరించి విప్లవ కార్మికోద్యమానికి గట్టి మద్దతు సంపాదించి విప్లవ విజయాన్ని ఖాయం చేయాల్సిన బాధ్యత ఆయనపై పడింది.

ప్లెహానోవ్ ప్రతిపాదించిన 'కార్మిక విమోచన సమితి' ముసాయిదాలో ఇంకా నరోద్నిక్ ముద్రలున్నాయి. అవి వ్యక్తిగత దౌర్జన్యపు ఎత్తుగడల్ని ఆచరణలో సమర్థించాయి. అంతేగాక శ్రామిక వర్గ నాయకత్వంలో రైతాంగం అండతో విప్లవం విజయం సాధిస్తుందని ఆయన గమనించ లేదు. మరొక ముఖ్యమైన విషయం ఏమంటే విప్లవానికి అండ లిబరల్ బూర్జువా అని తప్పుడు నిర్ధారణ చేసి, రైతాంగాన్ని అసలు లెక్కలోకే తీసుకోకపోవడం. ఈ విధంగా 'కార్మిక విమోచనా సమితి' సోషల్ డెమోక్రటిక్ ఉద్యమానికి సిద్ధాంత రీత్యా పునాదిని మాత్రమే, కార్మిక వర్గ ఉద్యమం వైపు మొదటి అడుగును మాత్రమే వేసింది.

తన అన్న అలెక్సాంద్ర్ ఉరితీత వల్ల తీవ్రంగా కలతచెంది లెనిన్, విద్యార్థి దశలోనే తన గమ్యం ఏమిటో నిర్ణయించుకుని ఉన్నాడు. తనదీ విప్లవ గమ్యమే అయినప్పటికీ, అన్న నడిచిన దారి మాత్రం కాదని

నిశ్చయించుకున్నాడు. (అలెక్సాండ్ర్ మార్క్సిజాన్ని కొంత అధ్యయనం చేసినప్పటికీ, అప్పటికింకా (1807 నాటికి) సోషల్ డెమోక్రటిక్ ఉద్యమం వేళ్లూనుకోనందున నరోద్నయా వోల్యా కార్యక్రమంలో పాల్గొని పట్టుబడి ఉరిశిక్షను ఎదుర్కొన్నాడు.) యూనివర్సిటీ విద్యార్థిగా బహిష్కరించబడిన లెనిన్ స్వయం కృషితో మార్క్సిజాన్ని అధ్యయనం చేసి, సమారలో ప్రవాసం ఉన్నప్పుడే సిద్ధాంతపరంగా నరోద్నిక్కులను ఎదుర్కొంటూ వివిధ విప్లవ గ్రూపు సమావేశాలలో తను రాసిన కొన్ని వ్యాసాలను చదివి వినిపించాడు. వాటికే చిన్న చిన్న సవరణలు చేసి, సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో మూడు సంపుటాలలో 'ప్రజా మిత్రుల నిజస్వరూపం – సోషల్ డెమోక్రాట్లతో వారు పోరాడే విధానం' అనే గ్రంథాన్ని 1894లో ప్రచురించాడు.

ఈ గ్రంథంలో 1890 నాటి నుండీ నరోద్నిక్కులు ఏ విధంగా విప్లవ పోరాటాన్ని విరమించుకుని జార్‌తో సమాధానపడుతున్నదీ, వీరిలో కొందరైతే కులక్కుల (ధనిక రైతుల) ప్రయోజనాల్ని కాపాడడానికి ఎలా సిద్ధపడుతున్నదీ వివరించి నరోద్నిజంపై ఆఖరి దెబ్బ కొట్టాడు. దానితో పాటు ప్లెహనోవ్ ప్రతిపాదనల్లోని లోపాలను విమర్శించి, ఆపై మార్క్సిజం చరిత్రలో మొదటిసారిగా ఒక కొత్త విషయాన్ని వెల్లడించాడు. అదేమిటంటే, జార్ ప్రభుత్వాన్నీ, భూస్వాముల్నీ, బూర్జువాలనూ కూలదోయడానికి ప్రధాన సాధనం కార్మికులు ఒక్కరు మాత్రమే కాదని, కార్మిక, రైతు సమ్మేళనమనీ చెప్పడం. (లెనినిజంలోని అతి ముఖ్య విషయాలలో ఇది ఒకటి కావడం గమనార్హం)

ఈ విధంగా నరోద్నిజానికి వ్యతిరేకంగా లెనిన్ సాగించిన పోరాటం వల్ల నరోద్నిక్కుల సిద్ధాంతం పూర్తిగా అపజయం పాలైంది. ఆ కాలంలో నరోద్నిజంపై కొందరు చట్టబద్ధ మార్క్సిస్టులు కూడా పోరాడారు. ఈ చట్టబద్ధ మార్క్సిస్టులు జార్ ప్రభుత్వం అనుమతించిన పత్రికల్లో వ్యాసాలు రాయడం మొదలుపెట్టినందువల్ల వీరిని ఆ పేరుతో (చట్టబద్ధ మార్క్సిస్టులు) పిలిచేవారు. అయితే ఈ చట్టబద్ధ మార్క్సిస్టులు పెట్టుబడిదారీ సమాజ ప్రయోజనాలకు అనుగుణంగా కార్మికోద్యమాన్ని, మార్క్సిస్టు జెండానూ ఉపయోగించుకోదలిచారు. కానీ మార్క్సిజం గుండెకాయనే – అనగా – శ్రామికవర్గ విప్లవమూ, శ్రామికవర్గ నియంతృత్వమూ అనే సిద్ధాంతాన్నే – వీరు కోసేశారు. అయితే నరోద్నిక్కులపై సాగించే పోరాటంలో తమతో కలిసి వచ్చేంతవరకూ ఈ లీగల్ మార్క్సిస్టులతో కలిసి ప్రయాణిస్తూనే ఏ మాత్రం మొహమాటం లేకుండా వారి లిబరల్ బూర్జువా స్వభావాన్ని బట్టబయలు చేశాడు లెనిన్. (ఈ లీగల్ మార్క్సిస్టులలో చాలా మంది తర్వాత 'శాసనబద్ధ ప్రజాతంత్ర వాదులు' కాడెట్లుగా మారారు. వీరే విప్లవానికి ముందు పెట్టుబడిదారుల ప్రధాన పార్టీగా ఉన్నారు. తర్వాత అంతర్యుద్ధ కాలంలో నూటికి నూరుపాళ్లూ 'వైట్‌గార్డు'లు అంటే విప్లవ శత్రువులుగా మారారు.)

ఆ విధంగా లెనిన్ సాగించిన ఈ పోరాటం వల్ల విప్లవ మేధావులు, యువకులు, విద్యార్థులు సోషల్ డెమోక్రాట్ల విప్లవ స్వభావాన్ని సరిగ్గా గ్రహించసాగారు. అలాగే నరోద్నియావోల్యా లోని యువ సభ్యులు కొందరు కూడా సోషల్ డెమోక్రాట్లకు సన్నిహితంగా రావడం మొదలుపెట్టారు. ఈ విధంగా రాజకీయంగా సోషల్ డెమోక్రాట్లు బలపడడానికి తగిన పరిస్థితులు ఏర్పడుతుండగా, వీరికి కార్యరంగం అయిన కార్మికోద్యమం కూడా బలపడడానికి తగిన పరిస్థితులు ఏర్పడసాగాయి. 19వ శతాబ్దంలో యూరప్‌ని వణికించిన పారిశ్రామిక సంక్షోభం క్రమంగా రష్యాకూ సంక్రమించి దాదాపు 3000 పరిశ్రమలు మూతపడి, లక్ష మంది దాకా కార్మికులు ఉపాధి కోల్పోగా, మిగిలిన వారి జీతాల్లో గణనీయంగా కోత విధించారు. దీంతో సోషల్ డెమోక్రాట్ల ఆధ్వర్యంలో పెద్ద పెట్టున కార్మిక సమ్మెలు 1901 నుంచి 1903 దాకా దేశవ్యాప్తంగా జరిగాయి. ఈ సమ్మెలు రాజకీయ రూపాన్ని సంతరించుకున్నాయి. అంతేకాదు, కార్మికుల సమ్మెల సెగ అటు రైతాంగాన్నీ కదిలించి, విప్లవ రైతాంగ ఉద్యమం ఉధృతంగా ప్రారంభమైంది. రైతులు భూస్వాముల భవనాలకు నిప్పుపెట్టి, వారి భూముల్ని లాక్కున్నారు. దౌర్జన్యంగా ప్రవర్తించే గ్రామోద్యోగుల్ని, భూస్వాముల్ని అంతం చెయ్యడానిక్కూడా వెనకాడలేదు. ఈ విధంగా చెలరేగిన కార్మిక, కర్షక ఉద్యమాల్ని అణచివేయడానికి జార్ సైన్యాన్ని ఉపయోగించి తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించినా, ఉద్యమాలు ముందుకు సాగుతూనే ఉన్నాయి. ఈ అణచివేతను చూసి విద్యార్థులు సార్వత్రిక సమ్మె చేశారు.

ఈ విధంగా దేశవ్యాప్తంగా ప్రజల్లోని పలు సెక్షన్లలో జార్ వ్యతిరేకత తీవ్రతరం అవుతుండగా, యువకులూ, మేధావులూ సోషల్ డెమోక్రాటిక్ పార్టీలోకి పెద్ద సంఖ్యలో రాసాగారు. అయితే వీరికి సిద్ధాంతంలోగానీ, నిర్మాణంలోగానీ అనుభవం లేదు. అంతకుముందే దేశంలో వివిధ ప్రదేశాల్లోగల సోషల్ డెమోక్రాట్లనందర్నీ ఒక నిర్మాణంలోకి ఇమిడించడానికి లెనిన్ 1898లో తను సైబీరియా ప్రవాసంలో ఉండగానే, తన పరోక్షంలో ఒక ప్రయత్నం చేసినప్పటికీ (పార్టీ మొదటి కాంగ్రెస్) సెంట్రల్ కమిటీ యావత్తూ అరెస్టయినందువల్ల, ఆ గందరగోళం అలాగే పెరిగిపోయింది. దీనికితోడు ఒకపక్క 'ఆర్థిక వాదులు' అనబడే ఒక పెద్ద ముఠా అవకాశవాద వైఖరితో కూడిన రాతలు ఈ గందరగోళాన్ని మరింత పెంచసాగాయి. వీరికి ప్రత్యేక పత్రికలూ ఉండడం గమనార్హం. 'రబోచయా మిసెల్' (కార్మికాభిప్రాయం) రష్యాలోనూ, 'రబోచయే దెలో' (కార్మికాశయం) విదేశాలలోనూ వీరి సిద్ధాంతాల్ని తీవ్రంగా ప్రచారం చేస్తున్నాయి. వీరి విచిత్రమైన వాదన ఏమంటే పార్టీలో ఉన్న సిద్ధాంత గందరగోళమూ, సుసంబద్ధ సంఘటన లేకపోవడమూ కూడా మంచిదేనని చెప్పడం. అందువల్ల ఐక్య కేంద్రీకృత కార్మికవర్గ రాజకీయ పార్టీని నిర్మించే పథకం అనవసరమని వీరు వాదించసాగారు. మరోపక్క జార్ ప్రభుత్వం ఉత్తమ కార్యకర్తల్ని ఏరి కఠిన శిక్షలకు గురిచేస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఒక కేంద్రీకృత పార్టీని నిర్మించి, దాన్ని బలోపేతం చెయ్యడానికి – అందుకోసం స్థానిక సంస్థల వెనకబాటు తనాన్నీ, స్థానిక సంకుచిత దృష్టినీ తొలగించాలి – ఎంతైనా కృషి చెయ్యాలి. ఆ పని చెయ్యాలంటే మొదట ఈ ఆర్థిక వాదుల్ని ఓడించాలి. ఈ నేపథ్యాన్ని అర్థం చేసుకుంటేగానీ లెనిన్ ప్రఖ్యాత గ్రంథం 'ఏం చెయ్యాలి?' (What is to be done) అనే రచనకు ఎందుకు పూనుకున్నదీ, ఆ గ్రంథం ప్రాముఖ్యత ఏమిటి అన్న విషయాలు అర్థం కావు.

ఇక లెనిన్ తన ఈ రచనలో ఏం చెప్పాడన్న విషయాలు తెలుసుకునే ముందు మరో ముఖ్యమైన సంగతి కూడా గమనించాలి. ఐక్య కేంద్రీకృత పార్టీని నిర్మించాలన్న లెనిన్ ఉద్దేశం నెరవేరేందుకు పార్టీ రెండో కాంగ్రెస్‌ని సమావేశపరిస్తే సరిపోతుందని కొందరు ఆయనకు సలహా ఇచ్చారు. అలా చేస్తే ఆ రెండో మహాసభే ఆ పని నెరవేరుస్తుందని వారి వాదన. అయితే అలా చెయ్యడం లెనిన్‌కు ఇష్టంలేదు. కాంగ్రెస్‌ని సమావేశపరచక ముందే ఆర్థికవాదులతో సిద్ధాంతరీత్యా విడిపోవడం మంచిదని, ఎందువల్లనంటే, ఆర్థిక వాదులు, అప్పటికే తమ అభిప్రాయాలను తమ పత్రికల్లో విస్తృతంగా ప్రచారం చేసుకున్నారు. కనుక ఇప్పుడు విప్లవ సిద్ధాంతాలూ తగినంతగా పార్టీ శ్రేణుల్లో ప్రచారం కావాలి. అలా అయినప్పుడే రెండు ధోరణుల్లోని విషయాలూ సభ్యులు తెలుసుకుని,

వాటిలో తమకేది కావాలో నిర్ణయించుకునే వీలు కలుగుతుంది. అలాగాక, హడావుడిగా కాంగ్రెస్‌ని సమావేశపరిస్తే విప్లవ సిద్ధాంతానికి నష్టం కలుగుతుంది. అందువల్ల ఈ ప్రాథమిక కార్యక్రమం పూర్తయిన తర్వాతే కాంగ్రెస్‌ని సమావేశపరచాలని లెనిన్ భావించాడు. ఈ సంగతి లెనిన్ మాటల్లోనే: 'మనం ఐక్యం అయే ముందు, ఐక్యమయేందుకు గాను, అన్నిటికన్నా ముందు మన విభేదాలను తెలియజేసే నిశ్చితమైన చెరపరాని హద్దుగీతలను (డీమార్కేషన్) గీయాలి.'

లెనిన్ అభిప్రాయం మేరకు అప్పటికే ఆయన ప్రారంభించి నడుపుతున్న 'ఇస్క్రా' పత్రిక విప్లవవాదుల సిద్ధాంతాలను ప్రచారం చేయసాగింది. అయితే ఆర్థిక వాదుల పత్రికల్లాగా 'ఇస్క్రా' పత్రిక స్వేచ్ఛగా ప్రకటించబడేది కానందున, ఆ పత్రికలో తెలియజేయాల్సిన అంశాలు ఇంకా చాలా ఉన్నందున, ఆ పత్రిక ఒక్కటే అందుకు సరిపోదని ఆయన భావించాడు. మొదట ఐక్య పార్టీని నిర్మించడానికి ఒక నిర్దిష్టమైన నిర్మాణ కార్యక్రమం ఉండాలి. ఆ కార్యక్రమాన్ని 'ఎక్కడ ప్రారంభించాలి?' (వేర్ టు బిగిన్?) అనే ప్రసిద్ధ వ్యాసంలో లెనిన్ సూచించాడు. తర్వాత ఆ కార్యక్రమాన్నే 'ఏం చెయ్యాలి?' అనే తన ప్రఖ్యాత గ్రంథంలో వివరించాడు.

మొదట పార్టీ నిర్మాణం ఎలా ఉండాలి అనే విషయాన్ని లెనిన్ వివరంగా చర్చించాడు.

'మనం కోరే నిర్మాణం దేశమంతా విస్తరించేంత పెద్దదిగా ఉండాలి. కచ్చితమైన, వివరమైన పని విభజన జరిగేందుకు వీలుగా, విశాలంగా, బహుముఖంగా ఉండాలి. అన్ని పరిస్థితుల్లోనూ, క్రొత్త మార్గం తొక్కే సమయాలలోనూ (టర్న్స్), హఠాత్ ఘటనలన్నింటిలోనూ, అది తన పనిని అచంచలంగా సాగించగలిగేందుకు అవసరమైన పరీక్ష నెగ్గిందిగానూ, కాకలుతీరిందిగానూ, శత్రువు తన యావచ్ఛక్తులనూ, కేంద్రీకరించిన సమయంలో, అతనితో ప్రత్యక్ష పోరాటాన్ని తప్పించుకోగలిగే చాకచక్యం కలదిగానూ, శత్రువు విషమ పరిస్థితి అదనుగా తీసుకొని ఎప్పుడు, ఎక్కడ శత్రువు మన దాడిని తక్కువగా అంచనా వేస్తున్నాడో అప్పుడు అక్కడ శత్రువుపై తీవ్రంగా దాడి చేసేది గాను ఆ నిర్మాణం ఉండాల'ని లెనిన్ వివరించాడు.

అలాగే పార్టీ ఆకృతి, అంగ నిర్మాణాలు (స్ట్రక్చర్ అండ్ కంపోజిషన్) ఎలా ఉండాలో ఆయన వివరించాడు. ' పార్టీ రెండు విభాగాలు కలిగి ఉండాలి. మొదటి విభాగం ముఖ్యమైన పార్టీ వర్కర్లయిన రెగ్యులర్ కేడర్స్‌తో కూడిన సన్నిహిత బృందం. వీరు విప్లవమే వృత్తిగల వారయి ఉండాలి. వీరికి పార్టీ పని తప్ప మరోపని ఉండకూడదు. కనీసం వీరు సిద్ధాంత పరిజ్ఞానంతోపాటు, నిర్మాణంలో అనుభవం, జార్ పోలీసులతో పోరాడే చాతుర్యం, తప్పించుకునే నేర్పు కలవారయి ఉండాలి. ఇక రెండో విభాగం విస్తృతమైన అల్లిక కలిగిన స్థానిక సంస్థలు. ఇవి లక్షలాది శ్రమజీవుల సానుభూతి పొందగలిగిన పార్టీ సభ్యుల బాహుళ్యం కలిగి ఉండాలి.'

ఇంకా ఆయన పార్టీ స్వభావం, ఆశయాల గురించి ఇలా వివరించాడు: 'పార్టీ, కార్మిక వర్గానికి పురోగామిగా (వేన్‌గార్డ్) ఉండాలి. శ్రామిక జనవర్గ పోరాటాన్ని నడిపిస్తూ, సమన్వయిస్తూ అది కార్మికవర్గ ఉద్యమానికి మార్గదాయక శక్తిగా ఉండాలి. పార్టీ అంతిమ ఆశయం పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోసి, సోషలిజాన్ని స్థాపించడం! తక్షణ ఆశయం జార్ ప్రభుత్వాన్ని కూలదోసి, ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని నెలకొల్పడం! జార్ ప్రభుత్వాన్ని కూలదోయందే పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోయడం అసాధ్యం!

'ఏ దేశ శ్రామికవర్గమూ ఎదుర్కోని ఒక తక్షణ కర్తవ్యాన్ని చరిత్ర మనకు విధించింది. అది అత్యంత విప్లవకర తక్షణ కర్తవ్యం. యూరప్‌లోనే గాక, ఆసియాలో కూడా అత్యంత శక్తివంతమైన 'విప్లవ ప్రతీఘాతపు కోట' (అనగా జార్ ప్రభుత్వం)ను రష్యన్ శ్రామికవర్గం తుదముట్టించాలి. ఈ కర్తవ్యపాలన వల్ల అంతర్జాతీయ విప్లవ శ్రామిక వర్గానికి రష్యన్ శ్రామికవర్గం పురోగామి (వేన్‌గార్డ్) అవుతుంది.'

'పాక్షిక కోర్కెల కోసం ప్రభుత్వంతో పోరాటం చేస్తూ, వాటిలో కొన్నింటిని సాధించడం అనేది శత్రువు శివారు ప్రాంతాలపై జరిపే చిన్న చిన్న దాడుల వంటివి మాత్రమేనని మనం గుర్తించాలి. అసలైన నిశ్చిత పోరాటం ఇక ముందుంది. మన ముందు శత్రువు కోట యావచ్ఛక్తితోనూ నిలిచి ఉంది. అది తుపాకీ గుళ్లనూ, ఫిరంగి గుళ్లనూ కురిపిస్తూ, మన ఉత్తమ యోధుల్ని రంపపుకోతకోస్తోంది. కనుక ఈ కోటను మనం పట్టుకోవాలి. జాగృతమవుతున్న శ్రామికవర్గ శక్తులతోటి, రష్యన్ విప్లవకారుల శక్తులన్నిటినీ కలిపి ఒక పార్టీ ఏర్పరచినట్లయితే ఆ కోట మన స్వాధీనమవుతుంది. కనుక పార్టీలోకి రష్యాలోని చిత్తశుద్ధిగల ఉత్సాహవంతులందర్నీ ఆకర్షించాలి.'

కార్మికవర్గ పార్టీని నిర్మించడానికి లెనిన్ వేసిన పథకం సారాంశమిది.

అయితే ఇలాంటి పార్టీ నిర్మాణం ఇష్టంలేని 'ఆర్థికవాదులు' ఈ పథకానికి తూట్లు పొడవడానికి వెంటనే పూనుకున్నారు. వారీ విధంగా వాదించారు: 'జార్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిపే రాజకీయ పోరాటం అన్ని వర్గాలకూ చెందింది. ముఖ్యంగా పెట్టుబడిదారులకు చెందింది. అందువల్ల దానికి కార్మికవర్గం అంత ప్రాధాన్యతను ఇవ్వాల్సిన అవసరం లేదు. అధిక జీతాలకోసం, పని పరిస్థితుల మెరుగుదల కోసం, యజమానులపై ఆర్థిక పోరాటాలు సాగించడంలోనే కార్మికుల నిజమైన ప్రయోజనం దాగి ఉంది. అంచేత సోషల్ డెమోక్రాట్ల ప్రధాన, తక్షణ కర్తవ్యం – 'యజమానులపైన, ప్రభుత్వంపైన కార్మికులు సాగించే ఆర్థిక పోరాటా'న్ని సంఘటితపరచడమే తప్ప, జార్ ప్రభుత్వంపై పోరాటానికి గానీ, దాన్ని కూలదోయడానికి గానీ కాదు. ప్రభుత్వంపై ఆర్థిక పోరాటం అంటే – ఎక్కువ సౌకర్యాలు కలిగించే ఫ్యాక్టరీ చట్టం కోసం పోరాటం అన్నమాట. అందువల్ల ఆర్థిక పోరాటానికి దానంతట దానికే రాజకీయ స్వభావం కలిగించడం సాధ్యం'.

పై విధంగా వాదించిన ఆర్థికవాదులు కార్మికవర్గానికి ఒక రాజకీయ పార్టీ ఉండాల్సిన అవసరం లేదని బహిరంగంగా చెప్పడానికి సాహసించలేదు గానీ, కార్మికవర్గ ఉద్యమానికి మార్గదర్శక శక్తిగా పార్టీ ముందుండకూడదని మాత్రం గట్టిగా చెప్పారు. అప్రయత్నంగా వచ్చే కార్మికవర్గ ఉద్యమాన్ని నడపడం అలా ఉంటే, పార్టీ అసలు దాంట్లో జోక్యం కలిగించుకోరాదని కూడా వీరన్నారు. ఉద్యమం తోక వెంట పార్టీ నడిచి, దాన్ని పరిశీలించి గుణపాఠాలు నేర్చుకోవాలని వీరు చెప్పారు. అంతటితో ఊరుకోక, కార్మికుల మనసుల్ని సోషలిస్టు చైతన్య స్థాయికి సోషల్ డెమోక్రాట్లు తీసుకుపోకూడదనీ, పైపెచ్చు సోషల్ డెమోక్రాట్లే – సాధారణ కార్మికుల స్థాయికి, ఇంకా మాట్లాడితే వెనకబడ్డ కార్మికుల స్థాయికి దిగిపోవాలనీ వాదించారు. అప్రయత్నంగా వచ్చిన కార్మికవర్గ ఉద్యమం దానంతటదే సోషలిస్టు చైతన్యాన్ని పొందే దాకా వారు వేచి ఉండాలని 'ఆర్థిక వాదులు' వాదించారు. అంతేగాక, లెనిన్ సూచించిన పార్టీ నిర్మాణ పథకం – అప్రయత్న ఉద్యమంపైన దాదాపు ఒక హింసాచర్యగా కూడా వర్ణించేందుకు 'ఆర్థిక వాదులు' తెగబడ్డారు.

'ఆర్థికవాదులు' ఈ అవకాశవాద తత్వంపై లెనిన్ 'ఇస్క్రా' పత్రికలోనే

గాక, 'ఏం చెయ్యాలి?' అనే గ్రంథంలో కూడా తీవ్రస్థాయిలో దాడిచేసి, వారి వాదాన్ని తుత్తునియలు చేశారు. ఆయన ఇలా చెప్పాడు:

'జార్ ప్రభుత్వంపైన కార్మికవర్గం రాజకీయ పోరాటం చెయ్యకుండా, ప్రభుత్వంపైన, పెట్టుబడిదారులపైన కేవలం ఆర్థిక పోరాటాలు మాత్రమే చెయ్యాలని చెప్పడం – కార్మికుల్ని శాశ్వతంగా దాస్యంలో ఉండేట్లు చెయ్యడమే. వారు చెప్పిన ఆర్థిక పోరాటం అంతరార్థం ఏమిటి? తమ శ్రమశక్తిని పెట్టుబడిదారులకు అమ్ముకోవడంలో మంచి షరతుల కోసం పోరాడే ట్రేడ్ యూనియన్ పోరాటం తప్ప, వేరు కాదు. అయితే తమ శ్రమశక్తిని అమ్ముకోవడంలో మంచి షరతుల కోసమే గాక, కార్మికులు పెట్టుబడిదారీ విధానం రద్దు చెయ్యడం కోసం కూడా పోరాడదలిచారు. ఎందుకంటే, తమ శ్రమశక్తిని అమ్ముకోవాల్సిన దుస్థితి తెచ్చిందీ, దోపిడీకి గురై బాధపడేట్లు చేసిందీ ఈ పెట్టుబడిదారీ విధానమే కదా! కానీ, పెట్టుబడిదారీ విధానానికి కావలి కుక్కయిన జార్ ప్రభుత్వం తమ ఉద్యమ పంథాలో ప్రతిబంధకంగా ఉన్నంత కాలం కార్మికులు పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగానూ, సోషలిజం కోసమూ తమ పోరాటాన్ని పూర్తి చెయ్యలేరు. అంచేత మార్గమధ్యం నుండి జార్ ప్రభుత్వాన్ని తొలగించి, సోషలిజానికి మార్గం సుగమం చేయడం పార్టీకీ, కార్మికవర్గానికీ కూడా తక్షణ కర్తవ్యం!'

'ఐక్య కార్మికవర్గ ఉద్యమంలోకి అప్రయత్న క్రమాన్ని పొగడడం అంటే – పార్టీకి నాయకత్వ పాత్ర ఉందన్న విషయాన్ని నిరాకరించడమే. అంటే జరుగుతున్న ఘటనల్ని చిత్రించటమే పార్టీ పని అనడం అన్నమాట! అంటే 'ఖ్వోస్టిజం' (రైలు పట్టాల వెంటబడి పోవడం – తోకపట్టుకు పోవడం) ను బోధించడమే. దీని వల్ల ఘటనలు వాటి ఇష్టం వచ్చిన మార్గాన్ని పట్టనివ్వడం, ఉద్యమం నిశ్చేష్టిత శక్తిగా, అప్రయత్న ఉద్యమ క్రమానికి తోకగా పార్టీని మార్చాలని బోధించడం తప్ప వేరుకాదు. మరో విధంగా చెప్పాలంటే కార్మికవర్గానికి పార్టీ లేకుండా నిరాయుధం చెయ్యడమే! ఒకవైపున ఆపాదమస్తకం సాయుధమైన జారు ప్రభుత్వం, మరోపక్క కొత్త పద్ధతుల్లో కార్మికవర్గాన్ని అణచి ఉంచడానికి తమ పార్టీని నిర్మించుకున్న పెట్టుబడిదారులూ ఉంటే, కార్మికవర్గానికి ఆయుధాలు లేకుండా చెయ్యడం దానికి ద్రోహం చెయ్యడం తప్ప, వేరు కాదు.'

ఇంతటితో ఆగక, లెనిన్ దాడి మరింత పదునుదేరింది. అప్రయత్న కార్మికోద్యమాన్ని పూజించడమంటే సోషలిస్టు చైతన్యం ప్రాముఖ్యాన్ని తక్కువ చెయ్యడమేనని, చైతన్యం పొందుతున్న కార్మికుల్ని అవమానించడమేనని, అవకాశం అనే ఊబిలో దిగజారడమేనని చెప్పాడు. అలాగే విప్లవ సిద్ధాంతం లేనిదే విప్లవోద్యమమే లేదని, బాగా అభివృద్ధి పొందిన సిద్ధాంతం చేత నడపబడే పార్టీయే ముందుండి పోరాడే (వేన్‌గార్డ్ ఫైటర్) పాత్రను నిర్వహించగలదనీ అన్నాడు. అలాగే అప్రయత్న ఉద్యమం గురించి 'ఆర్థిక వాదులు' వాదించడం కార్మిక వర్గాన్ని మోసగించడానికేననీ, నిజానికి సోషలిస్టు సిద్ధాంతం అప్రయత్న ఉద్యమం నుండి గాక, విజ్ఞాన శాస్త్రం (సైన్సు) నుండి తలెత్తుతుందనీ, ఇంకా వీరు కార్మికవర్గానికి సోషలిస్టు చైతన్యాన్ని అందించాల్సిన ఆవశ్యకతను నిరాకరించడం ద్వారా బూర్జువా సిద్ధాంతానికి మార్గం సుగమం చేస్తున్నారనీ, తద్వారా కార్మికవర్గ ఉద్యమాన్నీ, సోషలిజాన్నీ ఐక్యం చెయ్యాలనే భావాన్ని పాతిపెడుతూ, బూర్జువాజీకి సాయపడుతున్నారనీ ఆయన తీవ్రంగా విమర్శించాడు.

ఈ విధంగా ఆర్థికవాదం వల్ల కలిగే నష్టాల్ని వివరించిన లెనిన్, పార్టీ వాదులకు ఈ విధంగా విజ్ఞప్తి చేశాడు: 'బూర్జువా సిద్ధాంతాన్నో, సోషలిస్టు సిద్ధాంతాన్నో – ఈ రెంటిలో ఏదో ఒక దాన్ని కార్మికులు ఎన్నుకోవాలి. మరో మార్గం లేదు. ఏ విధంగానైనా సోషలిస్టు సిద్ధాంతాన్ని చిన్నచూపు చూడడం అంటే, సోషలిస్టు సిద్ధాంతం నుండి స్వల్పంగానైనా వెనుదిరగడం! దీన్నింకా విడమర్చి చెప్పాలంటే బూర్జువా సిద్ధాంతాన్ని బలపరచడమే తప్ప వేరు కాదు. కనుక ఈ ఆర్థిక వాదులు కార్మిక వర్గాన్ని స్వతంత్రం చేసే 'సామాజిక విప్లవ పార్టీ'ని గాక, పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని రక్షించే 'సామాజిక సంస్కరణ పార్టీ'ని కోరుతున్నారు కాబట్టి, ఆర్థికవాదులు శ్రామికవర్గ ప్రధాన ప్రయోజనాలకు ద్రోహం చేస్తున్న సంస్కరణ వాదులు మాత్రమే. మరో విషయం ఏమంటే, ఈ ఆర్థికవాదం రష్యాలో హఠాత్తుగా పుట్టింది కాదు. పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీల్లో ఈ ఆర్థిక వాదులకు మిత్రులున్నారు. అక్కడ ఆ పార్టీల్లో ఈ అవకాశవాద ధోరణి బలపడుతోంది. వారు మార్క్స్‌ను 'విమర్శించే స్వాతంత్ర్యం' కావాలనే వంకతో, మార్క్సిస్టు సిద్ధాంతాలను సంస్కరించాలని (సరిదిద్దాలని) అన్నారు. (అంచేత వీరికి 'కుసంస్కర్త'లనే పేరొచ్చింది!) అయితే వీరి అసలు ఉద్దేశం విప్లవాన్నీ, సోషలిజాన్నీ, శ్రామిక వర్గ నియంతృత్వాన్నీ పరిత్యజించడమే. ఇదే రష్యన్ ఆర్థికవాదుల పాలసీ కూడా!'

ఆర్థిక వాదాన్ని దునుమాడిన ఈ గ్రంథం 1902లో ప్రచురించబడింది. ఈ ప్రచురణ తర్వాత ఒక సంవత్సరానికి ఆర్.ఎస్.డి.ఎల్.పి. (రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ) రెండో కాంగ్రెస్ జరిగింది. అప్పటికి ఈ గ్రంథం ప్రచురణ ప్రచారంలోకి వచ్చినందున 'ఆర్థిక వాదం' సిద్ధాంతం ఒక మాయని మచ్చ తాలూకు స్మృతిగా మిగిలి పోయింది. ఆర్థికవాదులని పిలవబడటం అవమానకరమని బహుళ సంఖ్యాకులు భావించారు.

ఆ విధంగా ఆర్థికవాదం సిద్ధాంతరీత్యా సంపూర్ణ పరాజయం పొందడం వల్ల అవకాశవాదం, ఖ్వోస్టిజం, అప్రయత్న ఉద్యమం (స్పాంటెనిటీ) మొదలైన వాటి సిద్ధాంతాలు కూడా సంపూర్ణ పరాజయం పొందాయి.

అయితే ఇంత మాత్రంచేతనే 'ఏం చెయ్యాలి?' అనే గ్రంథ ప్రాముఖ్యం తీరిపోలేదు. దీని చారిత్రక ప్రయోజనం మరికొన్ని అంశాల్లో కనబడుతుంది. అవేమిటో చూద్దాం:

1) ఈ గ్రంథం ద్వారా లెనిన్ మార్క్సిస్ట్ ఆలోచనా క్రమ చరిత్రలో తొలిసారిగా అవకాశవాద సిద్ధాంత బీజాలేమిటో బట్టబయలు చేశాడు. అప్రయత్న కార్మికోద్యమాన్ని పూజించడంలోనూ, కార్మికవర్గ ఉద్యమంలో సోషలిస్టు చైతన్యం పాత్రను తక్కువచేసి చూడడంలోనూ ముఖ్యంగా ఈ సిద్ధాంత బీజాలున్నాయని ఆయన తెలియజేశాడు.

2) సిద్ధాంతం, చైతన్యం ప్రాముఖ్యాన్ని తెలియజెయ్యడమే గాక, అప్రయత్న జనిత కార్మికోద్యమానికి కూడా నాయకత్వం వహించి, దాన్ని విప్లవోద్యమంగా మార్చే పార్టీ ప్రాముఖ్యతను లెనిన్ స్పష్టం చేశాడు.

3) మార్క్సిస్ట్ పార్టీ అంటే కార్మికవర్గ ఉద్యమంతో సోషలిజాన్ని మిళితం చెయ్యడమే అన్న ప్రధాన మార్క్సిస్టు సిద్ధాంత ప్రతిపాదనను (థీసిస్) అత్యంత నైపుణ్యంతో లెనిన్ నిరూపించాడు.

4) మార్క్సిస్ట్ పార్టీ సిద్ధాంత పునాదుల్ని అద్భుతంగా విశదం చేశాడు.

ఈ గ్రంథంలో లెనిన్ వివరించిన సిద్ధాంత ప్రతిపాదనలే అటు తర్వాత బోల్షివిక్ సిద్ధాంతానికి పునాది కావడం గమనార్హం!

(త్వరలో విడుదల కాబోతున్న 'లెనిన్ జీవితం, రచనలు, కృషి' అనే గ్రంథం ఆధారంగా)

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

# ఆకాశంలో సగం - అడుగు భూమి లేదు

***మహిళలు పురుషులతో సమానంగా, కొన్నిసార్లు వారి కంటే ఎక్కువగా శ్రమలో పాల్గొంటున్నా వారికి ఏ రంగంలోనూ సమాన హోదా దక్కడం లేదని అంటున్నారు*** **డా. జి. లచ్చయ్య**

వామనుడు మూడడుగుల నేలనడిగి అపర దానకర్ణుడు, మంచి పరిపాలనదక్షుడైన బలి చక్రవర్తిని అధఃపాతాళానికి తొక్కి వేశాడు. మనిషి జీవితానికి నేల ఎంత ముఖ్యమో ఈ ఇతిహాసం తెలియజేస్తుంది. మదర్ ఇండియా సినిమాలో భూస్వామి కబంధ హస్తాల నుంచి నేల తల్లిని రక్షించుకోవడానికై తన కుమారులతో నాగటి కాడిని తన మెడపై పెట్టుకొని నటి నర్గీస్ లాగిన దృశ్యం నేటికీ కళ్లల్లో మెదులుతూ ఉంటుంది. నేల తల్లి విముక్తి కోసం ఓ తల్లి పోరాడిన ఘటనకు ఆ సినిమా నేటికీ నిదర్శనం! ఓ చక్కని ఆదర్శం కూడా. ఇలాంటి వందలాది కథనాలని నాటి నుంచి నేటి దాకా భూమిపై హక్కుల కోసం, భూ విముక్తి కోసం పోరాటాలు సాగుతూనే ఉన్నాయి. అయినా నాడు, నేడు భూమి చుట్టే రాజకీయాలు, ఆర్థిక విధానాలు తిరుగుతూ ఉన్నాయి. సామ్రాజ్యాల కోసం సామ్రాజ్యవాదం దేశాలను కబలిస్తూ ఖండాంతరాలను దాటింది. రవి అస్తమించని సామ్రాజ్య స్థాపనలు జరిగాయి. యుద్ధాలు జరిగాయి. మహాభారత యుద్ధం ఈ భూమి కోసమే జరిగింది.

నిజానికి భూమి ఓ యాంత్రిక ఉత్పత్తి సాధనమే కాక, మొత్తం జీవరాశి పుట్టుకకు మూలకారణం. వృక్షాలకు, జంతువులకు ఆవాస ప్రాంతం. మనం ప్రగాఢంగా నమ్ముతున్న దేవ భూమి కూడా. ఈ భూమి ద్వారా సృష్టించబడిన మానవుడు, ఎంతెంతెగా తెలివి తేటలను సంతరించుకుంటూ పోతూ ఉంటే, అంతే స్వార్థంతో భూమినే స్వంతం చేసుకుంటూ, ఆధిపత్య ధోరణితో, చివరికి నేల తల్లికే ఉపద్రవాన్ని కలిగిస్తున్నాడు. మరోవైపు అశేష ప్రజానీకం గుంటెడు భూమి కోసం భూ పోరాటాల్ని చేస్తుండగా మరికొంత మంది ఉన్న భూమిని సాగు చేసుకుంటూ, తాము పస్తులుండైనా పది మందికి అన్నం పెడుతున్నారు. ఏ కాలంలోనైనా భూమి గురించి మాట్లాడితే, పురుషుని చుట్టే భూమి తిరగడం కనపడుతుంది. ఉత్పత్తి వనరుగా, ఆర్థిక వనరుగా, రాజ్యంగా, దేశంగా చూసినా ఆధిపత్య ధోరణంతా పురుషునిదే. నాటి రాచరిక వ్యవస్థ నుండి నేటి దేశాధ్యక్షుల దాకా పురుషులదే రాజ్యం. ఒక శాతం కూడా దేశాధినేతలుగా రాణించిన మహిళలు లేరు. ఇక వ్యవసాయ ఉత్పత్తి రంగంలో చూసినట్లైతే మహిళల శ్రమలేని చేను, చెలకా లేదు. ఉదయం నుంచి సాయంత్రం దాకా, సంవత్సర కాలమంతా దాదాపు 80 శాతం పనిని మహిళలే నిర్వహిస్తారు. గిరిజన సమాజాల్లో చూసినట్లైతే అత్యధిక శాతం సమయాన్ని వ్యవసాయానికి, వ్యవసాయ అనుబంధ పనులకే మహిళ జీవితాన్ని ధారపోస్తోంది. ఎందుకంటే గిరిజనుల ఆవాసమే వ్యవసాయ అనుబంధంగా ఉంటుంది. (ప్రపంచంలో అత్యధికంగా శ్రమచేసే మహిళలుగా బంజార, లోహర్ (కేరళ) మహిళలని గుర్తించారు.) ఇక గ్రామీణ స్థాయి మొత్తం ఆర్థిక వ్యవస్థకు మహిళలే మూలకారణం. కొన్ని ముఖ్యమైన పనులైన దున్నడం, పంటనూర్పిళ్లు, పంటల రవాణా, మార్కెట్ వ్యవస్థను మాత్రం పురుషులు చూసుకోగా, విత్తడం, నాటడం, కలుపు తీయడం, పంటల్ని రక్షించడం, కోత కోయడం, పండిన పంటల్ని శుభ్రం చేయడం, ఆరబెట్టడం, దాచడం లాంటి తదితర పనులన్నింటిని మహిళలు నిర్వహించడమే కాకుండా, ఇంటి పనితో పాటుగా వంట పనిని, పిల్లల్ని కని పెంచడం, పోషించడం మొదలగు మొత్తం పనులను మహిళలే నిర్వహిస్తారు. ఈ లెక్కన చూసినప్పుడు వ్యవసాయ రంగంలో, ఇంటి యాజమాన్యంలో మహిళల శ్రమకు వెల కట్టలేం. మహిళలు లేకుండా అటు వ్యవసాయ రంగాన్ని, ఇంటిని చూడలేం, ఊహించలేం. పురుషుడు లేకుండా ఇంటిని, వ్యవసాయాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ, కుటుంబ భారాన్ని మొత్తంగా మోసే మహిళలు ప్రపంచవ్యాప్తంగా కనపడతారు గాని, మహిళలు లేకుండా వ్యవసాయాన్ని, కుటుంబాన్ని నడిపే పురుషులు ఒక్కరంటే ఒక్కరు వెతికినా దొరకరు.

మనం బస్సుల్లో, రైళ్లో ప్రయాణం చేస్తూంటే ఇలాంటి దృశ్యాలు స్పష్టంగా కనపడతాయి. ఏ వ్యవసాయ క్షేత్రంలో చూసినా – అవి స్వంత భూములైనా, కౌలు భూములైనా, పని చేస్తూ కనిపించేది మహిళలే. పెద్ద పెద్ద వ్యవసాయ క్షేత్రాల్లో కూలీ చేసే జనమంతా మహిళలే. నడుము వంచి అన్ని రకాల వ్యవసాయ పనుల్ని చేసే గొప్ప శక్తిని ప్రకృతి మహిళలకు ఇచ్చింది. ముఖ్యంగా మహిళల శరీర నిర్మాణమే ఇంతటి శ్రమను భరించడానికి ప్రకృతి తీర్చిదిద్దిందని, శరీర నిర్మాణ, మానవ శాస్త్ర శాస్త్రజ్ఞులు అనేక సందర్భాల్లో ప్రస్తావిస్తూ ఉంటారు. ఈ విధమైన ప్రకృతి ప్రసాధారితమైన మహిళ, సునాయసంగా తన నెత్తిపై శరీర బరువులో సగం బరువును మోస్తూ, చంకలో పిల్లల్ని పెట్టుకొని మడికట్ల గెట్లపైన నడవడం, కాలువల్ని దాటడం, దిబ్బల్ని, గుట్టల్ని ఎక్కడం, పట్టణ నిర్మాణ రంగంలో పలు అంతస్తుల భవనాల్ని ఎక్కడం నిత్యం కనపడే దృశ్యాలే. ఉదయం, సాయంత్రం సుదూర ప్రాంతాల నుంచి నెత్తిపై మూడు, నాలుగు వరసల కుండల్ని పెట్టుకొని నీటిని, వంట చెరుకుల్ని తేవడం నాటి నుంచి నేటి దాకా చేస్తూ కుటుంబాన్నే కాదు, మొత్తం సమాజాన్ని పోషిస్తున్నది మహిళలే. బాగా అభివృద్ధి చెందిన దేశాల్లో పరిస్థితి కొంచెం భిన్నంగా ఉందేమో గాని, లాటిన్ అమెరికా, ఆఫ్రికా, పశ్చిమాసియా, తూర్పు ఆసియా దేశాలతో సహా, సోషలిస్టు దేశాలలో కూడా మహిళలు ద్వితీయ శ్రేణి మనుషుల్లాగనే పరిగణించబడుతున్నారు. ప్రపంచం మొత్తంగా చూసినపుడు కింది, మధ్యతరగతి కుటుంబాల్లో కుటుంబ భారాన్ని, బాగోగుల్ని ఆర్థిక సమస్యల్ని చూస్తున్నది, ఎదుర్కొంటున్నది మహిళలే అనేది కాదనలేని సత్యం. ప్రపంచ సంపదలో సగం కన్నా ఎక్కువ వాటా మహిళల శ్రమ ద్వారా సమకూరిందంటే అతిశయోక్తి కాదు.

ఇంతటి విశిష్టత కలిగిన మహిళల పరిస్థితి ప్రపంచ వ్యాప్తంగా, అన్ని వర్గాల్లో ఒకే విధంగా ఉండడం గమనార్హం. మహిళలకు దేనిపైనా హక్కు లేదు. చివరికి కన్నపిల్లలపై కూడా పురుషాధిక్యతనే అత్యధికంగా కనపడుతుంది. నిజానికి గతంలో అన్ని మాతృస్వామ్య వ్యవస్థలే. తల్లి కేంద్రంగానే కుటుంబాలు నిర్వహించబడేవి. తల్లి వాస్తవం కాగా, తండ్రి ఒక నమ్మకం మాత్రమే. ఇలాంటి విశిష్ట స్థాయి నుంచి నాగరికత పేరున, అభివృద్ధి పేరున, సామాజిక మార్పు పేరున మహిళలకు గల హక్కుల స్థానాన్ని పురుషుడు కొల్లగొట్టి, శ్రమను మాత్రం ఆమెకే అంటగట్టి, అత్యధిక సుఖాన్ని అనుభవిస్తున్నాడు. వీటికనుగుణంగానే చట్ట సభల ద్వారా (90 శాతం పైగా పురుషులే ఉంటారు) రాజ్యాంగాన్ని ఏర్పర్చుకోవడం, మార్పులు చేసుకోవడం జరుగుతోంది.

పురుషుడి కోసమే రాజ్యాన్ని, రాజ్యాంగాన్ని, చట్ట సభల్ని ఏర్పర్చుకోవడం, వాటికై యుద్ధాలపైన యుద్ధాల్ని చేయడం జరుగుతోంది. ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థ నుంచి, నేటి ఆధునిక వ్యవస్థ దాకా జరిగిన, జరుగుతున్న మారణకాండ అంతా పురుషుల ద్వారానే జరగడం గమనార్హం. అది రాజ్యహింస కావచ్చు. దీన్ని ఎదుర్కొనే ప్రతి హింస కావచ్చు – ఏ హింసలోనైనా సమిధలవుతున్నది మహిళా ప్రపంచమే. నేరుగా జరిగిన యుద్ధాల్లో మరణిస్తే పురుషులు మరణించవచ్చు గాని, ఆ యుద్ధాల నేపథ్యంలో ఆత్మబలిదానాల్ని (సతీ సహగమనాల వరుస), అత్యాచారాల్ని (సైనికులచే) (గత పన్నెండు సంవత్సరాలుగా సైనికుల అత్యాచారాలకు వ్యతిరేకంగా వారికున్న ప్రత్యేక హక్కుల చట్టం – ఆర్మ్‌డ్ ఫోర్సెస్ స్పెషల్ పవర్ ఆక్ట్–కు వ్యతిరేకంగా మణిపూర్‌లో ఇరోం షర్మిల తన 28వ ఏట నుంచి ఆమరణ నిరాహార దీక్ష చేస్తోంది) ఎదుర్కొంటున్నది కూడా మహిళలు, పిల్లలే. మొదటి, రెండవ ప్రపంచ యుద్ధంలో, ఇజ్రాయిల్ – పాలస్తీనా, ఇరాక్ – ఇరాన్, వియత్నాం – అమెరికా, పాకిస్తాన్ – ఇండియా – బంగ్లాదేశ్ తదితర దేశాల మధ్య జరిగిన యుద్ధాలతో సహా, జాతి విముక్తి పోరాటాలు జరుగుతున్న శ్రీలంక, భారత్‌లోని ఈశాన్య రాష్ట్రాలతో సహా, మధ్య భారత్‌లోని చత్తీస్‌గడ్, జార్ఖండ్ తదితర రాష్ట్రాల్లో పదుల, వందల సంఖ్యల్లో మరణిస్తున్న వారిలో మహిళలు కూడా ఉంటున్నారు.

ఇక ఈ మధ్యన చోటు చేసుకుంటున్న రైతుల, చేనేత కార్మికుల ఆత్మహత్యల్లో మహిళలు కూడా ఉంటున్నారు. ఈ విధంగా ఎక్కడ చూసినా, ఏ లెక్కన చూసినా మహిళల దీనావస్థలు కనపడుతూ ఉంటాయి. ఇటు జనాభాలో, అటు ఉత్పత్తి రంగాల్లో సగానికి పైగా ఉన్నా, మహిళలకు మాత్రం తనకంటూ ఏమీ లేకుండా ఉండడం నేటి సరళీకృత, ప్రపంచీకరణ నేపథ్యంలో తీవ్రంగా ఆలోచించాల్సిన అంశమే. చిన్నప్పుడు తల్లిదండ్రుల కనుసన్నల్లో, పెళ్లి తర్వాత భర్త చేతిలో, ఆదరిస్తే తర్వాత కొడుకుల చేతుల్లోనే మహిళల జీవితం కొనసాగుతూనే ఉంటుంది తప్ప, స్వతంత్రంగా బతికే వ్యవస్థ ఇంకా రూపుదిద్దుకోలేదు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అనాథలలో పిల్లల తర్వాత అత్యధికులు మహిళలు కావడం గమనార్హం. (మథురాలోని భర్తలు లేని మహిళలే దీనికి ఉదాహరణ.) ఆర్థిక స్వాతంత్ర్యం కొంతమేరకు పెరిగినా ఆలోచనా స్వాతంత్ర్యం మహిళలకు దాదాపుగా ఎప్పుడూ కరువే. కొన్ని ప్రజాస్వామిక దేశాల్లో రాజకీయ అవకాశాలు లభించినా, కుర్చీలో కనపడేది మహిళలే అయినా, కుర్చీ వెనుక రాజకీయాలన్నీ పురుషుడి కనుసన్నల్లోనే జరుగుతాయి. చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర పోలిట్ బ్యూరోలో ఒక్కరంటే ఒక్కరు మహిళలుండక పోవడాన్ని గమనించాలి. (మొన్న జరిగిన 18వ కాంగ్రెస్‌లో ఒకే ఒక మహిళకు మొదటిసారి పోలిట్‌బ్యూరో స్టాండింగ్ కౌన్సిల్‌లో స్థానం లభించింది.) నిజానికి చెప్పాలంటే, కరుడుగట్టిన మత ఛాందస అరబ్ దేశాలైన ఇరాక్, లిబియా తదితర దేశాల్లో మహిళలకు సముచిత స్థానాన్ని సద్దాం హుస్సేన్, కల్నల్ గడాఫీలు కలిగించారు. సద్దాం హయాంలో అత్యధికంగా సిఇఒలు మహిళలే. గడాఫీ రక్షణార్థం ఉన్న కమాండోలు అత్యధికంగా మహిళలే. ప్రజాస్వామ్యమని గొంతు చించుకుంటున్న అమెరికాకు నేటివరకు ఓ మహిళ అధ్యక్షురాలు కాలేకపోవడం కాదు కదా, కనీసం పోటీ చేయాలనే (హిల్లరీ తప్ప) ఆలోచన రాకపోవడం గమనించాలి. మన దేశంలోని చట్ట సభల్లో 33 శాతం రిజర్వేషన్ కల్పించాలనే మహిళా బిల్లు నేటికీ చర్చలకే పరిమితం కావడం శోచనీయం.

ఈ విధంగా మహిళల ప్రాతినిధ్యం రాజకీయాల్లో ఉంటుండగా, ఆస్తి హక్కు విషయంలో మహిళలకు ఆది నుంచి అన్యాయమే జరుగుతోంది. భూమి, భూమితో పాటుగా ఇతర స్థిరాస్తులన్నీ వందకు వంద శాతం పురుషుల పేరుననే ఉంటూ వస్తున్నాయి. ఈ మధ్యన పట్టణ ప్రాంత ఆస్తుల్లో కొంతమేరకు మహిళల పేరున ఉంటున్నా, ఇదంతా పన్నుల ఎగవేత కోసం, దోపిడీ చేసి పోగు చేసిన ఆస్తుల్ని దాచుకోవడం కోసం మాత్రమే చేస్తున్నారు తప్ప మహిళాభ్యుదయం కోసం కాదు. అయినా వీటి లావాదేవీలు, అమ్మకాలు పురుషులే చూసుకుంటూ ఉంటారు.

మన దేశంలో భూ పరిమితి చట్టాలు అమలులోకి వచ్చిన తరువాత మిగులు భూమిని మాత్రం భార్య పేరున, కూతుళ్ల పేరున మార్చడం జరిగినా, సర్వహక్కులు మాత్రం కుటుంబ యజమానులదే. ఈ లెక్కన ఒక శాతం భూమి కూడా మహిళలకు హక్కుగా సంక్రమించలేదు. భర్త, లేకుంటే కుమారులు, అల్లుండ్లు, మరుదులు మహిళల పేరున గల భూ వ్యవహారాలన్ని చూడడం జరుగుతోంది. ఈ విధంగా భూమి చుట్టూ తిరిగే కథనంలో శ్రమంతా మహిళలదే. అయినా వాటిపై హక్కు మాత్రం శూన్యం. అంటే వంటశాలలో స్త్రీదే ప్రధాన పాత్ర అయినా, వంట పాత్రలపై పేర్లు మాత్రం ఇంటి యజమానియైన పురుషునిదే ఉన్నట్లు.

దేశాలు స్వాతంత్ర్యాన్ని, జాతులు విముక్తిని పొందుతూ ఉన్నా విముక్తి దిశగా ఆలోచనే లేని వ్యవస్థ మహిళది. చాలా దేశాల్లో స్వాతంత్ర్య పోరాటాలు, విముక్తి పోరాటాలతో పాటుగా మహిళా పోరాటాలు ఊపందుకున్నాయి. ఫెమినిస్టు ఉద్యమాలు, మహిళల అస్థిత్వ ఉద్యమాలు, పురుషులతో సమానమైన ఇతరత్రా హక్కుల ఉద్యమాలు జరిగాయి. జరుగుతూ ఉన్నాయి. కాని ఏ ఉద్యమంలో కూడా ఆస్తి హక్కులకై, భూమి హక్కులకై ఉద్యమాలు జరగలేదు. జరపాలనే ఆలోచన కూడా లేదు. దీనికంతటికీ కారణం పురుషుణ్ని మహిళ గుడ్డిగా నమ్మడమే. పురుషాధిపత్యంతో జరిగే అన్ని రకాల ఉద్యమాల్లో స్త్రీకి నేరుగా ఒరిగేదేమీ లేకున్నా పురుషులతో సమానంగా ఉద్యమాల్లో పాల్గొని ఇబ్బందుల్ని ఎదుర్కొంటూనే ఉంది.

ఈ సమస్యకు పరిష్కారం పురుషునిలాగానే, స్త్రీకి కూడా అన్నింటా స్వాతంత్ర్య హక్కులు ఉండాల్సిందే. ముఖ్యంగా భూమిపై హక్కు అనివార్యం కావాలి. కొడుకులు ఏ విధంగా తండ్రి ఆస్తికి వారసులవుతారో, కూతుళ్లు కూడా తండ్రి ఆస్తికి హక్కుదారులు కావాలి. పేరుకు స్త్రీకి ఆస్తిలో హక్కు చట్టబద్ధతను కలిగి ఉన్నా, స్త్రీకి ప్రత్యేకంగా ఒరిగిందేమీ లేదు. పైగా తన తండ్రి ఆస్తిలో భాగం కోసం చట్టాన్ని ఆశ్రయించి పోరాడాల్సి వస్తుంది. ఈ విషయంగా స్త్రీలు స్వయంగా తండ్రుల నుంచి, అన్నదమ్ముల నుంచి, ఇంకా చెప్పాలంటే స్వయంగా

తల్లి నుంచే వ్యతిరేకతను, ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సి వస్తుంది. కింది కోర్టు నుంచి హైకోర్టుల్లో సంవత్సరాల తరబడి స్వంత కుటుంబ సభ్యులకు వ్యతిరేకంగా స్త్రీ పోరాడాల్సి వస్తుంది. ఒకవేళ కేసు గెలిచినా ఆ ఆస్తిపై అజమాయిషి పొందడం గగనకుసుమమే. అయితే, ఈ పోరాటమంతా కట్టుకున్న భర్త కనుసన్నల్లో జరగడం గమనార్హం. అంటే, తనకున్న హక్కును కూడా తాను గుర్తించి పొందే అర్హతలేని వ్యవస్థలో మహిళలు కొనసాగుతూ ఉన్నారు.

కాబట్టి మనుషుల్లో దోపిడీకి గురవుతున్నవారుగా, దోపిడి చేస్తున్న వారుగా అనే రెండు వర్గాలుగా భావించినపుడు, మొత్తంగా మహిళల్ని మొదటి వర్గంగానే పరిగణించాలి. దీనికి తోడు మహిళలు పురుషాధిక్యతను అదనంగా ఎదుర్కోవడం జరుగుతున్నది. ఈ అంతరం తొలగించబడాలంటే సహజ సిద్ధమైన హక్కులు కావాలి. రావాలి. దీనికోసం భూ బదలాయింపు చట్టంలో అనూహ్యమైన, గుణాత్మకమైన మార్పులు జరగాలి. మహిళలు కోరితే ఆస్తి హక్కు అనే దానికి భిన్నంగా కొడుకులతో సమానమైన పంపక విధానం కూతుళ్లకు సంక్రమించాలి. ఇలా సంక్రమించిన భూమి, ఆస్తి మార్పిడికి గురి కాకుండా చట్టాలు ఉండాలి. అంటే తిరిగి భర్తకో, కొడుకులకో ధారాదత్తం కాకుండా, స్వయంగా అనుభవించేలా ఉండాలి. తనకు నచ్చినవారికి భూ, ఆస్తి బదలాయింపు చేసేదిగా చట్టాలు రూపుదిద్దుకోవాలి. ఇది కూడా ఎలాంటి బెదిరింపులు లేకుండా జరిగేలా చూడాలి. స్త్రీ బలహీనురాలు అనే నానుడికి భిన్నంగా ఆలోచనా విధానం పెంపొందాలి. ఈ ఆలోచనల్ని పెంపొందించే సాహిత్యాన్ని, పాఠ్యాంశాల్ని అభివృద్ధి చేయాలి. అభివృద్ధి కరమైన భావజాలం పెంపొందించకుండా ఏ వ్యవస్థ కూడా దీర్ఘకాలికంగా మనజాలదు. కేవలం చట్టాలు చేసి వదిలితే, ఫలితాల్ని అనుభవించలేని స్థితి ఉంటుంది. ఇప్పటికే వరకట్న, బాల్య వివాహాల నిషేధ చట్టాల వైఫల్యాన్ని మనం చూస్తూనే ఉన్నాం.

కాబట్టి ఏ చట్టమైనా ఆస్వాదించేదిగా, అనుభవించేదిగా, సులభంగా సంక్రమించేదిగా ఉండాలి. అలా కాకుండా గిరిజన ప్రాంతాల్లో భూ బదలాయింపు చట్టాల్ని నియంత్రించే 1/70 చట్టం వైఫల్యంలా ఉండకుండా, పటిష్ఠమైన మహిళల భూ హక్కు, ఆస్తి హక్కు చట్టం రూపకల్పన చేయాలి. దీనికై ఏ ఒక్క వర్గమో కాకుండా, అభ్యుదయ కాముకులు, మహిళా సంఘాలు గొంతులు కలపాలి. ఇదేమి సులభమైన పనికాకున్నా, ఓ కొత్త ఆలోచనకు నాంది ప్రస్తావన అవుతుంది. ఆకాశంలో సగమైన మహిళ అన్నింటిలో సగం హక్కుదారుగా కావాల్సిందే. దీనితో పాటుగా ఆస్తి హక్కులేని సమాజం రూపుదిద్దుకుంటే బహుశా మహిళకు కూడా పూర్ణ స్వరాజ్యం చేకూరుతుంది. ఈ దిశగా కూడా ఆలోచనలు మొదలైతే ఓ ఆరోగ్యకరమైన సమాజం ఆవిష్కరించ బడుతుంది. వ్యవస్థలో దేన్నైనా అలక్ష్యం చేయవచ్చు, కాని వ్యవసాయ రంగాన్ని అలక్ష్యం చేయకూడదని 1948లో నెహ్రూ అన్న మాటలకు తోడు, వ్యవసాయ రంగాన్ని మహిళలతో అనుసంధానం చేస్తే మరింత బాగుంటుంది.

– ప్రస్తుతం సాగులో ఉన్న భూమి 138–142 మిలియన్ హెక్టార్లు. ఈ భూమి అంతా దాదాపుగా పురుషుల పేరు మీదనే ఉంది.

– దారిద్ర్య రేఖ కింగ ఉన్న 30 శాతం ప్రజల ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చాలంటే వ్యవసాయాన్ని, దాని అనుబంధ ఆర్థిక విధానాన్ని మెరుగుపర్చడం ద్వారానే జరుగుతుంది. ఇది జరగాలంటే విధిగా భూ పంపకం శ్రమజీవుల ఆధారంగానే జరగాలి. ఇలా జరిగినచో కేంద్ర ప్రభుత్వ ప్రణాళిక సంఘం ఆలోచన ప్రకారం 2025 నాటికి 200 మిలియన్ల జనాభాకు ఉపాధి దొరకడమే కాక, ప్రస్తుతం ఉన్న 30 శాతం ఆదాయం 200 శాతానికి పెరుగుతుంది. ఇందులో 100 మిలియన్లు మహిళలే.

– దేశంలో గల ఆరు లక్షల గ్రామాల్లో రెండు లక్షల గ్రామాలు అడవులకు ఆనుకొనే ఉన్నాయి. ఈ గ్రామాలకు ఆనుకొని ఉన్న అడవులపై హక్కును ఆ గ్రామాలకే అప్పజెప్పి మహిళల యాజమాన్యాన్ని అభివృద్ధి చేయాలి. దాని నుండి వచ్చే ఆదాయాన్ని మహిళలకే చెందేలా చట్టసవరణ చేసినట్లైతే మహిళాభ్యుదయంతో పాటుగా కుటుంబాభివృద్ధి కూడా జరుగుతుంది. ఎందుకంటే, సహజంగా మహిళలకు చెడు అలవాట్లు ఉండకపోగా మంచి పొదుపరులు కాబట్టి.

– ఇక వ్యవసాయ ఉత్పత్తి విషయంగా కూడా మహిళలకే యాజమాన్యంపై శిక్షణ ఇవ్వాలి. వ్యవసాయ సంబంధ జ్ఞానాన్ని అందించినచో మనం కూడా చైనా, కెనడా, జపాన్, ఆస్ట్రేలియాల లాగా గణనీయమైన ఆహార ఉత్పత్తిని సాధించవచ్చు. (హెక్టారుకు – ఇండియా 1950 కి.గ్రా., చైనా 4000 కి.గ్రా., కెనడా, ఆస్ట్రేలియా, జపాన్ 5000 కి.గ్రా.) ఇది జరినట్లైతే ప్రస్తుతంగా ఉన్న 210 మిలియన్ టన్నుల ఆహారపు గింజల ఉత్పత్తి నుంచి 450 మిలియన్ టన్నుల ఉత్పత్తికి మహిళల సహకారంతో భారత్ తప్పకుండా చేరుకుంటుంది.

– మన అటవీ సంపదను కూడా పది క్యూబిక్ మీటర్ల నుంచి ఇతర దేశాల్లో లాగా 80–90 క్యూబిక్ మీటర్లకు పెంచవచ్చు.

– భారతదేశానికి దాదాపు ఏడు వేల కిలోమీటర్ల సముద్ర తీరం ఉంది. ఈ సముద్రంలో చేపల వేట సహజంగా పురుషులే సాగిస్తారు. వేటాడిన చేపల్ని జాగ్రత్త పరిచి, మార్కెటింగ్ చేయడమంతా మహిళలే చేస్తారు. కాని ఆర్థిక స్వాతంత్ర్యం శూన్యమే. కాబట్టి విధిగా మార్కెటింగ్ చేసిన ఆదాయంలో సగాన్ని మహిళలకు చెందే విధంగా బ్యాంకుల్లో జమ అయ్యేలా చట్టాలు విడిగా ఉండాలి.

– పశు పోషణలో, పాల ఉత్పత్తిలో మాత్రం ఇప్పటికీ ప్రపంచంలో భారత్ మొదటి స్థానంలో ఉంది. వీటి ఉత్పత్తుల్లో, యాజమాన్యంలో మొత్తంగా శ్రమంతా మహిళలదే. మహిళల చేతి వాటంలేని పాడిని అసలు ఊహించలేం. పాల ఉత్పత్తిదారుల సంఘాల్లో మాత్రం మొత్తంగా పురుషులే సభ్యులుగా ఉంటున్నారు. దీనికి బదులుగా మహిళల్ని సభ్యులుగా చేర్చి సంఘాలను ఏర్పర్చినట్లైతే ప్రతి ఇల్లు స్వర్గధామంలా మారుతుందనడంలో సందేహం లేదు.

– మురికి కాలువలు, రోడ్లను శుభ్రం చేయడం లాంటి తదితర పనులతో పాటుగా ఇప్పటికి మానవ మలాన్ని ఎత్తడం, ఇతర పాకీ పనులకు మహిళలే నిర్వహిస్తూ ఉన్నారు. వీరికి ఇది స్వీయ జీనవ ఆధారం అయినా స్వతంత్ర జీవన విధానం కావాలి. ఈ పనికి తగిన సముచిత స్థానం సమాజంలో ఇప్పటికి లేకపోగా వీరి వేతనం అగౌరవంగా ఉంటోంది. ఈ విషయంగా సరియైన చట్ట సవరణలు చేసి ఈ పని అత్యున్నత గౌరవ ప్రదమైనదిగా గుర్తించాలంటే మంచి వేతనాలు ఇవ్వాలి.

– ఏ భూపోరాటం జరిగినా, హక్కుల పోరాటాలు జరిగినా, మహిళలు కూడా అధిక సంఖ్యలో సమిధలుగా మారుతున్నారు. నక్సలిజానికి నాంది ప్రస్తావన జరిగిన నక్సల్బరీలో మే 25, 1967న భూ సమస్యపై సమావేశమైన రైతులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో చనిపోయిన పదకొండు మందిలో ఇద్దరు పిల్లలతో సహా ఏడుగురు మహిళలే. ఇలాంటి కథనాలు జలియన్‌వాలా బాగ్, ఇంద్రవెల్లి, సోంపేట, లక్షింపేట, బాసగూడ లాంటి తదితర ఘటనల సందర్భంగా కనపడుతూనే ఉన్నాయి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

# కులం పుట్టుక - నిర్మూలన

*కులం పుట్టుక, పెరుగుదల గురించి భౌతికవాద కోణం నుంచి అర్థం చేసుకున్నప్పుడే కుల నిర్మూలన సాధ్యమవుతుందంటున్నారు* **బి. సైదులు**

కులం అంటే ఏమిటి? ఒకే పనిచేసే వారి మధ్య మాత్రమే వివాహ సంబంధాలు కలిగి ఉన్న సమూహమే కులం. పరిణామ క్రమంలో ప్రస్తుతం కులానికి అర్థం మరొక లాగా ఉంది. వేరు వేరు పనులు చేస్తూ కూడా గతంలోని అంతర్వివాహ సంబంధాలను కొనసాగిస్తున్న సమూహమే కులం. ఇందులో మూడు అంశాలు ఉన్నాయి – 1) పని విభజన; 2) అంతర్వివాహ పద్ధతి; 3) బలప్రయోగం.

కులం పుట్టుకను గురించి తెలుసుకోవడానికి రెండు పద్ధతులున్నాయి. ఒకటి భౌతికవాద పద్ధతి; రెండవది భావవాద పద్ధతి. సమాజంలోని మెజారిటీ ప్రజలకు భావవాద పద్ధతిలో కులం ఎలా పుట్టిందో తెలుసు కాని భౌతికవాద పద్ధతిలో కులం ఎలా పుట్టిందో తెలియదు. అలా తెలియక పోవడానికి కారణం భావవాద పద్ధతి మాత్రమే ప్రచారంలో ఉంది తప్ప భౌతికవాద పద్ధతి ప్రచారంలో లేకపోవడం. పూర్తిగా లేదు అని అనలేం. ఆ ప్రచారంపై నిర్బంధం ఉండడం, అవకాశాలు లేక పోవడం ఉంది. ఎందుకంటే భావవాద పద్ధతి పాలకవర్గానికి చెందింది. భౌతికవాద పద్ధతి సామాన్య ప్రజల నుండి ఎదిగిన మేధావుల పద్ధతి.

కులం ఎలా పుట్టింది? అని సామాన్య ప్రజలను అడిగితే అది గతం నుండి వస్తున్నది – మనం కూడా పాటిస్తున్నామని అంటారు. కొందరు కృష్ణుడు మా మూల పురుషుడని, కొందరు జాంబవంతుడని, కొందరు పాండవులని చెపుతారు. ఇంకా చెప్పాలంటే కులాలను దేవుడు సృష్టించాడు అంటారు. కులం గురించి స్పష్టంగా తెలియకపోయినా కులాన్ని పాటిస్తారు. అది ఒక అలవాటుగా మారింది. అంటే వారు ఏదో ఒక మేరకు పాలకవర్గానికి చెందిన భావవాద పద్ధతిలో కులం ఎలా పుట్టిందో మాత్రమే తెలుసుకున్నారు. వారికి భౌతిక వాద పద్ధతిలో కులం ఎలా పుట్టిందో తెలియదు. అందువలన భౌతికవాద పద్ధతిని అవలంబించే కమ్యూనిస్టులు ఆ పద్ధతి ప్రకారం కులం ఎలా పుట్టిందో చెప్పవలసి ఉంటుంది.

భౌతికవాదానికి కమ్యూనిస్టులు గతితార్కిక పద్ధతిని జోడించారు. భావవాదానికి భావవాదులు జడతార్కిక పద్ధతిని జోడించారు. గతితార్కిక పద్ధతిని స్పష్టంగా ముందుకు తెచ్చిన వారు హెగెల్. హెగెల్ మాత్రం భావవాది. హెగేలియ భావవాదులు, కమ్యూనిస్టులు మినహా ఈ పద్ధతిని పాటిస్తామని ఎవరూ ప్రకటించుకోరు. ఈ పద్ధతి ప్రకారం ఒక సమస్యను అర్థం చేసుకోవడానికి ఆ సమస్య మూలం నుండి ప్రారంభిస్తారు. కుల సమస్యను అర్థం చేసుకోవడానికి గతితార్కిక పద్ధతిననుసరించి కమ్యూనిస్టులు ఆదిమ కమ్యూనిస్టు సమాజం నుండి ప్రారంభిస్తారు. ఆదిమ కమ్యూనిస్టు సమాజం గురించి కూడా స్పష్టత లేదు. బాలగోపాల్ ఆదిమ కమ్యూనిస్టు సమాజమంటే ఆదివాసి సమాజమని అంచనా వేశారు. నేను ఆదిమ కమ్యూనిస్టు సమాజమంటే నేటి అడవి జంతువుల జీవనం లాంటి మానవ జీవనం అనుకుంటున్నాను. ఆదిమ సమాజంలో కులం ఉండి ఉంటుందా? అని ప్రశ్నించుకుంటాం. అప్పుడు కులం లేదు. ప్రాథమిక దశకు, అభివృద్ధి చెందిన దశకు మధ్య గల తేడాల ద్వారా దీనిని అంచనా వేయవచ్చును.

ఆదిమానవులు ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క గుంపుగా ఉండేవారు. వారు ఆహారం కోసం మరొక ప్రాంతానికి వెళ్లడం కూడా జరుగుతూ ఉండేది. ఆహారం కోసం జీవుల మధ్య ఘర్షణ జరిగింది. ఆ ఘర్షణలో చంపుకోవడం కూడా ఉంది. చంపుకోవడాన్ని మనం ఇప్పటి ఘర్షణల ఆధారంగా అంచనా వేయవచ్చును. నిజాం వ్యతిరేక పోరాటంలో, ఈశాన్య రాష్ట్రాలలో జరిగిన ఘర్షణలు, శ్రీలంకలో ఎల్‌టిటిఇపై జరిగిన దాడులు, చత్తీస్‌గఢ్ ఘర్షణల లాంటి వాటి ద్వారా ఆ కాలపు ఘర్షణలను అంచనా వేయవచ్చును. బంగ్లాదేశ్ వాళ్లను చంపిన విషయంలో ఒకతను నేనొక్కడినే 150 మందినో 180 మందినో చంపాను అని గర్వంగా చెప్పుకోవడం మనం చదివాం. రజాకార్లు గ్రామాలపై పడి విచక్షణా రహితంగా చంపిన విషయాలను మనం ఆనాడు చూసిన వారి ద్వారా విన్నాం. అలాగే ఆదిమ సమాజ కాలంలో కూడా నిర్దాక్షిణ్యంగా చంపుకునే పద్ధతి కొనసాగింది. వ్యవసాయం అభివృద్ధి చెందే క్రమంలో వారిని చంపకుండా పనిచేయించుకోవచ్చుననే ఆలోచన వచ్చి ఉంటుంది. అప్పుడు ఓడిపోయిన వారిని బతకనివ్వడమే మహాభాగ్యం అవుతుంది. అందువలన గెలిచినవారు ఏ పని చెపితే వారు ఆ పని చేయవలసి ఉంటుంది. గెలిచినవారు ఓడిన వారిని విభజించి వారికి పని కేటాయించడం జరుగుతుంది. అందుకే వర్గ సమాజంలో పని చేసే వారికి గౌరవం ఉండదు. పని చేసే వారంటే ఓడింపబడిన వారనీ, పని చేయించుకునే వారంటే గెలిచినవారనీ అర్థం. అందుకే బలవంతులకు, భయపెట్టగల వారికి, మోసం చేసే వారికి భయపడడం జరుగుతుంది.

ఇలాంటి పరిస్థితిని మనం అమెరికాలో చూశాం. అమెరికాలో స్థిరపడిన బ్రిటిష్‌వారు ఆఫ్రికా నుండి పిల్లలను ఎత్తుకుపోయి బానిసలుగా మార్చారు. అయితే వారు ఏ గ్రామం నుండి ఎవరిని ఎత్తుకుపోయారో రికార్డు రాసి పెట్టారు. దానిని మనం 'ఏడు తరాలు' అనే రచనల్లో చదివాం. మనం పశువులను చీకటి పడగానే దొడ్డిలో తొలి జాగ్రత్త చేసుకున్నట్లు వారు బానిసలను తమ నిర్బంధంలో పెట్టుకునే వారు. కొందరు తమ పశువులను ప్రతిదాన్ని కట్టివేస్తారు. కొన్ని ప్రాంతాలలో

తమ పశువులను కట్టి వేయకుండా ఒక దొడ్డిలో తోలుతారు. భారత దేశంలో రెండవ పద్ధతి వలె ఓడిన వారిని సాధారణంగానే గ్రామంలో పరిమిత స్వేచ్ఛతో ఉండనిచ్చేవారు. అంటే అమెరికాలోని బానిసల కంటే కొంత ఎక్కువ స్వేచ్ఛను ఇచ్చారు. కాని, వారికి కొన్ని ప్రదేశాలను నిర్ణయించే వారు. నిర్ణయించిన ప్రదేశంలోనే వారు ఉండాలి. లేకపోతే శిక్షించేవారు. దానిలో భాగంగానే గొల్లవాడ, మంగలివాడ, చాకలివాడ, కుమ్మరివాడ, కమ్మరి వాడలు ఏర్పడ్డాయి.

కాలక్రమంలో గెలిచిన వారిలో కూడా పని విభజన అనివార్యమైంది. దాని పరిణామమే క్షత్రియులు, బ్రాహ్మణులు, వైశ్యులు. క్షత్రియుల పరిణామమే నాయకులు. బాహ్మణులు బాహ్మణులుగానే ఉన్నారు. మంత్రులుగా, యజ్ఞ యాగాలు చేసే వారుగా ఉన్న బ్రాహ్మణులు పురోహితులుగా మారారు. వైశ్యులు వ్యాపార వర్గాలుగా పరిణామం చెందారు. క్షత్రియులు యుద్ధం చేయడం, బ్రాహ్మణులు భావజాల వ్యాప్తి చేయడం, వైశ్యులు వ్యాపారం చేయడం జరిగింది. ఈ ముగ్గురు పాలకవర్గంలో భాగమే. అయితే మిగతా దేశాలలో రాని ఆలోచన భారత పాలక వర్గానికి వచ్చింది. అది ఒకే పని చేసే వారి మధ్యనే వివాహ సంబంధాలు పరిమితం చేయాలనే నిర్ణయం. దాని వలన వారి సంతతి కూడా ఆధిపత్యంలో ఉంటుందని పాలకవర్గాల వారి ఆలోచన. దానిని పాలకవర్గాలు సామ, దాన, భేద దండనోపాయాల ద్వారా అమలు పరిచారు. శతాబ్దాలుగా కొనసాగించడం ద్వారా అది ఒక సాంప్రదాయంగా మారింది. సాంప్రదాయంగా మారిన తరువాత పాలకవర్గాలు దానిని అంతగా పట్టించుకోవాల్సిన అవసరం ఉండదు. అంతమాత్రాన అసలే పట్టించుకోకుండా ఉంటారని కాదు. అది కొనసాగడానికి పరోక్ష పాత్రను నిర్వహిస్తారు. అలాంటి వివాహ పద్ధతినే అంబేద్కర్ అంతర్వివాహ పద్ధతి అన్నాడు. అంటే పని విభజన చేసి, అంతర్వివాహ పద్ధతిని ప్రవేశపెట్టి ఆ సమూహాలకే కులాలు అనే పేరు పెట్టాయి పాలకవర్గాలు. పాలకవర్గాలు తమకు తాము కులంగా మారుతూ ఇతరులు అనుసరించేలా చేయడం కూడా ఉంది.

భారతదేశంలో కులం బానిస విధానం చిహ్నమే, అసమానతలు సృష్టించడంలో భాగమే. ముస్లింల దండయాత్రల వరకు కులం యథావిధిగా కొనసాగింది. ముస్లిం రాజుల పాలనలో కొద్దిమార్పులు వచ్చాయి. బ్రిటిష్ పాలనలో కొంత ఎక్కువ మార్పులు వచ్చాయి. కుల వృత్తులు కోల్పోవడం వలన మార్పులు చోటు చేసుకున్నాయి. ఒక వృత్తి చేయాల్సిన వారు మరొక వృత్తి చేయవలసి వచ్చింది. అనివార్య కారణాల వల్ల వృత్తి సాంప్రదాయాన్ని కోల్పోయారు కాని కులానికి మరొక కారణమైన అంతర్వివాహ సాంప్రదాయాన్ని వదులుకోలేదు. అంతర్వివాహ సాంప్రదాయాన్ని వదులుకోవాల్సిన అనివార్య పరిస్థితులు ఏర్పడలేదు. అందువలన కులం కొనసాగుతూనే ఉంది. అంతమాత్రాన సమాజంలో కులాంతర వివాహాలే జరగలేదని కాదు. అవి తప్పనిసరి పరిస్థితులలో జరిగాయి. కాని కులం ఉండకూడదు అనే అవగాహనతో జరిగినవి కాదు. అయినా అవి అభ్యుదయకరమైనవే. కులాంతర వివాహాల వలన మరికొన్ని కొత్త కులాలు ఏర్పడినవి. మొదట కులమే వర్గంగా ఉన్న కాలంలో కూడా వర్గం ఉంది. ఇప్పుడు కూడా అలాంటి పరిస్థితులు ఉన్నాయి.

అగ్రకులానికి చెందిన రెండు కుటుంబాలు ఉన్నాయి. వారికి అమ్మాయిలు ఉన్నారు. వారు చాలా పేదరికంలో ఉన్నారు. ఆర్థికంగా లేని కారణంగా ఆ అమ్మాయిలను ఆ కులానికి చెందిన వారెవరూ వివాహం చేసుకోలేదు. తప్పనిసరి పరిస్థితిలో వారిలో ఒక అమ్మాయి ఎస్‌సి కులానికి చెందిన అబ్బాయిని, మరొక అమ్మాయి గొల్ల కులానికి చెందిన అబ్బాయిని వివాహం చేసుకున్నారు. మరొక బిసి కులానికి చెందిన అమ్మాయి వేరొక కులానికి చెందిన అబ్బాయిని ప్రేమించింది. ప్రేమించిన అబ్బాయి వివాహం చేసుకోలేదు. వారికి అబ్బాయి కూడా పుట్టాడు. మరొకరిని ప్రేమించింది. తాను కూడా వివాహం చేసుకోలేదు. కాని ఆమెకు పిల్లలున్నారు. ఆమె పిల్లలు బాగా చదువుకొని జీవితంలో బాగా స్థిరపడగలిగే స్థితి వస్తే వాళ్ల జీవితాలు బాగానే ఉంటాయి. లేకుంటే మామూలు కుటుంబాల కంటే ఎక్కువ ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది. అలాంటివి తప్పుడు సంకేతాలను ఇస్తాయి. కులం విడదీస్తే మనుగడ సాగించలేమనే భయం వస్తుంది. ఇలాంటి తప్పని పరిస్థితులే తప్ప కులం గురించి అర్థం చేసుకోవడం వలన జరిగినవి కావు.

కులం పట్టింపు ఎక్కువగా ఉన్న రోజుల్లో కూడా తప్పని పరిస్థితుల కారణంగానే కులాంతర వివాహాలు జరిగి ఉంటాయి. పేద బ్రాహ్మణ స్త్రీ అనివార్య పరిస్థితిలో అంటరానివారిని వివాహం చేసుకుంటుంది. వారి సంతతి చెండాల కులంగా ఏర్పడిందని మనుస్మృతి చెబుతుంది. పేదరికంలో ఉన్న ఒక కులానికి చెందిన పురుషులు కూడా తక్కువ కులానికి చెందిన స్త్రీలనే వివాహం చేసుకున్నారు. అందువల్ల కొన్ని కొత్త కులాలు ఏర్పడినవి.

కులాలను పాటించడం ఒక అలవాటుగా, సాంప్రదాయంగా మారింది. వీటిలో మంచివి చెడ్డవి ఉంటాయి. మంచివి అయితే మంచిదే. కాని చెడ్డవాటి వలన సమస్యలు వస్తాయి. అలవాటుగా మారితే అది చెడ్డది అని తెలిసినా మార్చుకోలేరు. ఒక క్రిస్టియన్ పాఠశాలలో ఈ విధంగా రాసి ఉంది. 'బాలుడు నడువవలసిన తోవను వానికి నేర్పుము. వాడు వృద్ధుడైనప్పుడును దాని నుండి తొలగిపోడు'. అంటే వాటికి అంత బలం ఉంటుంది అని అర్థం. అయితే నేర్పేవి మంచివి కావచ్చును, చెడ్డవి కావచ్చును. ఆ వయసులో వేటిని నేర్పినా అవి బలంగానే ఉంటాయి. అందుకే పాలకవర్గాలు పిండస్థ దశలో మతాన్ని, ఇప్పుడు మతాన్నీ, విద్యనూ, మీడియానూ తమ అధీనంలో ఉండేలా చూసుకున్నాయి. వీటి ద్వారా పాలకవర్గాలు తమకు అనుగుణంగా పరాయీకరించుకుంటాయి అని కమ్యూనిస్టులు అంటారు. అందువలన బాలుడు వృద్ధుడైనను ఆ తోవ నుండి తొలగిపోడు.

హిందూ పాలకవర్గాలచే ప్రతి కులానికి చరిత్ర రాయబడి ఉంది. అది పురాణాలలో ఉంది. పురాణాలలోని కుల చరిత్రలు మచ్చుమేపడం లాంటివి. అడవి ప్రాంతాలలో అడవి జంతువులకు మచ్చుమేపేవారు. మచ్చుకు అలవాటు పడిన తరువాత వేటాడుతారు. మచ్చుకొరకు కొన్ని ఎముకలను ఉప్పు నీటిలో ఉడకబెడతారు. ఆ ఎముకలను అడవి పందులు తిరుగుతున్నాయనే చోట పెడతారు. అవి ఆహారం తినడం మాని ఉప్పు ఎముకను తినడం మొదలు పెడతాయి. రెండు రోజులకు ఉప్పు ఎముక స్థానంలో నాటు బాంబు పెడతారు. అడవి పంది

కొరుకుతుంది. దాని తల పేలి చనిపోతుంది. పురాణాలలోని కుల చరిత్రలు అలాంటి మచ్చు పాత్రను పోషించాయి. దళిత బహుజన కులాలకు అది ప్రమాదకరమైంది. అందుకే పురాణాలకు ప్రత్యామ్నాయమైన పని విభజన, అంతర్వివాహ పద్ధతి వలన కులాలు ఏర్పడ్డాయనే విషయాన్ని ప్రజలకు అర్థం చేయించవలసి ఉంటుంది.

అర్థం చేయించకపోతే పాలకవర్గం తమ నిగమనతర్కం ఎత్తుగడల ద్వారా మనం ఏదైతే తప్పు అంటున్నామో దానిని ప్రజల చేత ఒప్పు అనిపించగలదు. ప్రజలను పరాయీకరించడం ద్వారా అలా చేయవచ్చును. దానికి కొన్ని సంఘటనలు చూద్దాం. దాదాపు 30-40 సంవత్సరాల క్రితం ప్రభుత్వం సహపంక్తి భోజనాలు చేయాలనే ఒక సర్క్యులర్‌ను రెవెన్యూ శాఖకు పంపింది. అది ఎంతో కొంత మంచిదే. అప్పుడు ఒక ఎస్‌సి వ్యక్తి తానే భోజనాలు వండుతానని సహపంక్తి భోజనం చేద్దామనే ప్రపోజల్ చెప్పాడు. సహపంక్తి భోజనం చేయడం ఆఫీసులో ఒక అగ్రకుల వ్యక్తికి ఇష్టం లేదని తెలిసింది. అక్కడే దక్కలి కులానికి చెందిన కుటుంబం కూడా ఉన్నది. వాళ్లతో భోజనాలు వండిద్దాం అనే అభిప్రాయాన్ని పెట్టారు. దక్కలి వాళ్లు వండింది మేం తినం అన్నాడు ఎస్‌సి వ్యక్తి. దానితో సహపంక్తి భోజనాలు ఆగిపోయాయి. అగ్రకుల వ్యక్తి ఇక్కడ పాలకవర్గం. తాను పరోక్షంగా ఉండి మరొక అభిప్రాయాన్ని ముందు పెట్టాడు. ఎస్‌సి వ్యక్తి కూడా దానిని ఒప్పుకోవాలి కదా! అంటే ఎస్‌సి వ్యక్తిలోను పాలకవర్గ భావం ఉంది. అంటే అతను పరాయీకరణకు గురి అయినాడు.

ఒక పిక్‌పాకెటర్ ఒక వ్యక్తి పర్సు కొట్టేశాడు. అందులో వెయ్యి రూపాయలున్నాయి. పర్స్ పోగొట్టుకున్న వ్యక్తి ఏడుస్తూ నాకు మా ఊరెళ్లడానికి కూడా డబ్బులు లేవు అన్నాడు. గుమిగూడిన వారు తలా ఒకటో రెండో రూపాయలు ఇచ్చారు. అయినా ఛార్జీకి సరిపడా డబ్బు రాలేదు. పిక్ పాకెటర్ అందులో నుండి వంద రూపాయలు ఇచ్చాడు. పోగొట్టుకున్న వ్యక్తి రెండు చేతుల్తో దండం పెట్టి - మీలాంటి మహానుభావులు ఉండడం వల్లనే ధర్మం నాలుగు పాదాల నడుస్తున్నది, లేకుంటే లోకం మునిగి పోయేది అన్నాడు. ఇప్పుడు సంక్షేమ పథకాలు, రాయితీలు, ఎన్‌జిఒ సంఘాలు ఇలాంటి పరిస్థితికి ఉదాహరణలు. మనం ఈ విషయాన్ని చెప్పితే ఇవ్వాలనుకున్న వాళ్లను కూడా ఇవ్వకుండా చేస్తున్నారు అంటారు. ఇంగ్లిష్ మీడియం విషయంలోను, ప్రైవేట్ పాఠశాలల విషయంలోను కంచ ఐలయ్య, బిఎస్ రాములు లాంటి వారు ఇలాంటి వాదనే చేస్తారు. బైబిల్, ఖురాన్, హిందూ మత గ్రంథాలలోని పది శాతం ఆదాయాన్ని దానం చేయాలనడంలో ఇలాంటి పరిస్థితిని కల్పించడం ఉన్నది. వెయ్యి రూపాయలు కొట్టెయ్యలేని వారు వంద రూపాయలు దానం చేయడం సాధ్యం కాదు. మనం కొట్టెయ్యడం ఉండకూడదు అంటున్నాం. కాని అర్థం చేసుకోవాల్సిన ప్రజలు అర్థం చేసుకోకపోతే ఎవరూ ఏమీ చేయలేరు.

ఒక ఎస్‌సి వ్యక్తి ఒక బిసి వ్యక్తి మధ్య కులానికి సంబంధించిన చర్చ వచ్చింది. బిసి వ్యక్తి 'కులం ఎక్కడ ఉంది?' అన్నాడు. ఎస్‌సి వ్యక్తి 'ఎందుకు లేదు?' అన్నాడు. బిసి వ్యక్తి 'ఎక్కడ ఉంది?' అని మళ్లీ అన్నాడు. 'మా అమ్మాయిని మీ అబ్బాయికి ఇస్తా చేసుకుంటారా?' అన్నాడు ఎస్‌సి వ్యక్తి. బిసి వ్యక్తి ఏమీ మాట్లాడలేదు. మరికొంత కాలానికి ఎస్‌సి వ్యక్తికి మరొక ఎస్‌సి కంటే తక్కువ కులానికి చెందిన వ్యక్తికి అదే చర్చ జరిగింది. ఇప్పుడు ఎస్‌సి వ్యక్తి మౌనంగా ఉన్నాడు. భౌతికవాద కోణంలో కులం పుట్టుక గురించి తెలియకపోవడం వల్లనే ఇలాంటి చర్చ సాగి మధ్యలోనే ఆగిపోతాయి. తాను తక్కువ ఉన్న చోట కులం పోవాలని, తాను ఎక్కువ ఉన్న చోట కులం ఉండాలనే ఆలోచన ఉంది. అలా ఉండడం కూడా బ్రాహ్మణిజంలో భాగమే. ప్రతి విషయంలో తన ఆధిపత్యం నిలుపుకోవడానికి ప్రయత్నించడం, తనకే మేలు జరిగేలా చూసుకోవడం బ్రాహ్మణిజంలో భాగమే. పదార్థానికి, ఆర్థికానికి ఉన్నట్లే బ్రాహ్మణిజానికి కూడా అత్యంత విశాలమైన సర్వసాధారణమైన అర్థం ఉంది. బ్రాహ్మణిజం విశాల అర్థం భావవాదం. సాధారణమైన అర్థం బ్రాహ్మణ కులానికి మాత్రమే వర్తింపజేయడం. ఇక్కడ నేను వాడుతున్నది విశాల అర్థం.

మా అమ్మాయిని మీ అబ్బాయికి ఇస్తా చేసుకుంటారా? అనేది ఒప్పించే పద్ధతి కాదు. ఎదుటి వ్యక్తిని ఆత్మరక్షణలో పడవేసే పద్ధతి. ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా తనకే మేలు జరుగుతుంది. వీలైనంత వరకు ఒప్పించే పద్ధతిని పాటించడం సరైనది. దాని వలన కొంత ఆలస్యం అవుతుంది. కాని దాని ఫలితం ప్రయోజనకరంగా ఉంటుంది. కులాంతర వివాహానికి మాట ఇవ్వడం కుటుంబంలోని ఒక వ్యక్తితో సాధ్యం కాదు. కుటుంబంలోని మెజారిటీ వ్యక్తులు ఒప్పుకోవాల్సిందే. ఒకే వ్యక్తి ఒప్పుకొని మిగతా వారి ప్రమేయం లేకుండా చేయడం ఆధిపత్యం అవుతుంది. ఇంట్లో గెలిచి రచ్చ గెలవాలి అంటుంటారు. ఇంట్లో వాళ్లను మొదట ఒప్పించి బయటి వాళ్లను ఒప్పించడానికి ప్రయత్నించాలి అంటారు. ఇంట్లో వాళ్లను ఒప్పించలేనంత మాత్రాన బయటి వాళ్లకు చెప్పకూడదు అనడం బ్రాహ్మణిజమే. ఆ వ్యక్తిని ఇంటి వరకే పరిమితం చేయడానికి వేసిన ఎత్తుగడ అది. వ్యక్తి అభివృద్ధే దేశ అభివృద్ధి అనడం కూడా అలాంటిదే. ఇవి బ్రాహ్మణిస్టు విధాన నిర్ణయాలే తప్ప, సాధారణ విషయాలు కావు. అయితే వ్యక్తి వ్యక్తిగత ఆచరణ తప్పుగా ఉంటే విమర్శ చేయవచ్చును. ఒక వ్యక్తి మంచి గాని, చెడు గాని ఆ వ్యక్తికే తప్ప కుటుంబానికి ఆపాదించాల్సిన అవసరం లేదు. అలా ఆపాదించడం కూడా బ్రాహ్మణిజమే.

కులాంతర వివాహాల సందర్భంగా హత్యలు, ఆత్మహత్యలు, రాజీ పడడమో జరుగుతుంది. వారి తల్లిదండ్రులు బలవంతులో, ధనవంతులో అయినప్పుడు ఎదుటి వారిని చంపించడానికి ప్రయత్నం చేస్తారు. తల్లిదండ్రులను ఒప్పించలేని పరిస్థితిలో ప్రేమికులలో ఒకరు కాని, ఇద్దరు కాని ఆత్మహత్య చేసుకోవచ్చును. ఒకొక్కసారి పరువు పోయిందని అమ్మాయి తల్లిదండ్రులు ఆత్మహత్య చేసుకోవచ్చును. అవగాహన ఉన్నవారు రాజీ పడవచ్చును. కొంతమంది తల్లిదండ్రులకు ఆ పెండ్లి ఇష్టం లేకపోతే ఎవరి జీవితం వారిది అని సరిపెట్టుకొని వారితో సంబంధాలు రద్దు చేసుకుంటారు. ఇవన్నీ పరిస్థితులపై ఆధారపడేవే. ఇందులో రాజీపడడం, సంబంధాలు రద్దు చేసుకోవడం మెరుగైన పద్ధతులే. ఆమోదించడం ఈ రెండింటికంటే మెరుగైనది. హత్య చేయడానికి వెనుకాడని తల్లిదండ్రులది బ్రాహ్మణిస్టు విధానం అవుతుంది. ఆత్మహత్య చేసుకునే తల్లిదండ్రులది పరాయీకరణ అవుతుంది.

పుట్టే ప్రతితరంలోని మెజారిటీ వ్యక్తులను కులం విషయంలో పాలకవర్గాలు పరాయీకరించుకుంటే ఎంతకాలమైనా కులం అలాగే కొనసాగుతుంది. కులం విషయమే కాదు, ఏ విషయంలో

పరాయీకరించినా ఆ వ్యవస్థ అలాగే కొనసాగుతుంది తప్ప మార్పు రాదు. పరాయీకరణ అంటే ఏమిటి? తనది కాని భావజాలాన్ని తనదిగా భావించడం, తనదైన భావజాలాన్ని తనది కాదు అని భావించడం పరాయీకరణ అవుతుంది. కులం ఉండడం వలన అగ్రకులాలకు ప్రయోజనం ఉంటుంది. అయినా నిమ్న కులాలు కూడా దానిని పాటిస్తాయి. ఎందుకంటే పరాయీకరణ చెందడం వల్లనే.

పరాయీకరణ చెందిన వ్యక్తిలో మార్పు రావడం చాలా కష్టం. సమాజంలోని ఎందరో వ్యక్తుల త్యాగమే వారిని మార్చగలదు. ఇబ్బందులు పడడమో, చావడమో త్యాగం అవుతుంది. పరాయీకరణ బలంగా ఉంటే మరణమే తప్ప మార్పు రాదు. కొంతమంది తల్లిదండ్రులు తమ పిల్లల కులాంతర వివాహాలను ఒప్పుకోరు. తల్లిదండ్రులపై గల అభిమానాన్ని చంపుకోలేక, అనుకున్నది సాధించలేక పిల్లలు ఆత్మహత్య చేసుకుంటారు. వారి ఆత్మహత్యలు తల్లిదండ్రులను ఆలోచింపజేస్తాయి. అప్పుడు వారిలో మార్పు రావచ్చును. మిగతా వారికి ఆ మార్పు ఉపయోగపడుతుంది. పరాయీకరణ వలన వారిలో ఆగిన మార్పు తిరిగి ఉత్తేజితం కావడానికి వారి పిల్లల ఆత్మహత్యలు అవసరమయ్యాయి అని అర్థం.

మార్పు రావడానికి పరిస్థితులు అవసరమే. కాని ఆ పరిస్థితులను ప్రచారం ద్వారా కొంత మార్చవచ్చును. పరాయీకరించబడిన తరాన్ని త్యాగాలతోనూ, యువతరాన్ని ప్రచారంతోనూ మార్చవచ్చును. అందువలన కులం పుట్టుకను, కులం విషయంలో కులాంతర వివాహాల విషయంలో ఒక చోట జరిగిన సంఘటనలను మరొక చోట నిరంతరం ప్రచారం చేయవలసి ఉంటుంది. నేటికీ గద్దర్, గోరటి వెంకన్న, భీమసేన, జయరాజు లాంటి ఎందరో పాటల రచయితలు దళిత బహుజన కులాలు ఎదుర్కొంటున్న సమస్యలను గురించి, తిరుగుబాటు చేయమని చెప్పే పాటలను మాత్రమే రాశారు తప్ప కులం పుట్టుకను గురించి తెలియజేసే పాటలు రాయలేదు. వారి పరిస్థితులు వారికి ఆ అనుభవం కల్పించలేదు. కమ్యూనిస్టు పార్టీలు కూడా ఆ పని చేయలేదు. కుల సమస్య ఎజెండాతో ఏర్పడిన సిపిఐయుఎస్ఐ కూడా కులం గురించి ప్రచారం చేయలేదు. దళిత బహుజనవాదం గురించి చెప్పేవారు కూడా కులం పుట్టుకను ప్రచారం చేయలేదు. కులం ఉపరితలంలో భాగమన్న కమ్యూనిస్టులు ప్రచారం రాజ్యాధికార అనంతర కార్యక్రమం అన్నారు. కులాన్ని పునాదిలో భాగం చేయాలనే వాదనతో మొదలైన దళిత బహుజనవాదులు దానిని పునాదిలో భాగం చేసి ఉపరితలమన్న భావజాలాన్ని విస్మరించారు. ఇప్పుడు కులం పునాదిలోనూ ఉపరితలంలోనూ భాగమే అంటున్న కమ్యూనిస్టులు కూడా భావజాలాన్ని ప్రచారం చేయాలన్న అవగాహనకు రాలేకపోతున్నారు. కులం పుట్టుకను ప్రచారం చేయకుండా కులం పునాదిలో, ఉపరితలంలో భాగమే అనడం వలన ప్రయోజనం ఉండదు. పెసరు చేలో పోగొట్టుకున్న బంగారు ఉంగరాన్ని పప్పు సట్టిలో వెతుకుతున్నట్లు అవుతుంది.

ఇప్పటికైనా పాటల రచయితలు, గాయకులు, కమ్యూనిస్టు పార్టీలు, దళిత బహుజన నాయకులు, వక్తలు, వ్యాస రచయితలు, కుల నిర్మూలన కొరకు తమవంతు కార్యక్రమాన్ని తీసుకోవాలి. ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలు కార్యక్రమం తీసుకోకుండా కుల నిర్మూలన విజయవంతం కాదు. కమ్యూనిస్టు పార్టీలు కూడా విజయం సాధించలేవు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

---

*(...4వ పేజీ తరువాయి)*

ఆయుధాల బూచిని చూపి సిరియాపై దాడి చేయాలని నాటో దేశాలు చూస్తున్నాయి. ఇక సత్యనారాయణరెడ్డి చైనా గురించి ఇచ్చిన అంచనా అత్యంత ఆశ్చర్యకరమైనది. 'జన' చైనా అన్ని విధాలుగా దూసుకు వచ్చిందట. మూడవ ప్రపంచ దేశాలకు మిత్రునిగానూ, అమెరికాకు సవాలుగానూ నిలుస్తున్నదట. ఏ వాస్తవాల ఆధారంగా సత్యనారాయణరెడ్డి ఈ నిర్ధారణకు వచ్చారో ఎవరికైనా అర్థం కావడం కష్టం. అమెరికా ప్రపంచం మీద కొనసాగిస్తున్న ఆధిపత్య విధానాలను మాటలలో తప్ప మరే విధానంగానూ చైనా ఎన్నడూ ఎదుర్కోలేదు. రెండవ ప్రపంచ దేశాలకు అమెరికాకు మధ్య ఉన్న వైరుధ్యాలను, రెండవ ప్రపంచ దేశాలు అమెరికాకు మూడవ ప్రపంచ దేశాలకు మధ్య ఉన్న వైరుధ్యాలను చైనా బహు తెలివిగా ఉపయోగించుకుంటూ ప్రపంచ మార్కెట్‌ను కైవసం చేసుకోవడానికి ప్రయత్నిస్తోంది. ఆఫ్రికాలో ఓ మేరకు సామ్రాజ్యవాద స్థాయిలో చైనా ఇప్పటికే ప్రవేశించింది. నిన్న మొన్నటి ఉత్తర కొరియా విషయంలో కూడా చైనా, అమెరికా పక్షాన్నే నిలబడి ఉత్తర కొరియాను మందలించింది. చైనా ఒక సామ్రాజ్యవాద దేశంగా మారుతోంది. ప్రపంచ మార్కెట్‌ను పంచుకునే పరుగులో చైనా కూడా చేరింది. ఇటువంటి చైనా సామ్రాజ్యవాద వ్యతిరేక కూటమికి ఎలా నాయకత్వం వహించగలుగుతుంది? ఇక చివరికి భారత పాలక వర్గాల గురించి చెప్తుతూ భారత పాలక వర్గాలు కల్తీ లేని దళారులని, అమెరికా అగ్రరాజ్య విధానాలతో పీట ముడి వేసుకుని ఉన్నారని అంచనా ఇచ్చారు. 'భారత దేశం కూడా మూడవ ప్రపంచ దేశం. అయితే' అంటూ ప్రత్యేకంగా పేర్కొంటూ పై అంచనాను సత్యనారాయణరెడ్డి ఇచ్చినప్పుడు ఎవరైనా అనుకునేదేమంటే భారత పాలక వర్గాలు అగ్రరాజ్య వ్యతిరేక ఐక్య సంఘటనలోకి రావు అనే. కాని రచయిత ఇక్కడ ఎటువంటి స్పష్టత ఇవ్వకుండానే ఒక్కసారి లాంగ్ జంప్ చేసి భారత పాలక వర్గాల అమెరికా అనుకూల విధానాలకు వ్యతిరేకంగా అందరూ పోరాడాలని చెప్పారు. అదే అమెరికా ఆధిపత్య వ్యతిరేక పోరాటం అవుతుంది కూడా. అంటే దీని అర్థం ఏమిటి ? కల్తీ లేని దళారులైన భారత పాలక వర్గాలు అగ్రరాజ్య వ్యతిరేక ఐక్య సంఘటనలోకి రావు, దేశ భక్తులు కమ్యూనిస్టులు అందరూ ముందు భారత పాలక వర్గాలను అమెరికా ఆధిపత్యం నుండి బయటికి తీసుకు రావాలి, తరువాత పాలక వర్గాలు దేశ భక్తులు కమ్యూనిస్టులు అందరూ కలిసి అమెరికాకు వ్యతిరేకంగా పోరాడాలి. ఇదీ ఈ సిద్ధాంతం గొప్పతనం.

**– లంకా వెంకటపాపిరెడ్డి**
*వరంగల్*

**2013** వీక్షణం మే సంచికలో 'భగత్‌సింగ్ నుంచీ వేలాడుతున్న ఉరితాడు' అనే ఆకుల భూమయ్య వ్యాసం చదివాను. ఇప్పుడే 'అండర్‌స్టాండింగ్ భగత్‌సింగ్' అనే చమన్‌లాల్ ఇంగ్లిష్ పుస్తకం (ఆకార్–2013) చదివి ముగించాను. బ్రిటిష్ పాలన అయినా, భారతీయుల పాలన అయినా వివిధ ఉద్యమకారులపై – ఉరిశిక్షలు అమలు జరుగుతూనే ఉన్నాయి. ఉరిశిక్షను రద్దు చేసేందుకు ఇటు మన దేశంలో – అటు విదేశాల్లో జరుగుతున్న ఉద్యమాలు ఏవీ ఫలించనేలేదు. ఇది ఆందోళన కరమైన విషయం. మారుతున్న సామాజిక, రాజకీయ సమీకరణల నేపథ్యంలో భగత్‌సింగ్, ఆయన వారసుల విప్లవాచరణపై మరింత విస్తృత విశ్లేషణ జరగాలి. ఉరి రద్దు మాత్రమే కాదు, ఆ వెనకగల కారణాలపై కూడా విశ్లేషణ జరగాలి.

**– డా. మానేపల్లి**
*ఎలమంచిలి, విశాఖపట్నం*

# ‘శ్రమ శక్తి’ ఉపయోగపు విలువ గురించి

*జీతాల శ్రామికులకూ పెట్టుబడిదారులకూ ఉండే సంబంధం అమ్మే - కొనే సంబంధం అనడంలో మార్క్సు పొరపాటు పడ్డాడని అంటున్నారు* **రంగనాయకమ్మ**

**ఒక వివరణ**

జీతాల శ్రామికులకూ – పెట్టుబడిదారుడికీ ఉండే సంబంధం, ఎటువంటిది? అమ్మే–కొనే సంబంధమా; లేక, పెట్టుబడిదారుడు, శ్రామికుల శ్రమని దోచే సంబంధమా; లేక, ఆ రెండు పద్ధతులూ ఉన్న సంబంధమా?

మార్క్సు, ‘కాపిటల్’ పుస్తకంలో చూపించేది, ‘అది ఆ రెండు పద్ధతులూ ఉన్న సంబంధం’ అని. ఆ సంబంధం, మొదట అమ్మే – కొనే సంబంధంగా మొదలై, చివరికి ‘పెట్టుబడిదారుడు శ్రామికుల శ్రమని దోచే సంబంధం’గా ముగుస్తుంది – అని.

అసలు, కాపిటల్ పుస్తకం చెప్పేదంతా, యజమానీ శ్రామిక సంబంధాన్ని, యజమాని ద్వారా జరిగే శ్రమ దోపిడీ సంబంధంగా చూపించడానికే. అలాంటప్పుడు, ఆ శ్రమ దోపిడీ సంబంధాన్ని, ప్రారంభం లో అయినా అమ్మే–కొనే సంబంధంగా ఉంటుందని చెప్పడం, శ్రామిక వర్గాన్ని పెద్ద ప్రమాదంలో పడెయ్యదా – అని నా సందేహం! నేను చర్చించేది దీన్ని గురించే. ‘నీకు వచ్చిన సందేహం, మార్క్సుకి వచ్చి ఉండదా?’ అనకండి! ఈ సందేహాన్ని మార్క్సు మీద విమర్శగా ప్రారంభించడం లేదు నేను. యజమానీ శ్రామిక సంబంధాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడానికే ఇది ఒకసారి చర్చించ వలసిన విషయంగా నాకు తోచింది.

శ్రమ దోపిడీ సంబంధాన్ని, అమ్మే–కొనే సంబంధంగా మొదలైనట్టుగా చెప్తే, అది శ్రమ దోపిడీ జరుగుతోందనే వాదాన్ని బలహీన పరుస్తోందని నాకు కొత్తగా భయం ప్రారంభమైంది. నా భయం ఏమిటో అర్థం చేసుకోవాలంటే, అమ్మే–కొనే సంబంధం అంటే దాని లక్షణాలేమిటో ఒకసారి గుర్తు చేసుకోవాలి. శ్రమ దోపిడీ సంబంధాన్ని ప్రారంభంలో అయినా అమ్మే–కొనే సంబంధంగా ఎందుకు అనకూడదో ఇక్కడ తెలియడానికి, ఆ అమ్మే–కొనే సంబంధాన్నే మొదట చూడాలి.

**అమ్మే–కొనే సంబంధం**

ఇద్దరు స్వతంత్ర ఉత్పత్తిదారులు ఉన్నారు. ఒకరు కుండల్నీ, ఇంకొకరు చెప్పుల జతల్నీ, తయారుచేస్తూ, వాటిని తమకు కావలసిన ఇతర వస్తువులతో మారకాలు చేసుకుంటూ ఉంటారు. ఆ మారకాలు, తన వస్తువుని ఇచ్చి, ఇంకో వస్తువుని తీసుకునే బార్టరు పద్ధతిలో అయినా జరగవచ్చు; లేదా, తన వస్తువుని అమ్మి, ఆ డబ్బుతో ఇంకో వస్తువుని కొనే డబ్బు పద్ధతిలో అయినా జరగవచ్చు. ఎలా జరిగినా, విషయం ఒకటే. అది మారకమే. రెండు వేరు వేరు వస్తువులకు ‘మారకం’ జరిగితే, ఆ రెండు వస్తువుల విలువలూ సమానంగా ఉన్నాయనీ, విలువలు సమానంగా ఉండడం వల్లనే వాటికి మారకం జరిగిందనీ, అర్థం.

కుండ విలువ 4 అనీ, చెప్పుల జత విలువ 6 అనీ, అనుకుంటే, వాటిని మారకం చేసుకోవడానికి కుండ మనిషి ఒప్పుకుంటాడు గానీ, చెప్పుల మనిషి ఒప్పుకోడు. ఆ మారకం వల్ల చెప్పుల మనిషికి 2నష్టం అవుతుంది కాబట్టి. నష్టానికి ఒక మనిషి ఒప్పుకోడు కాబట్టి, 6 విలువకీ, 4 విలువకీ, మారకం జరగదు. అంటే, ఎక్కడ ఏ మారకం జరిగినా (అది డబ్బు ద్వారా జరిగినా), సమాన విలువల మధ్యనే జరుగుతుంది – అనేది జనరల్ సూత్రం. (వ్యాపార ఎత్తుగడలూ, మోసాలూ, వంటి వాటి వల్ల అసమాన మారకాలు జరిగితే, అవి వేరే పరిస్తితులు. వాటి సంగతి కాదు ఇక్కడ.)

కుండ విలువ 4, చెప్పుల విలువ కూడా 4 అనుకుందాం. అప్పుడు, కుండని ఇచ్చి, చెప్పులు తీసుకుంటే, అది సమాన విలువల మారకమే. లేదా, కుండ మనిషి, తన వస్తువుని అమ్మి 4 డబ్బు తీసుకుని, ఆ 4 డబ్బుతో చెప్పుల జతని కొంటే, అప్పుడు కూడా అది, సమాన విలువల మారకమే. ఆ మారకం, ఏ పద్ధతిలో జరిగినా, అది 4 విలువని ఇచ్చి, 4 విలువని తీసుకున్నట్టే. ఆ మారకం వల్ల, ఎటు వేపు మనిషికీ, లాభమూ ఉండదు, నష్టమూ ఉండదు. ఇద్దరూ, ఇచ్చినంత విలువనీ తిరిగి తీసుకుంటారు. ఎవరికీ విలువ తగ్గదు.

బార్టరు పద్ధతిలో, ‘అమ్మడం–కొనడం’ అనే మాటలు లేకపోయినా, అక్కడ కూడా జరిగే విషయాలు అవే. డబ్బు ద్వారా జరిగే మారకాల్లో అయితే, వస్తువుని ఇచ్చి డబ్బు తీసుకుంటే అది ‘అమ్మడం’ అనీ, డబ్బు ఇచ్చి వస్తువుని తీసుకుంటే అది ‘కొనడం’ అనీ, ఆ మాటలూ, ఆ విషయాలూ, స్పష్టంగా ఉంటాయి. రెండు వస్తువుల మారకం జరిగితే, ఆ వస్తువుల మారకం ద్వారా నిజంగా జరిగేది, ఇద్దరు వ్యక్తుల ‘శ్రమల’ మారకం. ఒకరి శ్రమని ఒకరు వాడుకుంటారు. ఆ రకంగా అది, ఆ మనుషుల ‘శ్రమల సంబంధం’.

అమ్మే–కొనే విషయాలు, వస్తువుల మధ్యే కాదు, వస్తువులు కాని శ్రమల మధ్య కూడా జరుగుతాయి. ఒక చాకలి మనిషి, ఒక క్షవరాల మనిషికి బట్టలు వుతికిపెడితే, ఆ క్షవరాల మనిషి ఆ చాకలి మనిషికి క్షవరం చేసిపెడతాడు. ఆ మారకాలు, డబ్బు లెక్కలతోనే జరగవచ్చు. మారకాలు, వస్తువులు కాని శ్రమల మధ్య జరిగితే, అవి ‘శ్రమ సంబంధాలు’ అని మరీ స్పష్టంగా తెలుస్తుంది. అమ్మే–కొనే సంబంధం వల్ల జరిగే ఇంకో ముఖ్య విషయం, ఒక మనిషి ఏ వస్తువుని కొంటే, ఆ వస్తువు ఇచ్చే ‘ఉపయోగపు విలువ’ ఆ మనిషిదే.

కుండలు తయారుచేసే మనిషి, ఒక కుండని అమ్మకపోతే, దాన్ని తనే వాడుకుంటాడు. కానీ, దాన్ని అమ్మేస్తే, అది ఇంకో మనిషికి వెళ్లిపోతే, ఆ వస్తువు ఇచ్చే ఉపయోగపు విలువ, దాన్ని అమ్మినవాడిది కాదు; కొన్నవాడిదే.

ఒక వస్తువుని (ఒక సరుకుని) అమ్మే మనిషి, దాని విలువనే వెనక్కి తీసుకోగలడు గానీ, దాని ఉపయోగపు విలువని కూడా తీసుకోలేడు. వెనక్కి వచ్చిన విలువతో, ఇంకో రకం ఉపయోగపు విలువని కొనుక్కోగలడు గానీ, అమ్మేసిన వస్తువు ఉపయోగపు విలువని తను వాడుకోలేడు.

ఇంత వరకూ చూసినదాన్ని బట్టి, 'అమ్మే-కొనే సంబంధం' వల్ల 3 విషయాలు కనపడతాయి.

1. అమ్మే-కొనే సంబంధం, శ్రమల సంబంధం.
2. అమ్మే-కొనే సంబంధం, సమాన విలువల సంబంధం.
3. అమ్మే-కొనే సంబంధంలో, అమ్మిన వస్తువు ఉపయోగపు విలువ, ఆ వస్తువుని కొన్నవాళ్లదే అవుతుంది.

ఈ విషయాలన్నీ వివరించింది ఎవరో కాదు, మార్క్సే. మనందరం ఈ విషయాలన్నీ నేర్చుకున్నది మార్క్స్ నించే.

అయితే, ఇక్కడి ప్రశ్న, పెట్టుబడిదారుడికీ, వేతన శ్రామికులకూ ఉండే సంబంధంలో కూడా ఆ మూడు విషయాలూ ఉంటాయా? వేరు రకాల సంబంధాల గురించి, ఇంతకు ముందే మనకు తెలిసి ఉన్నదాన్ని బట్టి, యజమానీ శ్రామిక సంబంధంలో అసలు శ్రమల మారకాలే ఉండవు. శ్రమల మారకాలే లేని చోట, అవి సమాన మారకాలా, అసమాన మారకాలా - అనే ప్రశ్నే ఉండదు. అలాంటప్పుడు, యజమానీ శ్రామిక సంబంధాన్ని ఒక్కసారైనా అమ్మే-కొనే సంబంధంగా చెప్పవచ్చునా? - ఇదే ఇక్కడ చర్చనీయాంశం. ఇదే ఇక్కడ నా సందేహం.

యజమానీ శ్రామిక సంబంధానికి లక్షణాలు ఎలా ఉంటాయో ఇప్పుడు చూడాలి.

**పెట్టుబడిదారుడికీ, వేతన శ్రామికులకూ సంబంధం**

'శ్రామికుడు' అంటే, పని చేసేవాడు.

'పెట్టుబడిదారుడు' అంటే, పని ఇచ్చేవాడు.

('యజమానీ - శ్రామిక' సంబంధం ఎక్కడ ఉన్నా, ఆ ఇద్దరి పాత్రలూ అవే.)

శ్రామికుడు, ఒక పని దినంలో చేసే పని అంతా - అతని 'శ్రమ'. ఆ 'శ్రమకి ఉన్న విలువ'ని, 7అనుకుందాం. ఆ 7 అంతా శ్రామికుడికి జీతంగా వెళ్లదు. జీతం, ఆ 7 కన్నా తక్కువగా ఉంటుంది. కాబట్టి, దాన్ని 2 అనుకుందాం. ఆ జీతాన్ని శ్రామికుడి 'శ్రమ శక్తి విలువ'గా అనడం సరైన మాట కాకపోయినా ప్రస్తుతానికి అలాగే అనుకుందాం. ఆ 2 జీతాన్ని పెట్టుబడిదారుడు ఎక్కడి నించి తెచ్చి ఇస్తాడు? ఆ జీతం, శ్రామికుడి 'శ్రమ విలువ' అయిన 7 లో నించి తీసి ఇచ్చేదే. ఈ ఉదాహరణలో, శ్రామికుడి శ్రమ విలువలో నించి శ్రామికుడికి అందకుండా పోయే భాగం 5. దాని పేరు 'అదనపు విలువ'. పని స్థలంలో శ్రామికుడు తయారుచేసిన కొత్త సరుకుని పెట్టుబడిదారుడు బజారులో అమ్మగా దానికి వచ్చిన డబ్బు అంతా మొదట పెట్టుబడిదారుడి చేతిలోకే వస్తుంది. ఆ డబ్బులో నించి, ఆ సరుకు తయారీ కోసం మొదట ఖర్చయిన ఉత్పత్తి సాధనాలూ వగైరాల ఖర్చుల్ని తీసివెయ్యగా, ఆ పైన మిగిలే 5 అదనపు విలువని మొదట పెట్టుబడిదారుడే స్వాధీనం చేసుకుంటాడు. '5 అదనపు విలువ' అంటే, అది 5 'అదనపు డబ్బు'. దాన్ని శ్రమగా చూస్తే, అది 5 విలువ గల 'అదనపు శ్రమ'. దాన్ని ఉత్పత్తిగా చూస్తే, అది 5 విలువ గల 'అదనపు ఉత్పత్తి'. అది, శ్రామికుడికి అందకుండా పోయే భాగం. శ్రామికుడు, 7 శ్రమ చేసి, 2 జీతం తీసుకున్నాడంటే, ఆ 2 విలువతో వచ్చే ఉత్పత్తులే కొనగలడు గానీ, మిగిలిన 5 విలువతో వచ్చే ఉత్పత్తులు కొనలేడు. శ్రామికుడికి అందకుండా పోయిన ఆ 5 భాగం, పెట్టుబడిదారుడి చేతి నించి, తర్వాత, ఆ పని స్థలం ఉన్న భూమికి కౌలుగా కొంతా, పెట్టుబడికి వడ్డీ-లాభాలుగా కొంతా, పంపకాలవుతుంది. అలా శ్రామికుడి శ్రమలో నించి అదనపు విలువని పెట్టుబడిదారుడు లాగడం, 'శ్రమ దోపిడీ'. అలా లాగిన 'అదనపు విలువ'ని పంచుకుని తినే వాళ్లందరూ కలిసి, శ్రమని దోచే 'దోపిడీ వర్గం'. అదనపు శ్రమని (అదనపు విలువని) పోగొట్టుకుంటూ దోపిడీకి గురి అయ్యే శ్రామికులందరూ కలిసినది 'శ్రామిక వర్గం' (కార్మిక వర్గం). ఈ వర్గంలో ప్రతీ శ్రామికుడూ (శ్రామికురాలూ) చేసే ప్రతీ సరుకు నించీ, నిత్యం (రోజూ) శ్రమ దోపిడీ జరుగుతూనే, అది నిత్యం దోపిడీ వర్గానికి అందుతూనే ఉంటుంది.

పెట్టుబడిదారుడికీ, శ్రామికుడికి (శ్రామికులకూ) ఉండే సంబంధంలో లక్షణాలు ఏమిటి? ఇద్దరు స్వతంత్ర ఉత్పత్తిదారుల సంబంధంలో ఉండే 3 లక్షణాలు, ఈ సంబంధంలో ఉన్నాయా?

1) యజమానీ శ్రామిక సంబంధం, 'శ్రమల సంబంధం' కాదు. శ్రామికుడి శ్రమే యజమానికి పోతుంది గానీ, యజమాని అనే వాడు (ఇక్కడ, పెట్టుబడిదారుడు) శ్రామికులకు ఇచ్చే శ్రమ ఏదీ ఉండదు. ఇది ఒకరి శ్రమ ఒకరికి మారే సంబంధం కాదు.

2) శ్రమల సంబంధమే లేనప్పుడు, అది సమాన విలువల మారకమా, అసమాన విలువల మారకమా - అనే ప్రశ్నే లేదు. శ్రామికుడు, పెట్టుబడిదారుడికి ఇచ్చేది, తన శ్రమని. పెట్టుబడిదారుడు శ్రామికుడికి ఇచ్చే జీతం డబ్బు, శ్రామికుడి శ్రమ విలువలో నించి తీసి ఇచ్చేదే. అది పెట్టుబడిదారుడి శ్రమ ద్వారా వచ్చే డబ్బు కాదు.

3) శ్రామికుడి 'శ్రమ శక్తి' అనే సరుకుకి ఉండే ఉపయోగపు విలువ, ఎవరిది అవుతుంది? - తర్వాత చూడవలసిందంతా ఈ విషయమే.

ఇంత వరకూ చూసిన శ్రమ విలువా, శ్రమ శక్తి విలువా, అదనపు విలువా, శ్రమదోపిడీ, శ్రామికవర్గం, దోపిడీవర్గం, స్వతంత్ర ఉత్పత్తిదారుల సంబంధాలూ, యజమానీ శ్రామిక సంబంధాలూ - ఇలా ఈ పేర్లూ, ఈ విషయాలూ అన్నిటినీ, కొత్తగా చెప్పింది మార్క్సే. ఆయన వివరించి చెపితేనే, శ్రమదోపిడీ రహస్యం, సమాజానికి తెలిసింది.

అయితే, శ్రమ దోపిడీ జరిగే విధానాన్నీ, ఆ సంబంధాన్నీ, ఎంతో వివరంగా, హేతుబద్ధంగా చెప్పిన మార్క్సే, అదే సంబంధాన్ని, 'అమ్మే-కొనే సంబంధం'గా ప్రారంభమవుతుందని చెప్పడం, వింతగా ఉంది నాకు.

శ్రామికుడి 'శ్రమ శక్తి'ని ఒక 'సరుకు'గా చెపుతాడు మార్క్స్. శ్రామికుడు తన సరుకుని పెట్టుబడిదారుడికి అమ్ముతాడనీ, దాన్ని పెట్టుబడిదారుడు కొంటాడనీ, ఆ సరుకుకి బదులుగా శ్రామికుడికి 'జీతం'గా అందేది, 'శ్రమ శక్తి విలువ' అనీ, - ఈ రకంగా.

శ్రమశక్తిని సరుకుగా అనుకుంటే, దాన్ని శ్రామికుడు అమ్మితే, దాన్ని పెట్టుబడిదారుడు కొంటే, ఆ సరుకు ఇచ్చే 'ఉపయోగపు విలువ' ఎవరిది అవుతుంది? – దాన్ని ఎవరు కొన్నారో వాళ్లదే అవుతుంది కదా?

అసలు, 'శ్రమ శక్తి' ఇచ్చే ఉపయోగపు విలువ ఏమిటి? – శ్రమ చెయ్యడం. శ్రమ శక్తి అంటే, మనిషిలో శ్రమ చెయ్యగల సామర్థ్యం. అయితే, శ్రమ చెయ్యడంలో, శ్రమ శక్తి లక్షణం ఎలాంటిదంటే, అది తక్కువ శ్రమా చెయ్యగలదు, ఎక్కువ శ్రమా చెయ్యగలదు. ఎలా కావాలంటే అలా చెయ్యగలదు. ఒక శ్రమ శక్తి, తను ఎంత ఖర్చుతో తయారవుతుందో అంతే విలువనిచ్చే శ్రమ వరకూ చేసి ఆగిపోనూగలదు; లేదా, తన పోషణ కోసం జరిగిన ఖర్చు కన్నా 10 రెట్ల విలువ ఉత్పత్తి అయ్యే వరకూ కూడా పనిచెయ్యగలదు. 10 పైసలతో దొరికే గుప్పెడు నూకల గంజి తాగిన మనిషి, అవసరమైతే 10 గంటల సేపు, 10 రూపాయల విలువ గల పనిచెయ్యగలడు. అంటే, శ్రమ శక్తి ఎలాంటిదంటే, అది తన విలువ కన్నా, ఎక్కువ విలువ గల పని చెయ్యగలదు. అదే, శ్రమ శక్తికి ఉండే ఉపయోగపు విలువ. శ్రమ శక్తికి అలాంటి లక్షణం ఉంది కాబట్టే, పెట్టుబడిదారుడికి, శ్రామికుడి శ్రమ ద్వారా, ఆ మనిషి పోషణ కోసం అయ్యే ఖర్చు కన్నా ఎక్కువ విలువని (అదనపు విలువని) సంపాదించడం సాధ్యమవుతుంది.

పెట్టుబడిదారుడు, ఆ శ్రమ శక్తిని కొనేది, ఆ సరుకు వల్ల దొరికే ఉపయోగం కోసమే కదా? ఆ సరుకు ద్వారా దొరికే అదనపు విలువని సంపాదించడం పెట్టుబడిదారుడి తప్పెలా అవుతుంది? ఎవరు కొన్న సరుకు ఉపయోగపు విలువని వాళ్లు తీసుకోరా? శ్రమ శక్తిని కొనుక్కున్నవాడు, ఆ సరుకు ఇచ్చే ఉపయోగపు విలువని వాడుకుంటే, అది 'శ్రమ దోపిడీ' ఎలా అవుతుంది?

కానీ, పెట్టుబడిదారుడికీ శ్రామికుడికీ మధ్య నిజంగా జరిగేది, శ్రమ దోపిడీయే. అయితే, శ్రమ శక్తిని సరుకు అనీ, దాన్ని శ్రామికుడు అమ్ముతాడనీ, పెట్టుబడిదారుడు కొంటాడనీ – ఈ రకంగా చెప్పడం వల్ల, 'శ్రమ దోపిడీ' జరుగుతోందనే వాదం బలహీనపడిపోదా? దాని వల్ల శ్రామిక వర్గం పెద్ద ఇబ్బందిలో పడిపోదా?

శ్రమ శక్తిని 'సరుకు' అనడంలో మార్క్స్ అర్థం ఏమై ఉంటుందో ఒక అర్థాన్ని మనం చెప్పుకోవచ్చు. కానీ, అది మనల్ని (శ్రామిక వర్గాన్ని) గట్టెక్కిస్తుందా? – అదే చూడాలి.

శ్రమ శక్తిని 'సరుకు' అనడంలో మార్క్స్ అర్థం ఏమిటి? – 'శ్రామికుడు చేసే మొత్తం శ్రమనంతటినీ, మార్క్స్, 'సరుకు' అనలేదు. శ్రామికుడు, తను చేసే శ్రమనంతా అమ్ముతున్నాడు – అనలేదు, 'శ్రమ శక్తి' వరకే మార్క్స్ ఆ మాట అన్నాడు. పెట్టుబడిదారుడికీ, శ్రామికుడికీ ఉండే సంబంధాన్ని అమ్మే–కొనే సంబంధంగా చెప్పింది, 'శ్రమ శక్తి' విషయంలో మాత్రమే.' – ఇలా మనం జవాబు చెప్పుకోవచ్చు గానీ, మనం చర్చించేది, 'శ్రమ శక్తి' విషయంలో చెప్పినదాన్ని గురించే కదా? శ్రమ శక్తే 'సరుకు' అయితే, దాన్ని శ్రామికుడు అమ్మితే, ఆ సరుకు విలువ జీతమే అయితే, ఆ జీతాన్ని చెల్లించి పెట్టుబడిదారుడు ఆ సరుకుని కొంటే, అలా ఆ సరుకుని కొన్న వాడికి, ఆ సరుకుని ఉపయోగించుకునే హక్కు ఉంటుందా, ఉండదా? పెట్టుబడిదారుడు కొన్న సరుకు వల్ల, అతనికి ఎక్కువ విలువ దొరికితే, దాన్ని 'శ్రమ దోపిడీ' అని ఎలా వాదించగలం?

కానీ పెట్టుబడిదారుడి ద్వారా నిజంగా జరిగేది శ్రమ దోపిడీయే కదా? శ్రమ శక్తిని సరుకు అనడం, ఆ నిజానికి అడ్డం పడడం లేదా?

'శ్రమ దోపిడీ'ని నిజమైన విషయంగా చూపించాలంటే, 'శ్రమ శక్తిని పెట్టుబడిదారుడు కొంటాడు' అనే వాదం తప్పనీ, దాన్ని వదులుకోవాలనీ, నా వాదం.

అసలు, శ్రమ శక్తికి ఉండే ఉపయోగపు విలువ గురించి మార్క్స్ ఏమంటాడు? అది, శ్రామికుడిదే అంటాడా, పెట్టుబడిదారుడిది అంటాడా? – పెట్టుబడిదారుడిదే అంటాడు. ఎవరు కొన్న సరుకు ఉపయోగపు విలువ వాళ్లదే అవుతుందని మార్క్స్‌కి తెలీదా? శ్రమ శక్తి ఇచ్చే ఉపయోగపు విలువ, పెట్టుబడిదారుడిదే అవుతుందని మార్క్స్ పదే పదే చెపుతాడు. అసలు అది 'పెట్టుబడిదారుడి హక్కు' అంటాడు. కానీ ఆ హక్కుతోనే పెట్టుబడిదారుడు అదనపు విలువని సంపాదిస్తూ దోపిడీ చేస్తున్నాడు – అంటాడు.

సరుకుని కొన్నవాడే దాన్ని ఉపయోగించుకోవడం న్యాయమైన హక్కు అయితే, అది దోపిడీ ఎలా అవుతుంది? – ఇదే ఇక్కడి ప్రశ్న!

ఈ విషయం గురించి, మార్క్స్ మాటలు కొన్ని చూడాలి. వీటిలో – సరుకూ, అమ్మడం, కొనడం, అన్నీ వస్తాయి.

'శ్రమ శక్తి' విషయాల్ని వివరించే చాప్టర్‌కి మార్క్స్ పెట్టిన పేరు: 'శ్రమ శక్తి క్రయ, విక్రయాలు (సేల్ అండ్ పర్చేజ్ ఆఫ్ లేబర్ పవర్)'

('కాపిటల్' పుస్తకానికి విశాలాంధ్ర వారి తెలుగు అనువాదం నించే ఈ కొటేషన్లు ఇస్తున్నాను. కానీ, ఆ అనువాదంలో తేలికైన మాటలు లేవు. 'క్రయం' అంటే ఏమిటో ఏ పాఠకుడినైనా చప్పున చెప్పమనండి! 'క్రయ, విక్రయాలు' అనకుండా, 'అమ్మడం, కొనడం' అంటే, ఎంత తేలిగ్గా అర్థమవుతుంది! తర్వాత చూపించే కొటేషన్లలో, కొన్ని మాటల్ని నేను కొంచెం తేలిక చేసి ఇస్తాను. చదివేది సరిగా అర్థం కావడమే ముఖ్యం. తర్వాత, మార్క్స్ మాటలు చూడండి!)

మార్క్స్: 'ఒకడు, కొనేవాడు; ఒకడు, అమ్మేవాడు' (పే. 154).

(పెట్టుబడిదారుడూ, శ్రామికుడూ, అమ్మే–కొనే సంబంధంతో మొదలవుతారని చెప్పడం ఇది.)

◆ 'డబ్బు గల వాడు, మార్కెట్‌లో, శ్రమ చేయగల సామర్థ్యం గల శ్రమ శక్తి అనే ప్రత్యేక సరుకుని కనిపెడతాడు' (పే. 153).

('డబ్బు గల వాడు' అంటే, ఇక్కడ పెట్టుబడిదారుడు. ఇతను, ఏ డబ్బుతో శ్రమ శక్తికి జీతం ఇస్తాడో, ఆ డబ్బు అతని శ్రమ కాదు. అది అతని స్వంతం కాదు. అయినా, ప్రారంభంలోనే అలా చెప్తే, అర్థం చేసుకోవడం కష్టం అవుతుంది కాబట్టే, పెట్టుబడిదారుణ్ణి, 'డబ్బు గల వాడు' అనడం. నిజానికి, ఆ డబ్బు, వాడిది కాదని మొదటే ఒక మాట చెప్పవచ్చు గానీ, మార్క్స్, ఇదే మంచి పద్ధతిగా ఎంచాడు.)

◆ 'శ్రమ శక్తి యజమాని, తన శ్రమ శక్తిని, ఒక నిర్దిష్ట కాలానికి మాత్రమే అమ్మాలి' (పే. 154).

('నిర్దిష్ట కాలానికి మాత్రమే' అంటే, 'ఫలానా కొన్ని గంటల కాలానికి మాత్రమే' అని. 'పని దినం'గా నిర్ణయమయ్యే 10 గంటలో, 12 గంటలో – అని. బానిసల విషయంలో అయితే, పని కాలం హద్దులు ఉండవు.

వాళ్లు రోజంతా పని చేస్తూనే ఉండాలి, అర్ధ రాత్రి నిద్రల్లో తప్ప! కానీ జీతాల శ్రామికులకు పని దినానికి ఏదో ఒక హద్దు ఉంటుంది. అది 15 గంటల హద్దు అయితే, అన్ని గంటలూ శ్రమ చెయ్యాలి, దాన్ని దాటి చెయ్యక్కరలేదు గానీ. అదే, 'నిర్దిష్ట కాలానికి మాత్రమే'కి అర్థం).

- 'ఒక వైపున – డబ్బు యజమానుల్నీ, మరో వైపున – శ్రమ శక్తి తప్ప మరేమీ లేని మనుషుల్నీ, ప్రకృతి సృష్టించదు' (పే. 155). (ఈ యజమానీ శ్రామిక భేదాలు, ప్రకృతి సహజత్వాలు కావనీ, సమాజంలో ఉన్న ఫలానా కారణాల వల్ల ఏర్పడి సాగుతున్నవే – అనీ, చెప్పడం.)
- '.... కార్మికుని పోషణార్థం అవసరమైన జీవనార్థాల విలువే, శ్రమ శక్తి విలువ' (పే.156). (శ్రామికుడి 'పోషణ' అంటే, తిండి మాత్రమే అని కాదు. ఆ సమాజ పరిస్థితుల్ని బట్టి ఏర్పడే అవసరాల కోసమూ, పిల్లల పెంపకాలతో సహా, అనేక విషయాల ఖర్చులు కలిసేదే శ్రమ శక్తి విలువ అవుతుందని ఆ వివరాలన్నీ మార్క్సు అక్కడ చెప్పాడు.)
- (ఎక్కువ తేలిగ్గా చెప్పడానికి, మాటల్ని తగ్గించి, కొటేషన్ మార్క్సులు లేకుండా ఇస్తున్నాను ఇక్కడ.) శ్రామికుడు, ఒక పని దినం అంతా చేసిన శ్రమ విలువ 6 షిల్లింగులు అనుకుందాం. ఆ శ్రామికుడు, 3 షిల్లింగుల జీతానికి అంగీకరిస్తే, అతని శ్రమ శక్తి విలువ, సగం రోజులో చేసే శ్రమ విలువతో సమానం అవుతుంది (పే. 158).
- (ఏ సరుకు ఉపయోగపు విలువ అయినా ఎవరిది అవుతుందో మార్క్సు, ఇలా చెపుతున్నాడు:) ఏ కొనుగోలుదారుడైనా, తను కొన్న సరుకు ఉపయోగపు విలువని పొందేది, ఆ సరుకుని ఉపయోగించడం ద్వారానే. శ్రమ శక్తి ఉపయోగపు విలువ కూడా దాన్ని వాడడంలోనే వ్యక్తమవుతుంది (పే. 166).

(ఈ కొటేషన్ చూడండి! మనం ఎదురుచూసే అసలు కొటేషన్ ఇదే!)

'పెట్టుబడిదారుడు, ఒక రోజు శ్రమ శక్తిని దాని విలువ ఇచ్చి కొంటే, ఆ శ్రమ శక్తిని ఆ రోజంతా ఉపయోగించుకునే హక్కు (రైట్) అతనిదే. అతడు కొనుక్కున్న ఇతర సరుకుల లాగానే ఇది కూడా. ఉదాహరణకి, ఒక రోజు కోసం అద్దెకు తీసుకున్న గుర్రం లాగానే ఇది కూడా. ఒక సరుకుని కొన్నవానికే దాని ఉపయోగం చెందుతుంది. శ్రమ శక్తిని అమ్ముకున్నవాడు, తన శ్రమని అర్పించడం ద్వారా, తను అమ్మిన శ్రమ శక్తి ఉపయోగపు విలువని వదులుకోవడం తప్ప మరేమీ చెయ్యడు. ఆ శ్రామికుడు వర్క్‌షాపులో ప్రవేశించిన దగ్గర నుంచీ అతని శ్రమ శక్తి ఉపయోగపు విలువ, పెట్టుబడిదారుడికే చెందుతుంది. కనుక, దాని ఉపయోగం, అంటే అది ఇచ్చే శ్రమ కూడా, అతనికే చెందుతుంది' (పే.169).

(మార్క్సు ఇలా ఎందుకు చెపుతున్నాడంటే, 'పెట్టుబడిదారుడు, శ్రామికుడి శ్రమ శక్తిని ఉపయోగించడం ద్వారా ఎక్కువ విలువని ఎలా తీసుకోగలుగుతున్నాడో చూపించడానికి. కానీ, 'పెట్టుబడిదారుడు శ్రమ శక్తిని కొన్నాడు' అన్న తర్వాత, 'దాని ద్వారా దొరికే ఎక్కువ శ్రమని లాగుతున్నాడు' అనడం కుదురుతుందా?)

ఈ కొటేషన్‌ని చివరి దాకా చూడండి. 'ఏమిటి మార్క్సూ? ఏమిటిది మరీనూ' అనవలసి వచ్చే వాదం ఇది. చూడండి!

'అతణ్ణి (పెట్టుబడిదారుణ్ణి) వాస్తవంగా ప్రభావితం చేసేది శ్రమ శక్తికి ఉన్న నిర్దిష్ట (ప్రత్యేక) ఉపయోగపు విలువే. శ్రమ శక్తి, తన విలువకి మాత్రమే మూలం కాదు, ఎక్కువ విలువకి కూడా మూలం. శ్రమ శక్తి నించి ఈ ప్రత్యేక సేవనే పెట్టుబడిదారుడు ఆశిస్తాడు. శ్రమ శక్తిని అమ్మేవాడు, ఇతర సరుకుల్ని అమ్మేవాళ్ల లాగే ఆ సరుకుకి ఉండే మారకం విలువని తీసుకుని, దాని ఉపయోగపు విలువని ఇచ్చేస్తాడు. ఒక దాన్ని వదులుకోకుండా ఇంకో దాన్ని తీసుకోలేరు. నూనె అమ్మినవాడికి దాని ఉపయోగపు విలువ ఎలాగైతే చెందదో, అలాగే శ్రమ శక్తిని అమ్మిన వాడికి కూడా దాని ఉపయోగపు విలువ, అంటే అది ఇచ్చే శ్రమ, చెందదు. పెట్టుబడిదారుడు, ఒక రోజంతటికీ శ్రమ శక్తి విలువని చెల్లించాడు. కనుక, దాని ఒక రోజు ఉపయోగం, అతనిదే. ఒక రోజు శ్రమ అంతా అతనికే చెందుతుంది. ఒక వైపున, రోజువారీ శ్రమ శక్తి పోషణకి అర రోజు శ్రమ మాత్రమే ఖర్చవుతుంది; మరో వైపున, అదే శ్రమ శక్తి, మొత్తం రోజంతా పని చేయగలదు. కనుక, దానికి పెట్టుబడిదారుడు ఒక రోజు కోసం చెల్లించే విలువ కంటే, అది ఒక రోజంతటిలో రెట్టింపు విలువని ఉత్పత్తి చేస్తుంది. ఈ పరిస్థితి నిస్సందేహంగా కొనుగోలుదారుడికి అదృష్టం. కానీ అది శ్రమ శక్తిని అమ్మిన వానికి ఏ విధంగానూ హాని కలిగించదు' (పే. 177. 'అదృష్టం' అనే తెలుగు మాటకి మూలంగా ఉన్న ఇంగ్లీషు మాట, మాస్కో అనువాదం ప్రకారమూ, పెంగ్విన్ అనువాదం ప్రకారమూ కూడా 'ఏ పీస్ ఆఫ్ గుడ్ లక్'. 'హాని' అనే తెలుగు మాటకి మూలం, మాస్కో అనువాదం 'ఇంజ్యూరీ'. పెంగ్విన్ అనువాదం 'ఇన్ జస్టిస్'.)

అదృష్టాలూ – దురదృష్టాలూ పిచ్చి మాటలే అయినా, 'పెట్టుబడిదారుడికి అదృష్టం' అన్న నోటితో, 'శ్రామికుడికి దురదృష్టం' అని కూడా అని ఉంటే, ఎంత బాగుండేది! ఏమిటిది మార్క్సూ, శ్రామికుడికి హాని కాదా?

పోనీ మార్క్సు అన్న మాట అర్థం ఏమిటో ఆలోచిద్దాం ఒక సారి. 'శ్రామికుడికి హాని కాదు' అనేది, 'శ్రమ శక్తి' విషయంలో. 'జీతం ఇంత' అని నిర్ణయం అయ్యాక, అది అతనికి ఎలాగూ అందుతుంది కాబట్టి, ఆ విషయంలో లోపం జరగడం లేదు – అని చెప్పడం ఇది. ఇది ఇలా చెప్తూ, 'శ్రామికుడి అదనపు విలువ పెట్టుబడిదారుడికి పోతూనే ఉంది' అని చెపుతూనే ఉన్నాడు.

పెట్టుబడిదారుడు శ్రమ శక్తిని కొంటాడనీ, శ్రమ శక్తి ఇచ్చే ఉపయోగపు విలువ అతనిదే – అనీ, ఒక వేపు వాదిస్తూ; ఆ శ్రమ శక్తి ద్వారా అదనపు విలువని తీసుకోవడం శ్రమ దోపిడీ అవుతుందని ఇంకో వేపు వాదిస్తే – ఆ రెంటికీ ఎలా పొసుగుతుంది? – ఇప్పుడు, ఇక్కడ, శ్రామికులు ఏం చెయ్యాలి? ఒక దాని కొకటి విరుద్ధంగా ఉన్న 2 వాదాల్లో నించి దేన్ని తీసుకోవాలి, దేన్ని వదిలెయ్యాలి? సరైనదాన్ని నిలబెట్టుకుని, సరి కాని దాన్ని వదిలెయ్యాలి. శ్రామికుడి శ్రమ విలువ అంతా శ్రామికుడికే జీతంగా పోయేటట్టయితే, అసలు పెట్టుబడిదారుడు, శ్రామికులతో పరిశ్రమ ఎందుకు పెడతాడు? శ్రామికుల శ్రమని

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 16

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

*(2011 జనవరి సంచిక నుంచి క్రమబద్ధంగా వచ్చిన ఈ వ్యాస పరంపర అనివార్య కారణాల వల్ల 2012 జూన తర్వాత కొనసాగించలేకపోయాం. ఈ సంచిక నుంచి మళ్లీ కొనసాగుతుంది)*

**భారతదేశానికి** స్వాతంత్ర్యం వచ్చేటప్పటికి మద్రాస్ రాష్ట్రంలోని ఆంధ్ర భూ భాగంలో గంజాం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, బళ్లారి, కర్నూలు, అనంతపురం జిల్లాలు కలిసి ఉన్నాయి. మద్రాస్ రాష్ట్రంలోని మొత్తం జమీందారీ ప్రాంతంలో 70వ వంతుల ఆంధ్ర రాష్ట్రంలో ఉంది.

**జమీందారీ భూములు**

వీరంతా పూర్వపు రాజులు, జమీందార్లు. 1802 నాటికి వీరి ఆధీనంలో 152 లక్షల ఎకరాల భూమి ఉంది. సాగు చేసే విస్తీర్ణంలో ఈ భూమి దాదాపు 38 శాతం ఉంది. ఈ భూములకు సంబంధించి ఎస్టేట్ భూముల చట్టం 1908 చేసినా దాని వలన జమీందార్లు, రాజాలకు ఉన్న హక్కులు పెరిగి భూమిపై మరింత అధికారం చెలాయించారు. సామాన్య రైతులు, ఎస్టేట్ భూములలో సాగు చేసేవారికి ఏ మాత్రం ఉపయోగం లేకుండా పోయింది. బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ 1804లో చేసిన శాశ్వత ఫైసలా విధానం ద్వారా జమీందారుల

---

పెట్టుబడిదారుడు దోచడమే నిజం కాబట్టి, ఆ వాదాన్నే సరైనదిగా భావించి దాన్నే నిలబెట్టాలి. 'శ్రమ శక్తి ఇచ్చే ఉపయోగపు విలువ, పెట్టుబడిదారుడిదే' అనే వాదానికి దారితీసే శ్రమ శక్తిని అమ్మడం-కొనడం అనే భావాల్ని మాత్రం వదిలివెయ్యాలి. అప్పుడే సమస్య తీరుతుంది.

పెట్టుబడిదారుడికీ, శ్రామికులకూ ఏర్పడే సంబంధాన్ని అమ్మే-కొనే సంబంధంగా చెప్పడంలో ఒక వైరుధ్యం కనపడుతోంది కాబట్టి, అయితే ఆ సంబంధాన్ని ఎలా చెప్పాలి? – అది, అమ్మే-కొనే సంబంధం కాదని చెప్పాలి.

అది ఎలాంటి సంబంధం అంటే: శ్రామికుడు, ఉత్పత్తి సాధనాలు లేక, ఉన్నా అవి చాలక, స్వతంత్ర ఉత్పత్తిదారుడిగా బతకలేనివాడు. పెట్టుబడిదారుడు, వెనక తరాల నించీ దోపిడీల ద్వారా ఉత్పత్తి సాధనాల్నీ, డబ్బునీ, పోగేసి, స్వంత శ్రమ చెయ్యడం మానుకున్న సోమరి. ఆ రకంగా, ఒక యజమానిని వెతుక్కోక తప్పని నిస్సహాయ శ్రామికుడికీ, అలాంటి శ్రామికుల శ్రమల మీద ఆధారపడక తప్పని సోమరికీ, ఏర్పడే సంబంధం అది. శ్రామికుణ్ణి 'అమ్మేవాడ'నీ, పెట్టుబడిదారుణ్ణి 'కొనేవాడ'నీ అంటే, అది 'సమానుల సంబంధం' అవుతుంది. కానీ, ఈ ఇద్దరి సంబంధం, అలాంటిది కాదు. శ్రామికుడు, భూస్వామి దగ్గిరికి గానీ, పెట్టుబడిదారుడి దగ్గిరికి గానీ చేరడానికి కారణం, భూములతో సహా ఉత్పత్తి సాధనాలన్నీ, వాళ్లు తర తరాల దోపిడీల ద్వారా ఆక్రమించి ఉండడమే.

శ్రామికుడికీ పెట్టుబడిదారుడికీ మధ్య నిజంగా జరిగే విషయాలు అమ్మడాలూ – కొనడాలూ కావు. వాళ్ల మధ్య జరిగేది, శ్రామికుడు పెట్టుబడిదారుడి దగ్గిరికి పోయి పని అడుగుతాడు. పెట్టుబడిదారుడు స్వంత శ్రమ లేకుండా బతకాలనుకుంటాడు కాబట్టి, తనకు ఎందరు శ్రామికులు కావాలో అందరికి మాత్రమే పనులు ఇస్తాడు. ఆ శ్రామికులు రోజూ పని చెయ్యాలంటే బతికి ఉండాలి కాబట్టి, ఆ బతకడానికి తన లెక్కల ప్రకారం 'జీతం' పేరుతో, ఎంతో కొంత డబ్బు ఇస్తాడు. (ఆ జీతం, పెట్టుబడిదారుడి డబ్బుతో ఇచ్చేది కాదు. ఏ శ్రమా చెయ్యని పెట్టుబడిదారుడికి స్వంత శ్రమతో వచ్చే డబ్బు ఒక్క పైసా అయినా ఉండదు. ఆ జీతం డబ్బు, శ్రామికుడి శ్రమలో నించి తీసి ఇచ్చేదే. కానీ జీతంగా ఇచ్చేది పెట్టుబడిదారుడి డబ్బే అయినట్టు, పైకి కనపడుతుంది. చివరికి పెట్టుబడిదారుడికి అందేది, అదనపు విలువ. ఇలాగే, ప్రపంచంలో చాలా విషయాల్లో, అసలు జరిగే నిజాలు వేరూ, పైకి కనపడేవి వేరూగా ఉంటాయి.) పెట్టుబడిదారుడికీ, శ్రామికుడికీ మధ్య అసలు జరిగేది ఇదే కాబట్టి, ఇదే చెప్పాలి. ఎలాగంటే: 'శ్రామికుడు పని చెయ్యడం, పెట్టుబడిదారుడు జీతం ఇవ్వడం – ఈ రెండు విషయాలూ జరుగుతూ ఉంటాయి కాబట్టి, ఇవి అమ్మడమూ – కొనడమూ అయినట్టు పైకి కనపడతాయి. కానీ, అవి అసలు అమ్మడం – కొనడం కాదు. కొనడానికి పెట్టుబడిదారుడి దగ్గర డబ్బేం ఉంది? అతను జీతంగా ఇచ్చేది శ్రామికుడి డబ్బే. ఇక పెట్టుబడిదారుడు కొనేదేమిటి? ఇది అమ్మే-కొనే సంబంధం కాదు' – ఇలా చెప్తే, 'శ్రమ శక్తి ఇచ్చే ఉపయోగపు విలువ నాదే' అని పెట్టుబడిదారుడు వాదించడానికి వీలు ఉండదు. శ్రమ శక్తి గురించి 'సరుకు' అనే మాట రాకూడదు. యజమానీ శ్రామికుల గురించి 'అమ్మడాలూ – కొనడాలూ' రాకూడదు. పెట్టుబడిదారుడి ద్వారా నిజంగా జరిగేది శ్రమ దోపిడీ కాబట్టి, ఆ నిజానికి అడ్డం పడే అభిప్రాయాల్ని 'పొరపాట్లు'గా గ్రహించి, వాటిని సవరించుకోవాలి.

*(ఇంకా ఉంది)*

*(రచయిత బహు గ్రంథకర్త, మార్క్స్ 'పెట్టుబడి' పరిచయకర్త)* వీ

దగ్గర నుండి పేష్‌కాష్ తీసుకొని భూమి శిస్తు వారికి మినహాయింపు నివ్వాలని నిర్ణయం తీసుకుంది. దాని వలన రైతులకు భారం తగ్గకపోగా పేష్‌కాష్ వాటా, భూమి శిస్తు, నజరు, ఇతర జమా ఖర్చులు, వారి ఆడంబరాల ఖర్చు మొత్తాన్ని భరించాల్సి వచ్చింది. పైగా జమీందార్లు, రాజాలు 1802 రైత్వారీ విధానం ద్వారా చాలా మందికి పట్టాలు ఇవ్వడానికి నిరాకరించారు. కేవలం ఒప్పందాలు, నోటి మాటగానే ఎక్కువగా కౌలు జరిగాయి (వీటిని ముచ్చిలకాలు అంటారు). జమీందారుల అధిక వసూళ్ల వలన రైతులు కౌలుకు తీసుకొని సాగు చేయడం తగ్గిపోయింది. దాంతో చాలామంది జమీందారులు శిస్తు బాకీ పడ్డారు. దీనిని అరికట్టడానికి బ్రిటిష్ వారు రెవెన్యూ రికవరీ చట్టం 1864ను చేశారు. ఈ చట్టం ద్వారా ప్రభుత్వానికి పన్ను చెల్లించకపోతే సాగు చేస్తున్న భూమిని స్వాధీనం చేసుకోవచ్చు, లేదా బాకీదారు ఇతర ఆస్తిని స్వాధీనం చేసుకొని అమ్ముకోవచ్చు, బాకీ దారుని అరెస్ట్ చేసి తమ అదుపులో ఉంచుకొనే అధికారం కూడా ఉంది. ముఖ్యంగా సమయానికి పన్ను చెల్లించకపోయి నట్లయితే 6 శాతం వడ్డీ కూడా విధిస్తారు.

ఈ చట్టానికి తోడు 1865లో రెంట్ రికవరీ చట్టాన్ని చేశారు. ఈ చట్టం జమీందారులు రైతులు సాగుచేసే భూముల మీద వసూలు చేసేది కౌలు అనీ, కౌలు అనేది భూమి శిస్తుకు భిన్నమైనదనీ నిర్వచించింది. పైగా ప్రతి సంవత్సరం పట్టాలను రైతులు ధృవీకరించుకోవాలని శాసించింది. వీటికి సంబంధించి న్యాయస్థానాలు కూడా జమీందారులకు అనుకూలంగా తీర్పులిచ్చాయి. దీంతో అనువంశికంగా వచ్చిన హక్కులను కూడా ఒప్పుకోకుండా భూముల నుంచి రైతులను వెళ్లగొడతామని బెదిరించి కౌలు ఇంకా ఎక్కువ మొత్తంలో పెంచారు. పైగా ఇంతకు ముందు భూమి శిస్తు వస్తు రూపంలో ఉండేది. కాని ఇప్పుడు రొఖ్ఖం రూపంలో చెల్లించాల్సి రావడంతో కరువు కాటకాలకు పంట పండనప్పుడు కూడా రైతులు శిస్తు చెల్లించాల్సి వచ్చింది. జమీందారుల, రాజాల దౌర్జన్యాలకు భయపడి తమ ఇళ్లు, పశువులు, ఇండ్లలోని వస్తువులు సమస్తం కౌలుకు గానూ, భూమి శిస్తుకు గానూ జప్తు చేస్తుంటే రైతులు నిస్సహాయ స్థితిలో ఉండిపోయారు. ఈ బాధలు భరించలేక రైతులు చేసిన తిరుగుబాట్లే 1832లో జరిగిన గోండుల తిరుగుబాటు, 1858లో గోదావరి ఏజెన్సీ, 1864లో గంజాం ఏజెన్సీ, 1822లో రంప పితూరీ, 1846లోని కోయిలకుంట్ల, 1894 కృష్ణా జిల్లా రైతుల నీటి తీరువా పెంపుదలపై నిరసనలు. ఈ రెండు చట్టాల వలన రైతులు శిస్తు చెల్లించడం కోసం వడ్డీ వ్యాపారుల మీద ఆధారపడడం, బ్రిటిష్ న్యాయ చట్టాలు వడ్డీ వ్యాపారస్తులను రక్షించడం వలన దానితో రైతులు బలవంతంగా భూముల నుంచి తొలగించ బడ్డారని 1884లో ఇంటర్నేషనల్ రివ్యూ పత్రికలో పి.జె. థామస్ రాశారు. గతంలో రైతులకు రుణభారం లేదని, బ్రిటిష్ పాలన ప్రారంభమైన తరువాత గ్రామీణ జీవితంలో, వ్యవసాయ రంగంలో పెను మార్పుల వలన ఇలా జరిగిందని, బ్రిటిష్ పాలన ఆఖరి యాభై సంవత్సరాలలో లక్షలాది మంది రైతులు భూములు కోల్పోయారని, 1911 సెంట్రల్ బ్యాంకింగ్ రిపోర్టులో వివరించారు. 1927–37 మధ్య పది సంవత్సరాల కాలంలో యాభై లక్షల ఎకరాలు రైతుల నుండి వడ్డీ వ్యాపారుల చేతుల్లోకి మారిందని ల్యాండ్ రెవెన్యూ అడ్మినిస్ట్రేషన్ రిపోర్టులో పేర్కొన్నారు. మన రాష్ట్రం మొత్తం జనాభాలో 1951లో వ్యవసాయ కూలీల జనాభా 79,53,000 ఉండడానికి కారణం భూమి శిస్తు, ఇతర భూస్వామ్య వ్యవస్థలను పెంచిన బ్రిటిష్ పాలకుల విధానాలే. 1911లో రైతు వ్యవసాయ కూలీల నిష్పత్తి 1000:247 ఉంటే 1931 నాటికి 1000:519గా పెరిగింది. 44.5 శాతం కుటుంబాలు రుణగ్రస్తులుగా ఉన్నాయి.

1885లో జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించిన తరువాత కొంత కాలానికి మహాత్మాగాంధీ పిలుపునిచ్చిన సత్యాగ్రహం, సహాయ నిరాకరణోద్యమానికి ఆకర్షితులై రైతులంతా భూమి శిస్తును చెల్లించడం నిలిపివేశారు. చాలా మంది జమీందారీలలోని చిన్న రైతులు వ్యవసాయం గిట్టుబాటు కాక కూలీలుగా మారారు. కానీ, వ్యవసాయ కూలీ చాలా తక్కువగా ఉండడం వలన 1928–29లో వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణయించే శాసనాలు చేయాలని రాయల్ కమిషన్ ఆఫ్ లేబర్‌కు ఎన్.జి. రంగా కాంగ్రెస్ పార్టీ నుండి వినతి పత్రం ఇచ్చారు. ప్రజా అవసరాలకనుగుణంగా జమీందారీ విధానంలో లోపాలు, భూమి శిస్తు తగ్గింపు, ఇతర అణచివేతలకు పరిష్కారం చూపిస్తామని తన కాంగ్రెస్ పార్టీ ఎన్నికల ప్రణాళికలో పెట్టి ప్రచారం చేసుకొని మద్రాస్ ప్రెసిడెన్సీలో 1936లో అధికారంలోకొచ్చింది. 1937 సెప్టెంబర్ 10న మద్రాస్ ఎస్టేట్ భూమి చట్టం 1908కు సవరణలు తెచ్చే నిమిత్తం అప్పటి రెవెన్యూ మంత్రి టంగుటూరి ప్రకాశం పంతులు అధ్యక్షతన విచారణ కమిటీని నియమించింది. ఈ కమిటీ పరిధిలో విచారించాల్సిన అంశాలు:

1) చట్టరీత్యా రైతులకు, జమీందారులకు గల సంబంధాలు. 2) శిస్తు రేటు, వసూలు, రాయితీలు. 3) శిస్తు కాకుండా రైతుల వద్ద నుండి వసూలు చేసే అదనపు పన్నులు. 4) సర్వే, నీటి హక్కులు, కచ్చితమైన, న్యాయమైన శిస్తు నిర్ధారణ. 5) గ్రామాల్లో సహజంగా దొరికే వస్తువులను రైతులు తమ కుటుంబాలకు, వ్యవసాయ పనులకు ఉపయోగించుకోవడం. 6) నీటి వసతులను భద్రపరచడం.

ఈ కమిటీ 1938 నవంబర్ 6న తన రిపోర్టును ప్రభుత్వానికి సమర్పించింది. తన రిపోర్ట్‌లో 1802లో రైతులు చెల్లించే భూమి శిస్తు ప్రస్తుతానికి కూడా వర్తింపచేయాలని, జమీందారులు రైతులు సాగు చేసుకొనే పొలాలను వేలం వేయడం కాని, జప్తు కాని చేయరాదని జమీందారులకు ఆ హక్కులుండకూడదని, పోరంబోకులు, అడవులు, కొండలు, అటవీ సంపదలపై రైతులకే పూర్తి హక్కులుండాలని నివేదించింది.

ప్రకాశం జమీందారీ కమిటీ రిపోర్టును బిల్లు రూపంలో సెనెట్ హౌస్‌లో పెట్టినప్పుడు బిల్లుపై చర్చ, ఓటింగ్ జరగకుండానే 1939 అక్టోబర్ 29న రాజగోపాలాచారి నేతృత్వంలోని మద్రాస్ ప్రభుత్వం రాజీనామా చేసింది. ఈ కమిటీ వేసిన నేపథ్యమైన జమీందారీ ప్రాంతాల్లో రైతాంగ పోరాటాలు 1930 నుంచి 1937 వరకు నెల్లూరులోని కనిగిరి, పశ్చిమ గోదావరి జిల్లాలోని కాళీపట్నం, కలమపల్లి, పెండ్యాల, గోపాలపురం, బొబ్బిలి రాజా కింద పర్లకామిడి, పలాస, మందసం, టెక్కలి, కృష్ణా జిల్లాలోని జమిలైన మునగాల, తిరువూరు, ముక్త్యాల, చల్లపల్లి జమిలతో జరిగి నాయి. ప్రజలు 'జమీన్' రైతు పత్రిక ద్వారా ఉత్తేజం పొంది బ్రిటిష్ మద్రాసు ప్రభుత్వానికి, జమీందారులకు

వ్యతిరేకంగా పోరాటాలు, సహాయ నిరాకరణోద్యమాలు చేశారు. 1937 నుంచి 1947 మధ్య జరిగిన భూ పోరాటాలలో చాలా చోట్ల దాదాపు వంద మంది రైతులు చనిపోయారు.

1946లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ రైతులకు, ప్రభుత్వానికి మధ్య దళారులు ఉండకూడదనే (జమీందారులు, రాజాలు) ఎన్నికల ప్రణాళికతో ఎన్నికల్లో గెలిచి మద్రాస్ ప్రెసిడెన్సీలో ప్రభుత్వం ఏర్పాటు చేసింది. 1947 ఆగస్ట్ 15న వలస పాలన అంతమైన తరువాత జమీందారీ ప్రాంతాల్లో శిస్తు తగ్గించే బిల్లును అక్టోబర్ 1947లో, ఎస్టేట్‌ల రద్దు బిల్లును 1947 నవంబర్ 28న మద్రాసు శాసనసభలో రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఈ బిల్లుకు ప్రాతిపదికగా ప్రకాశం కమిటీ రిపోర్ట్‌ను తీసుకొని సెలక్షన్ కమిటీకి పంపారు. సెలక్షన్ కమిటీ సిఫారసులను చర్చించిన తరువాత శాసనసభ 1949 ఏప్రిల్ 19న జమీందారుల రద్దు చట్టంను ఆమోదించి, రాష్ట్రపతి ఆమోదముద్ర తరువాత 1949 సెప్టెంబర్ 7 నుంచి ఈ చట్టం అమలులోకొచ్చింది.

మద్రాస్ ఎస్టేట్ (రద్దు రైత్వారీకి మార్పు) చట్టాన్ని 1949 ఏప్రిల్ 19న శాసనసభ ఆమోదించింది. రాష్ట్రపతి ఆమోద ముద్ర తరువాత ఈ చట్టం 1949 సెప్టెంబర్ 7 నుంచి అమలులోకి వచ్చింది. ఈ రెండు చట్టాలలోని ముఖ్యాంశాలు ఈ విధంగా ఉన్నాయి.

1. 1936 సవరణ చట్టం ప్రకారం ఎస్టేట్లుగా మారిన ఇనాం ఎస్టేట్లు మినహా మిగతా జమీందారీ, ఇనాం ఎస్టేట్లు రద్దు అవుతాయి.

2. ఎస్టేట్లలోని సాముదాయిక భూములు, నీటి వనరులు, గనులు క్వారీలు, బంజరు భూములు, పచ్చిక బయళ్లు, లంక భూములు, అడవులు ప్రభుత్వం స్వాధీనంలోకి వస్తాయి.

3. ప్రభుత్వం రైతులకు, జమీందారుల స్వంత ఆధీనంలోని భూములకు గాను జమీందారులకు సర్వ హక్కులతో పట్టాలను ఇస్తుంది.

4. ఎస్టేట్లలోని రికార్డులు, పరిపాలనా సంబంధమైన భవనాలు ప్రభుత్వం స్వాధీనం అవుతాయి.

| జిల్లా | జమీందారీ పేరు | జమీందారు చెల్లించాల్సిన పేష్‌కాష్ | జమీందారు వసూలు చేసిన శిస్తు | చెల్లించాల్సిన శిస్తు కన్న వసూలు చేసిన శిస్తు ఎన్ని రెట్లు ఎక్కువ |
|---|---|---|---|---|
| నెల్లూరు | వెంకటగిరి | 3,23,792 | 12,83,291 | 4 |
| | కాళహస్తి | 34,219 | 12,7894 | 4 |
| కృష్ణ | మునగాల | 4,510 | 17,229 | 4 |
| | ఊటుకూరు | 2,810 | 28,831 | 10 |
| | గంపలగూడెం | 2,599 | 43,180 | 17 |
| | ఉయ్యూరు | 23,612 | 1,73,708 | 7 |
| | కపిలేశ్వరపురం | 9,809 | 84,548 | 9 |
| | తేలప్రోలు | 13,754 | 1,08,989 | 8 |
| | గన్నవరం | 5,105 | 37,259 | 7 |
| | ముసునూరు | 4,759 | 39,118 | 8 |
| | ఎలమర్రు | 8,354 | 57,018 | 6 |
| | దేవరకోట | 79,485 | 2,91,763 | 4 |
| పశ్చిమ గోదావరి | భద్రాచలం | 32,354 | 1,11,739 | 4 |
| | మీర్జాపురం | 22,306 | 70,570 | 3 |
| | ఎలమర్రు | 21,588 | 76,416 | 4 |
| తూర్పు గోదావరి | పిఠాపురం | 2,58,979 | 8,92,182 | 4 |
| | వీరవరం | 26,756 | 1,21,068 | 4 |
| | చింతనలంక | 3,534 | 40,009 | 11 |
| | గంగోలు | 1,239 | 31,132 | 25 |
| | జగ్గంపేట | 26,539 | 1,25,943 | 5 |
| | కేశనకుర్రు | 11,311 | 34,640 | 3 |
| విశాఖపట్నం | విజయనగరం | 4,67,085 | 1,91,9355 | 4 |
| | బొబ్బిలి | 90,000 | 1,35,000 | 7 |
| | సాలూరు | 27,291 | 1,56,411 | 6 |
| | మాడుగుల | 17,257 | 1,21,490 | 7 |
| | కురుపాం | 14,462 | 1,25,625 | 9 |
| | షేర్ మహమ్మద్‌పురం | 19,350 | 74,170 | 4 |
| | చెముడు | 4,652 | 25,509 | 5 |
| | పార్వతీపురం | 2,926 | 14,904 | 5 |
| | పేదమేరంగి | 4,434 | 23,287 | 5 |

5. ఎస్టేట్లలోని భూములకు సర్వే, సెటిల్‌మెంట్‌లు జరిపి రైతువారీగా శిస్తు విధించాలి.

6. రద్దయిన ఎస్టేట్లకు జమీందారులకు వాయిదా పద్ధతిలో వారి పూర్వపు వార్షిక ఆదాయాన్ని బట్టి 12 1/2 రెట్ల నుంచి 25 రెట్ల వరకూ ఒక్కొక్కరికి రు. 25,000 నుండి రు. పదిహేను లక్షలు మించకుండా నష్టపరిహారం తీసుకునే హక్కు కల్పించారు.

పైన పేర్కొన్న చట్టంలోని నిబంధనల అమలునకు ప్రాతిపదికగా ఈ కమిటీ 1939 జూలై 1 నాటికి జమిందారీ లెక్కల్లో స్వంత భూములుగా నమోదైన వాటికి జమీందారులకే పట్టాలివ్వాలని, ఇతర జమీందారీ భూములు, వారి ఆధీనంలోని బంజర్లకు 1945 జూలై 1 నాటికి జమీందార్లిచ్చిన పట్టాలు చెల్లుబాటు అవుతాయని, కోల్పోయిన భూములకు గాను జమీందారులకు నష్టపరిహారం చెల్లించారని నిర్ణయించారు. 1949 సెప్టెంబర్‌లో విజయనగరం, వెంకటగిరి, శివగంగ, రామనీడు, పిఠాపురం, బొబ్బిలి జమీందారులను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఈ చట్టం ద్వారా 7423 ఇనాం గ్రామాలలో 4157 జమీందారీ గ్రామాలకు ఈ చట్టాన్ని వర్తింపచేసి అందులో 3300 ఇనాం ఎస్టేట్లను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
saralareddy007@gmail.com

వీ

# అవినీతికి నిలయం - విశాఖ కారాగారం

*విశాఖ కేంద్ర కారాగారంలో ఖైదీల పట్ల జైలు అధికారులు చూపుతున్న వివక్ష, వారి పట్ల వ్యవహరిస్తున్న అనుచిత వైఖరి, జైలులో జరుగుతున్న అవినీతి, లంచగొండితనం గురించి వివరిస్తున్నారు* **తుంపాల శ్రీరామమూర్తి**

విశాఖ కేంద్ర కారాగారంలో శిక్ష పడిన, విచారణ ఖైదీలు ఎల్లప్పుడు తొమ్మిది వందలకు పైచిలుకు ఉంటారు. శిక్షలు పడిన ఖైదీలు సుమారు నాలుగు వందల మంది ఉన్నారు. ఇందులో జీవిత ఖైదీలు ముప్పై మంది, ఉరిశిక్ష విధించబడిన ఖైదీలు ఇద్దరు ఉన్నారు. మిగిలిన వారు రిమాండ్ ఖైదీలు. శిక్షపడిన మహిళా ఖైదీలు వాస్తవానికి రాజమండ్రి సెంట్రల్ జైల్లో ఉండాలి కాని ఖైదీల అభ్యర్థన మేరకు పది మంది శిక్ష పడిన మహిళా ఖైదీలు ఇక్కడే ఉన్నారు. రిమాండ్ మహిళా ఖైదీలు నలభై మంది ఉన్నారు. వీరందరూ స్వర్ణముఖి బ్లాకులో నాలుగు గదులలో ఉన్నారు. జైల్లో ఉన్న ఆసుపత్రిలో మహిళా డాక్టర్లు లేరు. ఇద్దరు పురుష డాక్టర్లు, ఒక డిసిఎస్, ఇద్దరు స్టాఫ్ నర్సులు, కంపౌండరు, ఎంఎన్ఓ ఒకరు, ఎఫ్ఎన్ఓ ఒకరు, ఫార్మాసిస్ట్ ఒకరు, లాబ్ టెక్నిషియన్ ఒకరు ఉన్నారు. జైల్లో ఉన్న ఖైదీలకు సరిపడా సిబ్బంది లేరు. రాత్రి సమయంలో డాక్టర్లు ఉండరు. కంపౌండర్, ఫార్మాసిస్ట్ ఉంటారు. ఎఫ్ఎన్ఓలకు నైట్ డ్యూటీలు ఉండవు. గర్భిణీ స్త్రీలకు రాత్రిపూట వైద్య సదుపాయాలు అందవు. ఒక మహిళా ఖైదీకి తన ఉన్న గదిలోనే ప్రసవం జరిగింది.

పురుష ఖైదీలకు ఇక్కడ ఫస్ట్ ఎయిడ్, తాత్కాలిక వైద్యం మాత్రమే అందజేస్తారు. బయట ఉన్న కెజిఎచ్‌కి పంపాలంటే డాక్టర్లు కెజిఎచ్‌కు రిఫర్ చేస్తూ మెడికల్ జనరల్ డైరీలో రాయాలి. దానిపై జైలర్, డిఎస్, సూపరింటెండెంట్ సంతకం ఉండాలి. అది పోలీస్ కంట్రోల్ రూంకి వెళ్లాలి. అక్కడ నుండి ఎస్కార్టు కేటాయించబడి జైలుకు వస్తే అప్పుడు రోగిని కెజిఎచ్‌కి పంపుతారు. ఇంత పెద్ద ప్రాసెస్ ఉంది. ఇక్కడ అవినీతి చోటు చేసుకుంటోంది. అలాగే శిక్షపడిన ఖైదీలకు ప్రతి ఏడాది నెలరోజులు ఇంటికి వెళ్లడానికి పెరోలు మంజూరు చేస్తారు. కాని దీని కొరకు అక్కడ పోలీసు అనుమతులు, స్యూరిటీలు, ఇక్కడ జైలు అధికారుల అనుమతులు ఉండాలి. దీని కొరకు ఖైదీలు వేలాది రూపాయలు లంచాలు చెల్లిస్తున్నారు. స్వర్ణముఖి బ్లాకులో 2007 నుండి ఆదివాసి మహిళా కామ్రేడ్ తాంబేలు కమల విచారణ ఖైదీగా ఉన్నారు. ఆమెపై నలభై కేసులు నమోదై ఉన్నాయి. ఆమెను చూడడానికి చింతపల్లి మండలం నుండి వస్తున్న తల్లిదండ్రులను, బంధువులను పోలీసులు బెదిరించి రానియ్యకుండా చేశారు. ఇప్పటి వరకు పోలీసులకు జడిసి ఆమె కోసం ఎవరూ రాలేకపోతున్నారు. ఇక్కడ మహిళా నక్సలైట్లకు ప్రత్యేక రూం లేదు. పురుషులకు మాత్రమే ప్రత్యేక బ్యారకు ఉంది. మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ నాయకులు బి.పి. సింగ్, అమిత్ భక్షి, విజయకుమార్ ఆర్య, అకిలేష్ యాదవ్ ఈ జైల్లోనే ఉన్నారు. ఏజెన్సీకి చెందిన మావోయిస్టుల పేరుతో సుమారు ముప్పై మంది నక్సలైట్ ఖైదీలు ఉన్నారు. ప్రస్తుతం వీళ్లందరూ చిత్రావతి బ్లాకులో ఉన్నారు. ఇక్కడ సింగిల్ లాకప్‌లు ఉన్నాయి. గంగా, నర్మదా, గోస్తనీ బ్లాకులలో రిమాండ్ ఖైదీలు ఉంటారు. మెయిన్ జైలు కృష్ణవేణి, గోదావరి, పెన్నా, తపతి, అన్నపూర్ణ (ఖైదీల కిచెన్), కావేరీ బ్లాకులు ఉన్నాయి. ఇక్కడ అందరూ శిక్షపడిన ఖైదీలు ఉంటారు. ఇక్కడ కావేరీలో మరణశిక్ష విధించబడిన ఇరువురు ఖైదీలు ఉన్నారు.

**ప్రాణహిత బ్లాక్ –** ఇది హాస్పిటల్ ఉండే బ్లాకు. ఇది ఎస్‌టిలకు, రిమాండ్ వాళ్లకు ఉంచుతారు. నక్సలైటు పేరుతో అరెస్ట్ చేయబడిన ఆదివాసులను ఇక్కడే ఉంచుతారు.

**స్నేహ సరోవర్ (ఎస్ఎస్) –** ఇది అడ్మినిస్ట్రేటివ్ బ్లాక్. కొత్తగా వచ్చిన ఖైదీలను సెక్షన్‌లను బట్టి ఇతర బ్లాకులకు ఇక్కడ నుంచే పంపిస్తారు. కొంతమంది డబ్బుగల ఖైదీలను ఇదే బ్లాకులో ఉంచి వారికి సపర్యలు చేయడానికి ఆదివాసి, పేద ఖైదీలను కేటాయిస్తారు. ఈ డబ్బుగల ఖైదీలను ఇతర బ్లాకులకు పంపకుండా వాళ్ల దగ్గర వేలాది రూపాయలు లంచాలు తీసుకొని అన్ని సదుపాయాలు అందజేస్తారు. ఈ బ్లాకుకు ఎదురుగా ఉన్న శబరి స్టాఫ్ మెస్ నుంచి వీరికి భోజనాలు, టీలు వగైరా సప్లై చేస్తారు. గతంలో శ్రీకాకుళం జిల్లా లక్షింపేట దళితుల మారణకాండకు పాల్పడిన వాసుదేవరావును ఇక్కడే ఉంచి అన్ని సదుపాయాలు అందజేశారు. 2011 సెప్టెంబర్‌లో పది వేల రూపాయల లంచం తీసుకున్న కేసులో అరెస్ట్ అయి రిమాండ్‌కు వచ్చిన విజయనగరం జిల్లా సబ్ రిజిస్ట్రార్ కళ్యాణి దగ్గర నుంచి ఇరవై ఐదు వేల రూపాయలు లంచం తీసుకుని అన్ని సదుపాయాలు అందజేశారు. ఈ మధ్యనే విశాఖలో ఐదు వందల కోట్ల రూపాయలు ప్రజల నుంచి వసూలు చేసి మోసం చేసిన సిమ్స్ డైరెక్టర్ సురేంద్ర గుప్తా నెలరోజులుగా ఈ బ్లాకులో ఉండి అన్ని సదుపాయాలు అందుకుంటున్నారు. ఈ బ్లాకు నుండే ఇతర బ్లాకులకు పంపేటప్పుడు ఖైదీల దగ్గర నుంచి లంచాలు వసూలు చేస్తారు. విఐపిలకు ప్రత్యేక ములాఖతులు కావాలంటే దండిగా లంచాలు తీసుకొని జైలరు, డిప్యూటీ జైలరు గదులలో కుర్చీలు వేసి మరీ ఆహ్వానిస్తారు. విఐపిలకు వచ్చే సామాన్లు ఏవీ చెక్ చేయకుండా లోపలికి పంపుతారు. వీరికీ కిరాయి రౌడీలకూ, గుండాలకూ కూడా గంజాయి, బీరు, బిర్యాని ప్యాకెట్లు, ఎండు మాంసం, చేపలు భారీగా వస్తుంటాయి. ఈ బ్లాకులో అన్ని రకాలుగా అవినీతి, లంచగొండితనం యథేచ్ఛగా సాగుతూంటుంది. వ్యతిరేకించిన వాళ్లని చితకబాదుతారు.

జైలు గేటులో అడుగు పెట్టిన వెంటనే అడ్మిషన్ పురుషులైతే చొక్కా తీసి డిప్యూటీ జైలరు దగ్గర ప్రవేశపెడతారు. అతగాడు ఖైదీని వాడిపై మోపబడిన అభియోగాన్ని బట్టి లాఠీ రుచి చూపించి లోపలికి పంపుతారు. అడ్మిషన్ అయిన వెంటనే గేటు దగ్గరే ఖైదీలను (పురుషులను) వివస్త్రులను చేసి దిశమొలతో వారితో రెండు మూడుసార్లు గుంజీలు తీయిస్తారు. నరకం అంటే ఏమిటో చూపిస్తారు. ప్రతిదానికి

# నరోద్నిజం నుండి మార్క్సిజం

*రష్యా ప్రజా ఉద్యమాల చరిత్రలో పందొమ్మిదో శతాబ్దం చివర నరోద్నిజం నిర్వహించిన పాత్రను వివరిస్తున్నారు*

**కె. నరేంద్రమోహన్**

**జా**ర్ రెండవ అలెగ్జాండర్ హత్యతో (పాత కాలెండర్ ప్రకారం 1 మార్చ్ 1881, ఈ రచనలోని తేదీలన్ని పాత జూలియన్ కాలెండర్ ప్రకారం) నరోద్నిజం రష్యా రాజకీయ వేదిక మీదకు వచ్చింది. రష్యాలోని అప్పటి అన్ని ప్రధాన సాంఘిక ఆందోళలన లాగే నరోద్నిజానికి మూలం 1861లోని రైతాంగ సంస్కరణలలో ఉంది. అర్ధబానిసల విముక్తి పేరుతో భూస్వాములు తమ ఎస్టేట్‌లను రక్షించుకొని, రైతుల సాంప్రదాయిక కమతాలలో కూడా కొంత స్వాధీనం చేసుకుని రైతులకు రుణ భారం మిగిల్చారు. పైనుండి వచ్చే (రెవెల్యూషన్ ఫ్రమ్ అబోవ్) చాల 'విప్లవాల' లాగే ఇదీ అరకొరగా అమలు జరిగింది. 'బలవంతుల మీద ఆధారపడే' (ధనిక రైతులను వ్యవస్థకు అనుకూలంగా మలచుకునే) ఉద్దేశం ఈ సంస్కరణల వెనుక అసలు రహస్యం. సంస్కరణలు ప్రవేశ పెట్టిన సంవత్సరంలోపే ప్రభుత్వం తిరోగమనానికి తెర లేపింది. విద్యాలయాల మీద, మేధావుల మీద ఆంక్షలు విధించింది. రష్యా పాలనకు వ్యతిరేకంగా పోలాండ్ ప్రజల తిరుగుబాటు (1863) తరువాత అణచివేత మరింత పెరిగింది. జార్ ప్రభుత్వం వందలాది పోలిష్ తిరుగుబాటుదార్లను ఉరితీసి, దాదాపు 20 వేల మందిని సైబీరియాకు, రష్యాలోని జైళ్లకు పంపింది. చివరికి పాఠశాలలో చరిత్ర, విజ్ఞాన శాస్త్రాల మీద ఆంక్షలు విధించి, చర్చ్ అధికారాన్ని విస్తృత పరచి, మత మౌఢ్యాన్ని, ఛాందస వాదాన్ని పెంచి పోషించింది.

వ్యక్తి వికాసానికి, సామాజిక పురోగతికి అవరోధంగా మారిన ఈ స్థితికి వ్యతిరేకంగా ముందు మేధావులు కదిలారు. గాలి వీచినప్పుడు ముందుగా చిగురు కొమ్మలు ఊగినట్లు భూస్వామ్య, ప్రభుత్వ, చర్చి అధికారుల నేపథ్యాల నుండి మేధావులు, విద్యార్థులు కార్యరంగంలోకి దిగారు. రష్యన్ సర్వ విధ్వంసక (నిహిలిస్ట్), అరాచక భావాల సిద్ధాంతకర్తలైన బకునిన్, క్రోపోట్కిన్లు, మార్క్సిస్ట్ ఉద్యమ ఆద్యుడు అయిన ప్లేఖనోఫ్ ఈ భూస్వామ్య నేపథ్యం నుండి వచ్చినవారే. ఇటువంటి యువతీ, యువకులు తమ ఐశ్వర్యాన్ని, అధికారాన్ని, భూస్వామ్య హోదాలను వదులుకొని రష్యాను విప్లవమార్గంలో నడిపించే ప్రయత్నం చేశారు. నరోద్నిక్ (ప్రజల మనుషులు) అని పిలవబడే వీరిలో ఒక స్పష్టమైన సిద్ధాంతం, నిర్మాణం, వ్యూహాల వంటివి లేవు. (ఉదా. చూడండి తుర్గనేఫ్ నవల – తండ్రులు కొడుకులు, దాస్తోవిస్కి నవల – ది బ్రదర్స్ కరమజోవ్‌లోని ఇవాన్ పాత్ర.) సమాజంలో మేధావులకు ఒక స్వతంత్ర వర్గ పాత్ర (కార్మికుల వైపో, పెట్టుబడిదారుల వైపో నిలబడాలి) లేనప్పటికీ, సమాజంలోని అశాంతికి వారు అద్దం పట్టారు. భూస్వామ్యం

---

జైలు మాన్యువల్ అని చెపుతుంటారు. ఎవ్వరికీ జైలు మాన్యువల్ అందుబాటులో ఉంచరు. ఇన్‌ఛార్చ్ సూపరింటెండెంట్‌గా ఈశ్వరయ్య వచ్చిన దగ్గర నుంచి జైల్లో ఖైదీలు తల్లిదండ్రులని, సిబ్బంది తన అన్నదమ్ములని ఉపన్యాసాలు ఇచ్చారు. కాని అనారోగ్య కారణాలతో వరుసగా ఖైదీలు ఎనిమిది మంది మరణించారు. వైద్య సదుపాయాలు మెరుగు పరచకుండా జైలుకు అరిష్టం వచ్చింది అని గొర్రెని గేటుకి బలి ఇచ్చి ఆ గొర్రె నెత్తురును గేట్లకు చల్లించారు. ఈయనకు ఉన్న శాస్త్రీయ దృక్పథం అటువంటిది. రేషన్ జనరల్ కోట నుండి సగానికి సగం తగ్గించారు. ఆఖరికి పప్పు, టీ పొట్లాలలో కూడ కోత విధించారు. డిప్యూటీ సూపరింటెండెంట్ సమ్మయ్య అతనికి అందినంత అతను దోచుకుంటున్నాడు. వీరిద్దరూ 2013, మే 8న బదిలీ అయ్యారు. ఈశ్వరయ్య విజయవాడ జిల్లా జైలుకి బదిలీ కాగా, సమ్మయ్యను వరంగల్ సబ్ జైలు అధికారిగా నియమించారు. అదిలాబాద్ జిల్లా జైలు సూపరింటెండెంట్‌గా ఉన్న రాజేశ్వరరావును ఇన్‌చార్జ్ సూపరింటెండెంట్‌గా విశాఖకు బదిలీ చేశారు. అలాగే శిక్షణలో ఉన్న గ్రూప్1 అధికారి సన్యాసరావును విశాఖ కారాగారం డిప్యూటీ సూపరింటెండెంట్‌గా నియమించారు.

అనారోగ్యమైన ఖైదీలకు మెడికల్ డైట్ ఇవ్వడంలోను వివక్షత పాటించబడుతోంది. సకాలంలో వైద్య సదుపాయాలు అందించరు. అందుకే మరణాలు సంభవిస్తున్నాయి. చిన్న నేరాలకు పాల్పడి రిమాండ్‌కు వచ్చిన ఖైదీలు ఆరు నెలలు, సంవత్సరం శిక్ష పడే ఖైదీలు బెయిల్ తెచ్చుకోలేనందున సంవత్సరాల తరబడి జైల్లో ఉండి పోతున్నారు. జైల్ అదాలత్ నిర్వహించి వారి విడుదలకు చర్యలు తీసుకోవలసి ఉన్నది. వాటి విషయంలో కాలయాపన చేస్తున్నారు. ఆదివాసి ఖైదీలను చూడడానికి ఎజెన్సీ నుంచి వచ్చిన వారి కుటుంబ సభ్యులను గేటు బయట మఫ్టీలో ఉన్న పోలీసులు బెదిరించి వాళ్లను జిల్లా ఎస్‌పి దగ్గరకు తీసుకెళ్తుంటారు. ఆదివాసులపై పోలీసు జులుం కొనసాగుతూనే ఉంది. వారు జైలుకు బంధువులను చూడడానికి, రావడానికి భయపడుతున్నారు. ఖైదీల మధ్య అధికారులు గొడవలు సృష్టించడం వలన వారిలో వారు కొట్లాడుకున్న గొడవలు ఉన్నాయి. జైల్లో జరుగుతున్న అన్యాయాలను బయట పెట్టడానికి ఖైదీలు భయపడుతున్నారు. శిక్షా కాలంలో రెమిషన్ లభించదు అని మరలా అక్రమ కేసులు బనాయిస్తారు అని ఖైదీలు భయపడుతూ ఇక్కడ బతుకులీడుస్తున్నారు. అధికారుల అరాచకత్వం, లంచగొండితనానికి ఈ జైలు నిదర్శనం.

*(రచయిత విశాఖ జిల్లా అధ్యక్షుడు,*
*ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం)* వీ

బలహీన పడుతున్నంత త్వరగా పెట్టుబడి ఎదగకపోవడంతో, బలహీనమైన, వెనుకబడిన రష్యన్ బూర్జువా వర్గం వారికీ నాయకత్వం వహించలేక పోయింది. కార్మిక వర్గం అప్పటికి రాజకీయంగా సంఘటిత పడక, సంఖ్యాపరంగా ఎదగకపోవడంతో, 'ప్రజల' కొరకు వెతుకుతున్న నరోద్నిక్ యువతకు సమాజాన్ని మార్చే శక్తి రైతులలో కనిపించింది. వారు కార్మికులను కూడా పట్టణ ప్రాంత రైతులుగా పరిగణించారు.

పత్రికల మీద, భావ ప్రకటన మీద ఆంక్షలు, సెన్సార్ విధానం వాళ్ల యూరోప్ నుండి ఆధునిక సాహిత్యం అందుబాటులో లేని - ఎవరికి అర్థం కాదు లెమ్మని మార్క్స్ పెట్టుబడి రచనను మాత్రం అనుమతించారు- వారికి బకునిన్ 'రాజీలేని విధ్వంసం', 'ప్రత్యక్ష కార్యాచరణ' వారికి మార్గదర్శకంగా తోచాయి. బకునిన్ వాదన ప్రకారం 'ప్రజలు' స్వభావరీత్యా విప్లవకారులు, సామ్యవాదులు. మధ్య యుగాల నాటి రైతు తిరుగుబాట్లు, పుగాచేవ్ నాయకత్వంలో జరిగిన పోరాటం, చివరికి బందిపోటు దొంగతనాలు కూడా ఇందుకు ఉదాహరణగా బకునిన్ వాదన చూపింది. సమాజ వ్యాప్తంగా తిరుగుబాటు జరగాలంటే విద్యార్థులు చేయవలసిన పనల్లా గ్రామాలకు తరలి, విప్లవాన్ని మొదలు పెట్టడం. స్థానిక తిరుగుబాట్లు త్వరలోనే సమగ్ర విప్లవానికి దారితీసి మొత్తం వ్యవస్థను కూల్చివేస్తాయి అని బకునిన్ బోధించాడు.

బకునిన్, క్రోపోట్కిన్ వంటి వారి ప్రభావం, విప్లవ ప్రజాస్వామికవాది అలెగ్జాండర్ హెరేజెన్ 'ప్రజల వద్దకు వెళ్లండి' పిలుపుతో 1874లో వందలాది యువతీ, యువకులు గ్రామాలకు తరలినారు. త్వరలోనే వారి ఊహాజనిత (యుటోపియన్) ప్రణాళిక వాస్తవమనే బండ రాళ్ల మీద పడి ముక్కలైంది.

రైతులు వారి విప్లవ ప్రచారాన్ని ఆలకించకపోగా, కొన్నిచోట్ల వారే ప్రభుత్వానికి పట్టించారు. ప్రజలు వారి చరిత్రను వారే నిర్మించు కుంటారు, కాని అది తమ ఇష్టాలతో నిమిత్తం లేకుండా తమకు సంక్రమించిన ఆర్థిక, సామాజిక పరిధిలోనే జరుపుకుంటారు. ఈ వాస్తవాన్ని గుర్తించకుండా నరోద్నిక్‌లు రష్యాకు ఒక ప్రత్యేక మార్గాన్ని రూపొందించారు. మీర్ రూపంలో ఉన్న గ్రామీణ సమిష్టి ఆస్తుల ఆధారంగా రష్యా నేరుగా సామ్యవాద సమాజాన్ని చేరుకుంటుందని భావించారు. జారిస్ట్ రాజ్యానికి గ్రామీణ పునాదిగా ఉన్న మీర్, సామ్యవాద వ్యవస్థకు ఆధారం కాగలదని బకునిన్ ప్రచారం ఇందుకు దోహదం చేసింది.

సమాజంలో కార్మిక వర్గం మినహా ఇతర అన్నివర్గాల లక్షణం చిన్నా లేక పెద్ద ఆస్తి యజమానులకుండే వ్యక్తివాదం. రష్యాలోని భూమిలేని రైతులు కూడా, రూపంలో శ్రామికులు (ప్రోలెటేరియన్) అయిన్నప్పటికి, చైతన్యంలో పట్టణ కార్మికులకు దూరంగా ఉండేవారు. వారి కోరికల్లా కొద్దిపాటి భూమి సంపాదించుకోవడం - అంటే చిన్న యజమానిగా మారడం. వ్యక్తిగత టెర్రరిజం, గెరిల్లా పోరాటం, రైతుల, పేద విద్యార్థుల, మేధావుల, పట్టణ నేరస్త శ్రేణుల (లుంపెన్ శ్రేణుల) పోరాట పద్ధతులు. అయితే, నరోద్నిక్‌లు కార్మికులను కర్మాగారాల్లో రైతులుగా పరిగణించి, రష్యన్ విప్లవంలో జరిగిన దానికి విరుద్ధంగా, విప్లవంలో, కార్మికులను రైతులకు సహకరించే పాత్రలో మాత్రమే చూసింది. కొన్ని పరిస్థితుల్లో పేద రైతులు సమిష్టి వ్యవసాయాన్ని అంగీకరించవచ్చు, కానీ దానికి ముందుగా పట్టణ కార్మికుల ఉద్యమం, నాయకత్వం అవసరం. కార్మిక వర్గం, ముఖ్యంగా భారీ పారిశ్రామిక కార్మికులు ఉత్పత్తిలో తమ స్థానం వల్ల సామ్యవాద చైతన్యాన్ని సహజంగా అందుకుంటారు. రష్యాలో కార్మికవర్గం రైతులను సామ్యవాద పిలుపుతో కాక, దున్నేవారికే భూమి అనే పెట్టి బూర్జువా ప్రజాస్వామిక నినాదంతో కదిలించింది.

జార్ హత్యతో ప్రభుత్వం నరోద్నిక్ ఉద్యమాన్ని క్రూరంగా అణచి వేసింది. దేశం మొత్తాన్ని ప్రాంతాల వారిగా విభజించి గవర్నర్లను నియమించి నిర్దాక్షిణ్యంగా ఉరిశిక్షలు అమలు జరిపింది. ప్రకటనలు అంటించిన నేరానికి 19 ఏళ్ల యువకుడిని సైతం ఉరి తీసింది. వేలాది మందిని జైళ్లలో నింపి, కేసుల్లో విడుదలైన వారిని సైబీరియా పంపి ఒక తరం యువతలో ప్రతిభావంతులను, ప్రగతి కోరుకునేవారిని బలి తీసుకుంది.

నరోద్నిక్ శ్రేణుల్లో మిగిలినవారు 1876లో తిరిగి సమీకరించుకొని జేమల్య వోల్యా (భూమి స్వేచ్ఛ) అనే సంస్థగా ఏర్పడ్డారు. రహస్య సాధారణ సభ (జనరల్ కౌన్సిల్), కార్యనిర్వాహక కమిటీల నాయకత్వం లో పనిచేసే రైతు, కార్మిక, యువజన (విద్యార్థి) విభాగాలను, ఒక సాయుధ విభాగాన్ని (ప్రభుత్వ అధికారుల నుండి రక్షణ కొరకు) నిర్మించుకున్నారు.

జేమల్య వోల్యా రాజకీయ కార్యక్రమం - భూమి రైతులకు స్వాధీనం, రష్యన్ సామ్రాజ్యంలోని అన్ని ప్రాంతాలకు స్వయం నిర్ణయ హక్కు, అతి త్వరలో రాచరిక వ్యవస్థ కూల్చివేత. తొందరపాటుకు కారణం, పెట్టుబడి ప్రభావం వల్ల మీర్ నిర్మాణం అంతరించకుండా నిలిపేందుకు జేమల్య వోల్యా కార్మికులను సమీకరించి వారిని గ్రామాలకు పంపినప్పటికీ, అలా పంపిన కార్మికులు గ్రామాలలో ఇమడలేక తిరిగి పట్టణాలకు చేరి అక్కడి కార్మికులతో సంబంధాలు ఏర్పర్చుకునేవారు. రైతులలో సామ్యవాద ప్రచారం వల్ల ప్రయోజనం లేదని వారికి బలమైన నమ్మకం ఏర్పడింది.

1876 డిసెంబర్‌లో కజాన్ చర్చి ముందు చట్ట వ్యతిరేకంగా ఒక బహిరంగ సభ జరిగింది. సామ్యవాద విప్లవం వర్ధిల్లాలి, రైతులకు భూమి, అందరికి స్వేచ్ఛా నినాదాలతో ఆ ప్రాంతం మారుమోగింది. బెలిన్స్కి, దుబ్రోలుబోవ్, చేర్నేశేవ్స్కి వంటి రష్యన్ ప్రజాస్వామిక రచయితల వల్ల ప్రభావితుడైన యువకుడు జార్జ్ ప్లెఖనోవ్ అందులో ప్రసంగించి, ప్రభుత్వ కక్షకు గురై యూరోప్‌కు వలస వెళ్లాడు. 1877లో రహస్యంగా రష్యా తిరిగి వచ్చి, దిగువ వోల్గాలోని సర్తోవ్ ప్రాంతంలో జేమల్య కార్మిక విభాగ బాధ్యత స్వీకరించాడు. కార్మికుల్లో పనిచేస్తున్నపటికీ జేమల్య సంస్థకు ఆ రంగంలో కార్యక్రమం గురించి స్పష్టత లేకపోయింది. అయినప్పటికీ వారు ఒక రహస్య కార్మిక సంఘాన్ని, రాబోచ్య జార్య (కార్మిక ఉదయం) అనే రహస్య పత్రికను నడిపారు. పత్రిక ప్రారంభించిన కొద్ది రోజులకే ప్రభుత్వం పత్రిక మీద దాడి చేసి కార్యకర్తలను జైళ్లకు పంపింది. ఈ దాడితో జేమల్య సంస్థ తిరిగి టెర్రరిజం వైపు మళ్లింది. ఒక దశాబ్దం పాటు ఎంతో మంది ప్రాణాలు పోగొట్టుకున్న తరువాతగాని టెర్రరిస్ట్ చర్యలు ఆగలేదు.

టెర్రరిస్ట్ చర్యలు తిరిగి మొదలు కావడంతో జేమల్య సంస్థలో 'విద్యావేత్తలు', 'తిరుగుబాటుదార్ల' మధ్య వివాదం చెలరేగింది. లావ్రోవ్ నాయకత్వంలో ఒక సెక్షన్ చిన్న చిన్న ఉదారవాద చర్యలు, ప్రచారం ద్వారా మార్పును కోరితే, బకునిన్ నాయకత్వంలోని కార్యకర్తలు, రహస్య

చర్యల వైపు మొగ్గారు. ఈ సెక్షన్ ఒక రహస్య సంస్థను నిర్మించి, 'చర్యల ద్వారా ప్రచారం' కొనసాగించింది. జేమల్య వోల్యాలో భిన్న ధోరణుల మధ్య ఘర్షణ ముదిరి, 1879 జూన్‌లో జరిగిన మహాసభ తరువాత సంస్థ చీలిపోయింది. టెర్రరిస్ట్ శ్రేణి నరోద్న వోల్యాగా (ప్రజాభిమతం), ప్లెఖనోవ్ నాయకత్వంలో చెర్నెయ్ పెర్దేల్ (నల్ల పునర్విభజన) సంస్థలుగా ఏర్పడ్డాయి.

1880లో తిరిగి రష్యా నుండి రహస్యంగా యూరోప్ వెళ్లిన ప్లెఖనోవ్, నరోద్నిక్ సంక్షోభానికి పరిష్కారం మార్క్స్, ఎంగెల్స్ రచనల్లో వెదికాడు. ఫ్రెంచ్, జర్మన్ కార్యకర్తలతో పరిచయం, వారితో చర్చలు, మార్క్స్, ఎంగెల్స్ తత్వశాస్త్రం, వర్గ పోరాటం, చారిత్రక భౌతికవాద రచనల అధ్యయనంతో నరోద్నిక్ అరాచక, నిహిలిస్ట్ భావాలూ మార్క్సిస్ట్ విమర్శ ముందు వీగిపోయాయి. అదే సమయంలో యూరోపియన్ కార్మిక ఉద్యమంలో మార్క్స్ సిద్ధాంతాలు బలపడడం ప్లెఖనోవ్ వర్గానికి ఉపయోగపడింది.

నరోద్నిక్ సిద్ధాంతాలకు, మార్క్సిజానికి ప్రాపంచిక దృక్పథంలోనే మౌలికంగా విభేదించాయి. ఉదాహరణకు సామాజిక పరివర్తన గురించి లావ్రోవ్ భావనకు మార్క్సిస్ట్ భౌతికవాదానికి ఉన్న విభేదం చూడవచ్చు. పురోగమనానికి మూలం ఒక భావంలో ఉంది. అది ఒక వ్యక్తి మెదడులో జన్మించి, అక్కడే అభివృద్ధి చెందుతుంది. తదుపరి ఆ భావం ఇతరుల మెదళ్లలో ప్రవేశించి – వారి నైతిక, మేధోపరమైన ఎదుగుదల ద్వారా – గుణాత్మకంగా ఎదిగి, అటువంటి వ్యక్తుల సంఖ్య పెరగుదల ద్వారా పరిణామపరంగా ఎదుగుతుంది. అటువంటి వ్యక్తులు తమ మధ్యనున్న ఏకాభిప్రాయాన్ని గుర్తించి ఐక్య కార్యక్రమానికి దిగితే ఆ భావం ఒక సామాజిక శక్తిగా మారుతుంది. (మాక్స్ ఈస్ట్‌మాన్ రచన ది యంగ్ ట్రాట్స్కి నుండి).

ఇలా నరోద్నిక్‌ల దృష్టిలో విప్లవానికి మూలం, దానిని కొనసాగించే సామాజిక శక్తీ 'నైతిక విలువలు' ఉన్న 'విమర్శనాత్మక ఆలోచనాపరులు' (క్రిటికల్ థింకర్స్), అంటే ఆచరణలో నరోద్నిక్ మేధావి శ్రేణులు.

విప్లవాచరణ గురించి వారి ఆత్మాశ్రయ (రొమాంటిక్) భావాలూ మరో ఎత్తు. '... విప్లవకారుడుకి స్వంత ప్రయోజనాలు, పనులు, భావోద్వేగాలు, అనుబంధాలు, ఆస్తులు, కనీసం సొంత పేరు కూడా లేవు. అతని ఉనికి మొత్తం ఒకే లక్ష్యంతో దహించుకుపోతుంది. అతను మనసా వాచా వ్యవస్థతో, నాగరిక ప్రపంచంతో, చట్టాలు, మంచి, మర్యాద, నైతిక విలువలతో అన్ని బంధాలు తెంచుకున్నారు. అతడు దయాదాక్షిణ్యాలు లేని వ్యక్తి. కేవలం ప్రపంచాన్ని నాశనం చేసేందుకే జీవించి ఉన్నాడు. (సెర్గెఇ నెచయెవ్, బకునిన్– బకునిన్ సహరచన గురించి కొంత సందేహం ఉంది – రచన కేటాకిజం అఫ్ ఎ రెవల్యూషనరీ. మార్క్సిస్ట్ డాట్ ఆర్గ్ వెబ్‌సైట్ నుండి) అలా, ఆచరణలో నరోద్నిజం, చేతిలో ఆయుధం తలలో ఉదారవాదంగా మిగిలింది. ఉదారవాదులు, పార్లమెంటరీ వ్యవస్థలో తమవంటి నిపుణులకు బాధ్యత అప్పగించి ప్రజలు ప్రేక్షకులుగా మిగలాలని భావిస్తే, నరోద్నిక్‌లు తమకు ఆయుధం అందించి ప్రజలు అదే స్థానంలో ఉండాలని భావించారు.

మార్క్స్, హెగెల్ గతితర్కాన్ని భౌతికవాద కాళ్ల మీద నిలబెడితే, నరోద్నిక్‌లు మార్క్స్ భౌతికవాదాన్ని తలకిందులు చేశారు. మార్క్స్ మాటల్లోనే చెప్పాలంటే '...మనుషుల చైతన్యం వారి అస్తిత్వాన్ని నిర్ణయించదు. అందుకు విరుద్ధంగా, వారి సామాజిక అస్తిత్వమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. ఒకానొక దశలో సమాజంలోని ఉత్పత్తి శక్తులు తాము అంతవరకు లోబడి ఉన్న ఆస్తి సంబంధాలతో ఘర్షణకు దిగుతాయి. అంతవరకు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి రూపాలుగా ఉన్న సంబంధాలు, ఆ శక్తులకు సంకెళ్లుగా మారుతాయి. అప్పుడు సమాజంలో విప్లవ దశ మొదలవుతుంది. ఆర్థిక పునాది మార్పుతో విస్తారమైన ఉపరితలం మొత్తం వేగంగా మార్పు చెందుతుంది. ఇటువంటి మార్పులను అధ్యయనం చేస్తున్నపుడు ఆర్థిక ఉత్పత్తిలో జరిగిన మార్పులకు, చట్టపరమైన, రాజకీయ, మతపరమైన, తాత్విక రంగాల్లో మార్పులకు – ఈ సంఘర్షణను ప్రతిబింబించే భావజాల రూపాలు – నడుమ తేడాను గుర్తించాలి.

నరోద్న వోల్యా రహస్య పత్రిక ప్లెఖనోవ్ రాసిన 'సామ్యవాదం రాజకీయ పోరాటం' వ్యాసాన్ని తన పత్రికలో వేసుకోకపోగా, ప్లెఖనోవ్ వర్గాన్ని ఒక సమీకరణగా (టెన్డెన్సీ) తమలో చేరడానికి కూడా అంగీకరించలేదు (టెన్డెన్సీ, ఫ్యాక్షన్ నిర్మాణం భారత కమ్యూనిస్ట్ పార్టీలలో లేదు. పార్టీ, ఒక పెద్ద శిల వంటిది (మొనోలిత్) అనే సూత్రమే ఉంది).

నిధులు, గుర్తింపు, సభ్యులు, మేధావుల ఆదరణ, ధనిక ఉదారవాదుల విరాళాలు నరోద్న వోల్యా వైపు ఉండగా, 1883లో ప్లెఖనోవ్ నాయకత్వంలో మరి నలుగురు – అక్సెల్రొద్, వెరా జసులిచ్, లెవ్ డొఇచ్, ఇగ్నతోవ్ – సభ్యులతో ప్రవాసంలో రష్యన్ శ్రామిక విముక్తి సంస్థ (గ్రూప్ ఫోర్ ది ఎమానిసిపేషన్ అఫ్ రష్యన్ లేబర్) జెనీవా ప్రాంతంలో ఏర్పడింది. సంస్థ ఏర్పడిన కొద్ది రోజుల్లోనే ఇగ్నతొవ్ క్షయ వ్యాధితో మరణించగా, డొఇచ్ జర్మనీలో అరెస్టై రష్యాలో సుదీర్ఘ ఖైదుకు గురైయ్యారు.

దాదాపు ఒక దశాబ్దం, ఆర్థిక ఇబ్బందులు, నరోద్న వోల్యా సభ్యుల నిందలు, దుష్ప్రచారం, అనారోగ్యం, పోలీస్ ఏజెంట్ల కుట్రలు అనుభవిస్తూ, రష్యన్ ఉద్యమానికి దూరంగా సోషల్ డెమొక్రాట్ అనే రహస్య పత్రికను ప్రచురించి, ప్రభుత్వానికి అందకుండా సానుభూతి పరులు, విద్యార్థుల ద్వారా రష్యన్ యువతకు, కార్యకర్తలకు అందజేశారు. 'సామ్యవాదం రాజకీయ పోరాటం', 'మన విభేదాలు', 'చరిత్ర పట్ల అద్వైత (మొనిస్ట్) దృక్కోణం (డెవలప్‌మెంట్ అఫ్ ది మొనిస్ట్ వ్యూ అఫ్ హిస్టరీ)' వంటి రచనల ప్రభావంతో రష్యాలో కార్మికవర్గ సిద్ధాంతం వ్యాప్తి చెందడంతో, ఒక బలమైన కార్మికవర్గ పార్టీకి అవసరమైన సైద్ధాంతిక పునాదిని ప్లెఖనోవ్ రచనలు వేశాయి.

1885లో విడుదల చేసిన తమ రష్యన్ సోషల్ డెమొక్రసీ కార్యక్రమ సూచికలో (ప్రాస్పెక్టస్ అఫ్ ఎ ప్రోగ్రాం ఫర్ రష్యన్ సోషల్ డెమొక్రసీ) ప్లెఖనోవ్ కార్మికవర్గ విప్లవానికి ముసాయిదా ప్రతిపాదించాడు. టూకీగా చెప్పాలంటే కార్మికులు, పేద రైతుల సహకారంతో, రాజ్యాధికారం సాధించి ఒక తాత్కాలిక కార్మిక వర్గ ప్రభుత్వాన్ని ఏర్పర్చాలి. (మాక్స్ ఈస్ట్‌మన్ రచన ది యంగ్ ట్రాట్స్కి, రెసిస్టన్స్ బుక్స్, ఆస్ట్రేలియా). రష్యాలో మార్క్సిస్ట్ భావాలు బలపడగా, నరోద్న వోల్యా మితవాద – దశలో పడిపోయి చివరికి బూర్జువా ఉదారవాదులతో కలసిపోయింది. దీనికి పరాకాష్టగా వారి నాయకుడు టిఖమిరోవ్, 1888లో 'నేనెందుకు విప్లవకారుణ్ణి కాదు' అనే రచన చేసి రాచరికం పక్షాన చేరాడు. ఆవగింజ అంత విత్తనం మర్రి చెట్టుగా ఎదిగినట్లు, నలుగురు సభ్యుల శ్రామిక విమోచన సంస్థ మూడు దశాబ్దాల్లో తొలి కార్మిక రాజ్యానికి బాట వేసింది.

*(రచయిత సామాజిక కార్యకర్త, ఆస్ట్రేలియా)* వీ

### భారతదేశ జనాభా

భారతదేశ జనాభా 2011 లెక్కల ప్రకారం 121,07,26,932 మంది ఉన్నట్లు తేలింది. 2001 నుండి 2011 వరకు పెరుగుదల శాతం 17.7 ఉన్నట్లు కేంద్ర హోం శాఖ మంత్రి సుషీల్ కుమార్ షిండే ఏప్రిల్ 30న తెలిపారు. గత పదేళ్ల కాలంలో పురుషుల జనాభా 17.1 శాతం పెరగగా, స్త్రీల జనాభా 18.3 శాతం పెరిగింది. 1991-2001 లెక్కల ప్రకారం పురుషుల, స్త్రీల నిష్పత్తి 1000:933 ఉండగా 2001-2011లో అది 1000:943 గా నమోదయింది.

### పశ్చిమ బెంగాల్‌లో చిట్‌ఫండ్ కంపెనీ కుంభకోణం

పశ్చిమ బెంగాల్‌లో శారధా గ్రూప్ చిట్ ఫండ్ కంపెనీ కుంభకోణం వెలుగుచూసింది. లక్షలాది మంది పేద, మధ్యతరగతి వర్గాల వారు ఈ చిట్‌ఫండ్ కంపెనీలో తమ కష్టార్జితాన్ని దాచుకున్నారు. అధిక వడ్డీల ఆశ చూపి కంపెనీ ఇరవై వేల కోట్ల రూపాయల వరకు వసూలు చేసింది. గత కొద్ది కాలంగా చెల్లింపులు నిలిపివేయడంతో ఫిర్యాదులు ప్రారంభ మయ్యాయి. దీంతో సంస్థ తన కార్యకలాపాలను రద్దు చేసుకొంది. ఈ ఉదంతం వెలుగు చూడడంతో పొదుపు చేసుకున్న డబ్బు తిరిగి రాదన్న నిరాశకు గురై చాలామంది ఆత్మహత్యలకు పాల్పడ్డారు. శారదా గ్రూప్ ప్రమోటర్ సుదీప్తో సేన్ జమ్మూ కశ్మీర్‌లో తలదాచుకోగా పట్టుకొని అరెస్టు చేశారు. ముఖ్యమంత్రి మమతా బెనర్జీ శారదా గ్రూప్ కుంభకోణంపై న్యాయవిచారణకు ఆదేశించింది.

### ఢిల్లీలో తెలంగాణ సంసద్ యాత్ర

తెలంగాణ జెఏసి ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద ఏప్రిల్ 29, 30తేదీలలో రెండు రోజుల సత్యాగ్రహ దీక్ష నిర్వహించింది. కాంగ్రెస్ తెలంగాణ ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండాలనీ, లేనిపక్షంలో దీర్ఘకాలికంగా నష్టపోవలసి వస్తుందనీ టిజెఏసి చైర్మన్ ప్రొ. కోదండరామ్ అన్నారు. దీక్షకు బిజేపి నేత సుష్మా స్వరాజ్ ఇతర జాతీయ నేతలు వచ్చి సంఘీభావాన్ని తెలిపారు.

### సిక్కులపై హత్యాకాండ కేసులో యావజ్జీవం

సిక్కువ్యతిరేక అల్లర్ల కేసులో ముగ్గురికి యావజ్జీవశిక్ష పడింది. 1984 నాటి అల్లర్లలో బల్వాన్ ఖొక్కర్, గిరిధరిలాల్, కెప్టెన్ బాగ్‌మల్‌లకు యావజ్జీవ జైలు శిక్ష విధిస్తూ జిల్లా సెషన్స్ జడ్జి జెఆర్ ఆర్యన్ మే 9న తీర్పు వెల్లడించారు. ఇదే కేసులో లూటీలకు పాల్పడిన మాజీ కౌన్సిలర్ మహేందర్ యాదవ్, మాజీ ఎంఎల్ఎ కిషన్ ఖొక్కర్‌కు మూడేళ్ల జైలు శిక్ష విధించారు.

### పాకిస్తాన్ ఖైదీ సనావుల్లా మృతి

జమ్మూలోని కోట్ బల్వాల్ జైల్లో తోటిఖైదీ దాడిలో తీవ్రంగా గాయపడిన పాకిస్తాన్ ఖైదీ సనావుల్లా రణ్‌జయ్ (52) మే 9న మరణించారు. గాయాల పాలైన సనావుల్లా రణ్‌జయ్‌ని చండీగఢ్‌లోని స్నాతకోత్తర వైద్యవిద్య, పరిశోధన సంస్థ(పిజిఐఎంఇఆర్) ఆస్పత్రిలో చికిత్స పొందుతూ ఉదయం మృతిచెందాడు.

### రైల్వే, న్యాయశాఖ మంత్రుల రాజీనామ

రైల్వే శాఖలో ఉద్యోగాలు, పదోన్నతులకు లంచాలు వసూలు చేసినట్లు వచ్చిన ఆరోపణలకు రైల్వే శాఖ మంత్రి పవన్‌కుమార్ బన్సల్ మే 10 న తన రాజీనామాను ప్రధానికి అందజేశారు. బొగ్గు కుంభకోణంపై సిబిఐ నివేదికను మార్చారన్న కారణంతో న్యాయశాఖ మంత్రి అశ్వనీ కుమార్ కూడా రాజీనామా చేశారు.

### వందేమాతరం పాడలేను

మే 10న పార్లమెంట్‌లో వందేమాతరం పాడుతుండగా బిఎస్‌పి ఎంపి షఫీకర్ రెహమాన్ బర్క్ బయటికి వెళ్లిపోయారు. దీనిపై స్పీకర్ మీరాకుమార్ అగ్రహం వ్యక్తచేసింది. తన మత విశ్వాసాలను బట్టి వందేమాతర గేయాన్ని పాడలేనని, సాధారణంగా వందేమాతరం పాడాల్సివచ్చినప్పుడు నేను సభలో ఉండనని రెహమాన్ బర్క్ తెలిపారు.

### కర్ణాటకలో కాంగ్రెస్ గెలుపు

కర్ణాటక రాష్ట్ర అసెంబ్లీ మొత్తం 224 స్థానాలకు గాను 223 కి మే 5న జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్-121, బిజెపి-40, జెడిఎస్-40, కెజెపి-6, ఇతరులు-16 స్థానాల్లో గెలుపొందారు. ప్రభుత్వ ఏర్పాటుకు అవసరమయిన స్థానాలు నెగ్గిన కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసింది. కర్ణాటక రాష్ట్ర 28వ ముఖ్యమంత్రిగా సిద్దరామయ్య చేత మే 13న గవర్నర్ హంసరాజ్ భరద్వాజ్ 'సత్యం' పేరిట వినూత్నంగా పదవి ప్రమాణం చేయించారు.

### పోస్కో వ్యతిరేక ఉద్యమ నేత అరెస్టు

ఒడిషాలోని జగత్‌సింగ్ జిల్లాలో పోస్కో ప్రాజెక్ట్ నిర్మించడాన్ని వ్యతిరేకిస్తున్న పోస్కో ప్రతిరోధ్ సంగ్రాం సమితి అధ్యక్షుడు అభయ సాహును పోలీసులు మే 11న అరెస్టు చేశారు. అరెస్టు తర్వాత ఆయనను కోర్టులో హజరు పరిచారు. సాహు బెయిల్ పిటిషన్ పెట్టుకోగా బెయిల్ పిటిషన్‌ను న్యాయస్థానం తిరస్కరించగా కారాగారానికి తరలించారు. సాహుపై అయిదు కేసులు ఉన్నట్లు జగతిసింగ్‌పూర్ ఎస్.పి. సత్యబ్రతభోయి తెలిపారు.

### ఎన్‌కౌంటర్‌లో ఆదివాసుల మృతి

చత్తీస్‌గడ్‌లోని ఎలకమేట అటవి ప్రాంతంలో మావోయిస్టుల కోసం కూబింగ్ వెళ్లిన కోబ్రాదళాలకు మావోయిస్టులకు మధ్య మే 18న కాల్పులు జరిగాయని చత్తీస్‌గడ్ అదనపు డైరెక్టర్ జనరల్ ఆర్‌కె. విజ్ తెలిపారు. కాల్పుల్లో 8 మంది ఆదివాసిలు, ఒక మావోయిస్టు, ఒక కోబ్రా జవాను మరణించారన్నారు. ఎలకమేట గ్రామస్తుడు విలేకరులతో మాట్లాడుతూ అన్ని వైపుల నుంచి పోలీసుల కాల్పులు వినిపించగానే ఆదివాసిలు అడవిలోకి పారిపోయారని చెప్పారు. ఘటనా స్థలంలో ఏడుగురి మృత దేహాలు ఉన్నాయన్నారు. పోలీసులు విచక్షనారహితంగా జరిపిన కాల్పుల్లోనే ఆదివాసిలు చనిపోయారని స్థానికులు పెద్ద సంఖ్యలో గంగలూరు పోలీస్ స్టేషన్ ఎదుట ధర్నా చేశారు.

### కొత్త కాగ్ శశికాంత్ శర్మ

భారత కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) వినోద్ రాయ్ పదవీ విరమణ చేస్తున్నందున ఆ స్థానంలో రక్షణ శాఖ కార్యదర్శి శశికాంత్ శర్మను 12వ భారత కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్‌గా నియమించారు. ఈ మేరకు ఆర్థిక మంత్రిత్వ శాఖ మే 21న తెలిపింది. 1976 బీహార్ కేడర్‌కు చెందిన ఐ.ఏ.ఎస్ శశికాంత్ శర్మ గతంలో ఫైనాన్సియల్ సర్వీసెస్ డిపార్ట్‌మెంట్ కార్యదర్శిగా పనిచేశారు.

### మరణశిక్ష నుంచి జీవితఖైదుకు

ఓ హత్య కేసులో మరణశిక్ష పడ్డ ఖైదీకి క్షమాభిక్ష లభించింది. మహేంద్రనాథ్ దాస్ అనే వ్యక్తి హత్య కేసులో దోషిగా తేలడంతో ఆయనకు మరణశిక్ష పడింది. మాజీ రాష్ట్రపతి ప్రతిభాపాటిల్ ఆయన క్షమాభిక్ష అభ్యర్థనను తిరస్కరించారు. తన క్షమాభిక్ష దరఖాస్తు రాష్ట్రపతి వద్ద పదకొండు ఏళ్ల పాటు అపరిష్కృతంగా ఉందనీ, క్షమాభిక్షపై నిర్ణయం తీసుకోవడంలో తీవ్ర జాప్యం జరిగినందుకు తనకు శిక్ష తగ్గించాలని దాస్ సుప్రీంకోర్టును ఆశ్రయించాడు. ఈ అభ్యర్థనను సుప్రీంకోర్టు మన్నించి ఆయన మరణశిక్షను జీవితఖైదుగా మార్చింది.

### మాయావతి మరో కుంభకోణం

ఉత్తరప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి మాయావతి అధికారంలో ఉండగా దళిత నేతలకు నిర్మించిన స్మారక చిహ్నాల్లో కుంభకోణం జరిగిందని ఉత్తరప్రదేశ్ లోకాయుక్త నిర్ధారించింది. సుమారు రు. 1400 కోట్ల ప్రజాధనాన్ని 199 మంది మింగేశారని తెలిపింది. ఇందులో మాజీ మంత్రి, బిఎస్‌పి నేత నసీముద్దీన్ సిద్దిఖీ, బాబూసింగ్ కుష్వాహ, సిట్టింగ్ ఎంఎల్ఎలు, పలువురు అధికారులు, ఇంజనీర్లు ఈ కుంభకోణంలో పాత్రధారులుగా ఉన్నారు. వీ

## బంగ్లాదేశ్ - రాణా ప్లాజా ప్రమాదం

బంగ్లాదేశ్ రాజధాని ఢాకాలో ఐదు టెక్స్‌టైల్ ఫ్యాక్టరీలు నడిచే ఎనిమిది అంతస్తుల భవనం ఏప్రిల్ 24న రాణాప్లాజా కుప్పకూలింది. ఈ ఘటనలో సుమారు 1100 మంది మరణించారు. వేలాది మంది క్షతగాత్రులయ్యారు. ఈ సంఘటనకు పాశ్చాత్య చిల్లర వర్తకుల సంస్థలు బాధ్యత వహించాలని ప్రధాని షేక్ హసీనా అన్నారు. ప్రపంచవ్యాప్తంగా వచ్చిన కార్మిక సంస్థల ఒత్తిళ్ల మేరకు అనేక పాశ్చాత్య టెక్స్‌టైల్ వ్యాపార సంస్థలు కార్మికుల వేతనాలు, రక్షణ చర్యలు, పనిస్థలాల్లో సౌకర్యాలు మెరుగు, పెంపుకు సంబంధించి ఒక ఒప్పందానికి ముందుకు రాగా, వాల్‌మార్ట్ సంస్థ నిరాకరించింది.

## మలేషియా ఎన్నికలు

మలేషియాలో మే 5న జరిగిన ఎన్నికలలో అధికార బారిసాక్ నేషనల్ ఫ్రంట్ సంకీర్ణం 133 సీట్లతో 48 శాతం ఓట్లు మాత్రమే సాధించగా, ప్రతిపక్ష సంకీర్ణం 89 సీట్లతో 52 శాతం ఓట్లు సాధించింది. నజీబ్ రజాక్ నేతృత్వంలోని నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం నాలుగు దశాబ్దాల స్వతంత్ర మలేషియా చరిత్రలో మొదటి మైనారిటీ ఓట్ల ప్రధానమంత్రిగా ఎన్నికయ్యారు.

## పాకిస్తాన్ ఎన్నికల ఫలితాలు

పాకిస్తాన్‌లో మే 11న పార్లమెంట్, జాతీయ అసెంబ్లీ స్థానాలకు ఎన్నికలు జరిగాయి. మొత్తం 272 స్థానాలకు జరిగిన ఈ ఎన్నికల్లో పాకిస్తాన్ ముస్లిం లీగ్ (పిఎంఎల్ - ఎన్) - 137, పార్టీ పాకిస్తాన్ తెహ్రిక్-ఎ- ఇన్సాఫ్ (పిటిఐ) - 27, అధికార పార్టీ పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ - 31 స్థానాల్లో గెలుపొందాయి. అత్యధిక స్థానాలు గెలిచిన పిఎంఎల్-ఎన్ అధ్యక్షుడు నవాజ్ షరీఫ్ రెండోసారి ప్రధానమంత్రి అయ్యారు. పిటిఐతో కలిసి ఆయన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

## నేపాల్ - సిఐఎఎ

నేపాల్ కమిషన్ ఆఫ్ ఇన్వెస్టిగేషన్ ఆఫ్ అబ్యూజ్ ఆఫ్ అథారిటీ అనే అవినీతి నిరోధక శాఖకు లోక్‌మాన్‌సింగ్ కార్కిని అధినేతగా అక్కడి నాలుగు పార్టీలు ప్రతిపాదించి ప్రధానమంత్రి ఖిల్‌రాజ్ రెగ్మీ ద్వారా అధ్యక్షుని ఆమోదానికి మే 5న పంపాయి. సిఐఎఎ గతంలో లోక్‌మాన్ సింగ్ కార్కిని బంగారం స్మగ్లింగ్ కుంభకోణంలో నేరస్థుడిగా పేర్కొని ఉంది. మే 21న కాన్‌స్టిట్యూట్ అసెంబ్లీ మెంబర్ హక్ (55) దారుణ హత్యకు గురయ్యారు.

## మోన్‌శాంటోకు వ్యతిరేకంగా నిరసన

మే 15న ప్రపంచ వ్యాప్తంగా మోన్‌శాంటో కంపెనీకి వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు జరిపారు. వందలాది నగరాలలో ఈ ప్రదర్శనలు జరిగాయి. మోన్‌శాంటో హైబ్రిడ్ విత్తనాల ఉత్పత్తి ఆపాలనీ, రైతులను, వ్యవసాయరంగాన్ని, మొత్తంగా పర్యావరణాన్ని కాపాడాలనీ కోరుతూ ఈ ప్రదర్శనలు నిర్వహించారు. ప్రపంచంలోనే అతిపెద్ద విత్తనాల కంపెనీ అయిన మోన్‌శాంటో విత్తనాల వల్ల సాంప్రదాయిక పంటలు దెబ్బ తిని ఆహార భద్రత క్షీణిస్తోంది. అధిక దిగుబడి కోసం ఈ విత్తనాల వాడకం వల్ల పంటలకు అధిక మోతాదులో ఎరువులు, పురుగు మందుల వాడకం కూడా ఎక్కువైంది. దీంతో ఒక్కోసారి దిగుబడి రాక, పంట నాణ్యత లేకపోవడం వల్ల రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. ఈ విత్తనాలలో వాడే రసాయనాల వాడకం వల్ల ప్రజలు కాన్సర్ వ్యాధులకు గురవుతున్నారు.

## అమెరికా - వాషింగ్టన్

బోస్టన్ మారథాన్ మీద జరిగిన బాంబుదాడి కేసు విచారణ జరుపుతున్న సందర్భంలో మే 22న ఎఫ్‌బిఐ ఏజెంట్ ఫ్లోరిడాకు చెందిన వ్యక్తిని కాల్చి చంపాడు. అమెరికా న్యాయవ్యవస్థ ఏప్రిల్ - మే 2012 కాలంలో అసోసియేటెడ్ ప్రెస్ ఎపి టెలిఫోన్ సంభాషణల రికార్డులను రహస్య కోవర్టు చర్య ద్వారా సేకరించిందని మే 13న బయటపడడంతో ఎపి ఆ చీఫ్ ఎగ్జిక్యూటివ్ గ్యారీ ప్రుయిట్ అటార్నీ జనరల్ ఎరిక్ హోల్డర్‌కు రాసిన లేఖలో తీవ్రంగా ఖండించారు. హోల్డర్ తను ఆ చర్యను 'జాతీయ భద్రతా కారణాల' పేరున సమర్థించుకున్నారు.

## విస్తరిస్తున్న సిరియా ఘర్షణలు

సిరియా అంతర్యుద్ధం సంక్లిష్టత రోజురోజుకి విస్తరిస్తోంది. పొరుగు దేశాలు ఇజ్రాయిల్, లెబనాన్, పాలస్తీనాలకూ విస్తరిస్తోంది. మే 15న ఐక్య రాజ్యసమితి సాధారణ సభ (యుఎన్‌జిఎ) సిరియా ప్రభుత్వాన్ని ఖండిస్తూ అధికార మార్పుకు పిలుపునిస్తూ నాన్ బైండింగ్ తీర్మానాన్ని ప్రవేశపెట్టింది. 193 దేశాల ఐక్యరాజ్య సమితిలో ఈ తీర్మానానికి అనుకూలంగా 107 ఓట్లు, వ్యతిరేకంగా 12 ఓట్లు పడ్డాయి. 59 దేశాలు ఓటింగ్‌కు దూరంగా ఉన్నాయి. ఏప్రిల్ 29న సిరియా ప్రధానమంత్రి వయోల్ అల్ హల్క్‌పై జరిగిన బాంబుదాడి నుండి తృటిలో తప్పించుకున్నారు. ఈ దాడిలో ఆయన అంగరక్షకులు ఇద్దరు, డ్రైవర్‌తో సహా ఐదుగురు మరణించారు. మే 11న సిరియా సరిహద్దు రెహాల్లీలో జరిగిన కారు బాంబు దాడులలో నలభై మందికి పైగా మరణించారు. వందలాది మంది గాయపడ్డారు.

## బ్రిటన్ - లండన్

పాకిస్తాన్ ఆదివాసి ప్రాంతాల మీద అమెరికా అల్‌ఖైద, తాలిబన్‌ల లక్ష్యంగా జరిగే మానవ రహిత విమాన దాడులకు సహకారంగా జరిగే సర్వేకు గాను ఆర్థిక సహాయం విరాళాలు అందించినట్లు బ్రిటన్ అంగీకరించడంతో బ్రిటన్ ప్రభుత్వం స్థానిక ప్రజల ఆగ్రహానికి గురి అయింది. ఏప్రిల్ 30న వెస్ట్‌షైర్‌లోని డ్యూస్‌బరీలో ఇస్లాం వ్యతిరేక ర్యాలీ మీద బాంబు దాడులకు ప్రణాళిక రచించామని బర్మింగ్‌హామ్‌కు చెందిన ఆరుగురు వ్యక్తులు అంగీకరించారు.

*ఇటీవల పోస్టల్ శాఖ అన్ని మనీ ఆర్డర్‌లను టెలిగ్రాఫిక్ మనీ ఆర్డర్‌లుగా పంపుతున్నది. మీరు ఎం.ఒ. చేసినప్పుడు కింద కూపన్‌లో రాసిన ఉత్తరం, సమాచారం ఈ టెలిగ్రాఫిక్ ఎం.ఒ.లో మాకు చేరదు. కనుక ఎం.ఒ.లు చేసేవారందరూ విడిగా ఒక పోస్ట్‌కార్డు రాయడం గానీ, ఫోన్ చేసి చెప్పడం గానీ చేయాలి. అలాగే, బ్యాంక్ అకౌంట్‌లోకి నగదు బదిలీ చేసినప్పుడు అది ఎందుకో వివరాలు వీక్షణం కార్యాలయానికి ఫోను ద్వారా గాని, కార్డు ద్వారా గాని తెలపాలి. - సం.*

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుదుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 ఏప్రిల్ నుండి 30 ఏప్రిల్ 2013 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1798)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 13 | 14 | 3 | 2 | – | 1 | 1 | 1 | 1 | – | 2 | 18 | 28 | – | – | – | 2 | 10 |
| హైదరాబాద్ | – | – | – | 9 | 12 | – | – | – | 7 | 4 | 6 | 10 | – | – | 24 | 18 | – | – | – | 5 | – |
| మహబూబ్‌నగర్ | 6 | 10 | – | 18 | 16 | 7 | 10 | – | 8 | 10 | 17 | 17 | 22 | 13 | 49 | 7 | – | – | – | – | – |
| మెదక్ | – | 4 | – | 11 | 17 | – | 4 | 1 | 8 | 3 | 2 | 6 | 4 | 9 | 40 | 27 | – | – | – | – | 9 |
| నిజామాబాద్ | – | – | – | 15 | 14 | 1 | 4 | – | – | – | 5 | 9 | 2 | 4 | 20 | 24 | – | – | – | – | 5 |
| రంగారెడ్డి | 2 | 4 | – | 20 | 20 | 7 | 15 | 11 | 6 | 18 | 8 | 8 | 4 | 5 | 56 | 15 | – | – | – | – | 4 |
| వరంగల్ | 0 | 5 | – | 9 | 8 | 9 | 9 | 11 | 9 | 9 | 9 | 9 | 9 | 8 | 22 | 9 | – | – | – | – | 8 |
| కరీంనగర్ | – | 5 | 6 | 10 | 12 | 3 | 4 | 2 | 3 | 6 | 4 | 6 | 3 | – | 36 | 12 | – | – | – | – | 6 |
| ఖమ్మం | – | 2 | – | 10 | 13 | 2 | 13 | 2 | – | 2 | 3 | 6 | 1 | 1 | 47 | 25 | – | – | – | – | 17 |
| అనంతపూర్ | – | 3 | 1 | 7 | 13 | 2 | – | – | – | 3 | 5 | 4 | 1 | 4 | 27 | 9 | – | – | – | – | 3 |
| నెల్లూరు | | | | | | | | | | | | | | | | | | | | | |
| కర్నూలు | 1 | 3 | 1 | 8 | 5 | 4 | 5 | 7 | 6 | 4 | 3 | 5 | 10 | 6 | 25 | 20 | – | – | – | – | 6 |
| చిత్తూరు | – | 3 | – | 8 | 6 | 8 | 9 | – | – | – | 6 | 9 | 25 | 2 | 44 | – | – | – | – | – | 9 |
| శ్రీకాకుళం | – | – | – | 4 | 2 | 3 | 3 | 1 | 2 | 1 | 1 | 1 | – | 1 | 25 | 11 | – | – | – | – | 3 |
| విశాఖపట్నం | – | – | – | 8 | 2 | – | – | 1 | 2 | 4 | 2 | 3 | 5 | 1 | 23 | 16 | – | – | – | 11 | 1 |
| విజయనగరం | – | – | – | 4 | 2 | 1 | 2 | 2 | 4 | 8 | 1 | 2 | 4 | 2 | 34 | 8 | – | – | – | – | 4 |
| మొత్తం | **10** | **41** | **8** | **154** | **156** | **50** | **80** | **38** | **56** | **73** | **76** | **83** | **90** | **58** | **490** | **229** | **–** | **–** | **–** | **18** | **85** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 50 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య – ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని | | |
| పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | ఆరుంధతీ రాయ్ | 25 |
| రాజ్యం – సంక్షేమం | కె. బాలగోపాల్ | 100 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్సి, ఎస్టి నిధులు, విధిలింపు – మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్సి, ఎస్టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దళిత | కె. బాలగోపాల్ | 120 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి మిత్రులు | 150 |

### చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది | గార్డన్ చైల్డ్ | రు. 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| హక్కుల బాటసారి | బుర్ర రాములు రచనలు | 50 |
| నిగాహ్ | కె. బాలగోపాల్ వ్యాసం సంకలనం | 200 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### కథ – నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| రుదాలి | మహాశ్వేతాదేవి | 45 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగాయి | 100 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| అజేయుడు | అలెగ్జాండర్ ద్యుమా | 160 |
| ఘంటారావం | విక్టర్ హ్యూగో | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh** | **(1956-2006)** | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunuri Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunuri Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunuri Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunuri Bharathi | 150 |
| **On Education** | Mudunuri Bharathi, R.S. Rao | 100 |
| **Understanding Maoists** | N. Venugopal | 300 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 143 -June 2013 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 29/5/2013 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణం మీ నుంచి కోరుతున్నది
# రచనా సహాయం, ఆర్థిక సహాయం

మీ వంటి వేలాది మంది పాఠకుల ఆదరాభిమానాలతోనే వీక్షణం నానాటికీ అభివృద్ధి చెందుతున్నదని మీకు తెలుసు. వీక్షణం తాను పెట్టుకున్న ప్రజా చైతన్య పురోగమన, విస్తరణ లక్ష్యాలకు మరింతగా చేరుకోవాలంటే మీవంటి అభిమానులు, పాఠకులు, రచయితలు, దాతలు మరింతగా చేయూత నందించవలసి ఉంది. మీ చేయూత రచనల రూపంలో కావచ్చు, ఆర్థిక సహాయం రూపంలో కావచ్చు.

వీక్షణంకు రచయితల నుంచి, అభిమానుల నుంచి రచనలు గణనీయంగానే అందుతున్నప్పటికీ ఇంకా ఎక్కువ, ఇంకా నాణ్యమైన రచనలు రావలసి ఉంది. అందుకు మీ పూనిక అవసరం. వీక్షణం మూడు రకాల రచనలకు ప్రాధాన్యతనిస్తుంది : 1) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలలో విరివిగా సమాచారం వస్తున్నప్పటికీ ప్రజానుకూల విశ్లేషణ లేని అంశాలపై ప్రజా దృక్కోణం నుంచి లోతైన విశ్లేషణలు. 2) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలు సాధారణంగా విస్మరించే ప్రజా జీవన పరిణామాల గురించి సమాచార, విశ్లేషణా రచనలు. 3) ఏ సమాచారాన్నయినా అర్థం చేసుకోవడానికి అవసరమైన పనిముట్లు అందించే దృక్పథ ప్రధానమైన రచనలు.

వీక్షణం ఆర్థిక స్థితి సమస్యాత్మకంగా ఉన్నదని, ఏ నెలకానెల అన్నట్టుగా సాగుతున్నదని మీకు ఎప్పటికప్పుడు నివేదిస్తూనే ఉన్నాం. ప్రతి సంచిక ఆర్థిక లోటుతో నడుస్తున్నది. వ్యక్తిగత చందాలు, సంస్థల చందాలు, పుస్తకాల అమ్మకాలు, విరాళాలు, ప్రకటనలు వంటి వనరులన్నీ ఇంకా పెరిగితే గాని పత్రిక మనుగడ సుస్థిరం కాదు. వీక్షణం అభిమానులు, పాఠకులు ప్రతి ఒక్కరూ పూనుకుని తమ వంతు బాధ్యతగా చందాలు చేర్పించడం, విరాళాలు, ప్రకటనలు సేకరించడం వంటి అన్ని రూపాలలో ఆర్థిక సహాయం అందించడం అవసరం.

**తెలుగు సమాజంలో ప్రగతిశీల ఆలోచనాధారలో, ప్రజానుకూల పత్రికల సంప్రదాయంలో కృషి చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం**

**తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణ వీక్షణం**

**ఈ సంభాషణను విస్తరిద్దాం! తెగిపోకుండా కాపాడుకుందాం!**

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao